భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ వామన పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ వామన పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ వామన పురాణం


వచనం : డాక్టర్ **జయంతి చక్రవర్తి**
విజయవాడ. 9390526272

కాపీరైట్ : పబ్లిషర్స్

ప్రథమ ముద్రణ : 2014

ముఖచిత్రం : రమణ

డి.టి.పి. & పేజి లే-అవుట్ : విద్యార్థి క్రియేషన్స్
విజయవాడ

ముద్రణ : శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ-3

ప్రచురణ : **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**
నసురుల్లాఖాన్ వీధి
అరండల్‌పేట, విజయవాడ

వెల : ₹. 60 /-




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

**వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్**



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి**, అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...





Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దధ్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశథా కృత్వా భూర్లోకేఽ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోఢీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ద్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోஉశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ వామన పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయందీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో పద్నాలుగో పురాణం శ్రీవామన మహాపురాణం. బ్రహ్మదేవుడు వామనుడి మాహాత్మ్యాన్ని కీర్తిస్తూ చెప్పిన పురాణం కాబట్టి దీనికి వామన పురాణం అన్న పేరు వచ్చింది. 'త్వగస్య వామనం స్మృతం' అన్న వచనాన్ని బట్టి ఈ పురాణం పురాణ పురుషుడైన శ్రీహరి చర్మంగా వర్ణించబడింది. 'సంఖ్యాయా దశ సాహస్రం ప్రోక్తం కులపతే పురా" అన్న వాక్యాన్ని బట్టి ఈ పురాణంలో పదివేల శ్లోకాలున్నాయని తెలుస్తోంది.

వామన పురాణంలో మొత్తం 95 అధ్యాయాలున్నాయి. ఇది పూర్వ, ఉత్తరభాగాలుగా విభజించబడింది. ఈ రెండు భాగాలలో రెండోదైన ఉత్తర భాగాన్ని 'బృహద్వామనం' అని కూడా వ్యవహరిస్తారు. ఈ బృహద్వామన పురాణంలో నాలుగు సంహితలున్నాయి. 1.మాహేశ్వరీ సంహిత 2.భాగవతీ సంహిత 3.సౌర సంహిత 4.గణేశ్వరీ సంహిత. వీటిలో ప్రతి సంహితలో సుమారు వెయ్యి శ్లోకాలుంటాయి. ప్రస్తుతం బృహద్వామనంగా చెబుతున్న ఉత్తరభాగం లభించటం లేదు. కేవలం మనకి పూర్వభాగం మాత్రమే అందుబాటులో ఉంది. ఇందులో ఉన్న 95 అధ్యాయాల్లో ఆరువేల శ్లోకాలు మాత్రమే ఉన్నాయి.

వామనపురాణంలో ప్రత్యేకంగా దివ్యస్తోత్రాలు చెప్పబడ్డాయి. ఇందులో 12 మహావిష్ణుస్తోత్రాలు, 8 శివస్తోత్రాలు, 4 దేవీ స్తోత్రాలు, ఒక సుదర్శన దివ్యస్తోత్రంతో కలిపి మొత్తం 25 స్తోత్రాలున్నాయి. ఇవన్నీ పారాయణ యోగ్యత కలిగినవే.

# వామన పురాణంలో చెప్పిన విషయాలు

**పూర్వభాగం :** ఇందులో కూర్మ కల్పానికి చెందిన ఆఖ్యానాలు చెప్పబడ్డాయి. పురాణ ప్రశ్న, బ్రహ్మశిరచ్ఛేదం, కపాలమోచన వృత్తాంతం, దక్షయజ్ఞవిధ్వంసం, హరుడికి కాలరూపుడనే పేరు రావటం, కామదహన వృత్తాంతం, ప్రహ్లాద నారాయణ యుద్ధం, దేవాసుర సంగ్రామం, సుకేశి అర్క సమాఖ్యానం, భువనకోశం, కామ్యవ్రతం, శ్రీదుర్గాదేవి చరిత్ర, తపతీ చరిత్ర, కురుక్షేత్ర మాహాత్మ్యం, సతీమాహాత్మ్యం, పార్వతీ దేవి జనన వృత్తాంతం.

పార్వతీదేవి వివాహం, గౌరీ ఉపాఖ్యానం, కౌశికీ ఉపాఖ్యానం, కుమార చరితం, అంధక వధ, సాధ్యోపాఖ్యానం, జాబాలి చరిత్ర, అరజాకథ, అంధకేశ్వర యుద్ధం, మరుత్తుల జన్మ కథనం, బలిచరిత్ర, లక్ష్మీదేవి చరిత్ర, త్రివిక్రమ చరిత్ర, ప్రహ్లాద తీర్థయాత్ర సందర్భంగా వివిధ కథనాలు, ప్రేతోపాఖ్యానం, నక్షత్ర పురుషుల వృత్తాంతం, శ్రీరాముడి చరిత్ర, శ్రీదాముడి చరిత్ర, త్రివిక్రమ చరిత్ర, బ్రహ్మస్తవం, ప్రహ్లాద బలి సంవాదంలో చెప్పిన శ్రీహరి స్తోత్రం. బ్రహ్మచేసిన వామనస్తుతి, విష్ణు పంజర స్తోత్రం, శంకరుడు చేసిన చక్రపాణి స్తుతి లాంటి ప్రధాన విషయాలు వివరంగా చెప్పబడ్డాయి.

**ఉత్తరభాగం :** ఈ ఉత్తరభాగం మాహేశ్వరీ, భాగవతీ, సౌరీ, గాణేశ్వరీ అని నాలుగు సంహితలుగా చెప్పబడింది. వీటిలో అద్భుతమైన జగన్మాత అవతారగాథ, శ్రీకృష్ణుడి వృత్తాంతం, ఆయన గుణగణాల కీర్తనం, కృష్ణభక్తుల వృత్తాంతం, పాపనాశకమైన సూర్యుడి మహిమ, గాణేశ్వరీ సంహితలో గణపతి చరిత్ర వివరంగా వర్ణించబడ్డాయి.

పూర్వం ఈ పురాణాన్ని పులస్త్య బ్రహ్మ నారద మహర్షికి చెప్పగా, నారదుడి నుంచి వ్యాసమహర్షి, వ్యాసుడి నుంచి వ్యాసుడి శిష్యుడు రోమహర్షణుడనే సూతుడు తెలుసుకుని, ఆయన దాన్ని తిరిగి నైమిశారణ్యంలో ఉన్న శౌనకాది మహామునులకి బోధించాడు.

## నారదుడి ప్రశ్న

త్రైలోక్య రాజ్య మాక్షిప్య బలేరింద్రాయ యో దదే ।
శ్రీధరాయ నమస్తస్మై ఛద్మ వామన రూపిణే ॥

బలిచక్రవర్తి చేత ఆక్రమించబడ్డ ముల్లోకాలనీ, వామనుడి అవతారం ధరించి, అతన్నుంచి లాక్కుని ఇంద్రుడికి అందించిన శ్రీధరుడికి నమస్కారం.

ఒకనాడు జ్ఞాన శ్రేష్ఠుడు, శ్రీహరినామ సంకీర్తనా ప్రియుడు అయిన నారదమహర్షి పులస్త్యుడి దగ్గరకి వెళ్ళి "బ్రహ్మర్షీ! సకల సమర్థుడైన శ్రీహరి పూర్వం ఎందుకు మరుగుజ్జు రూపాన్ని ధరించాడు? దైత్యుల్లో జన్మించినప్పటికీ హరిభక్తుడైన ప్రహ్లాదుడు దేవతలతో ఎందుకు యుద్ధం చేసాడు? అలాగే దక్షుడి పుత్రిక దాక్షాయణీదేవి తన శరీరాన్ని వదిలి తిరిగి హిమవంతుడి ఇంట ఎందుకు జన్మించింది? తిరిగి శంకరుణ్ణే ఎందుకు వివాహం చేసుకుంది? ఈ సందేహాలన్నీ నీవు తొలగించు. ఓ సర్వజ్ఞా! విప్రోత్తమా! వాటితో పాటు వివిధ రకాల వ్రతాలు అవి చేసే విధానాలు, తీర్థక్షేత్రాల మాహాత్మ్యం, దానాల మాహాత్మ్యం ఇలాంటి విశేషాలన్నీ నాకు దయచేసి తెలియచేయి "అని ప్రార్థించాడు. నారదుడు కోరిన విధంగా పులస్త్యుడు వామన పురాణంలోని విశేషాలన్నీ సవివరంగా ఆయనకి బోధించాడు.

## సతీ శివుల విహారం

దక్షుడి కుమార్తె దాక్షాయణిని వివాహం చేసుకున్న పరమేశ్వరుడు ఆమెతో కలిసి ఆనందంగా మందరగిరి మీద విహరించసాగాడు. వారిద్దరూ అలా సంతోషంగా కాలం గడుపుతుండగా గ్రీష్మ ఋతువు ప్రవేశించింది. ఎండవేడిమి భరించలేని సతీదేవి "ప్రభూ! ఈ వేసవి తాపాన్ని భరించలేక పోతున్నాను. మనకి ఎండవేడిమి తట్టుకునే సరైన నివాసమే లేక పోయిందే! అని పలికింది. దేవీ! నేనెప్పుడూ ఎలాంటి ఆశ్రయం లేనివాడినే అందుకే ఇదిగో ఇలా అరణ్యవాసం చేస్తున్నాను. మనకిది తప్పదు" అన్నాడు శంకరుడు. భర్తమాట జవదాటకుండా సతీదేవి అలాగే వేసవివేడిని ఓర్చుకుని కాలం గడిపింది.

వేసవి వెళ్ళిపోయింది. వర్ష ఋతువు ప్రవేశించింది. ఆకాశం మేఘావృతమై దిక్కులన్నిటినీ చీకటి చేస్తూ వానాకాలం ప్రారంభమైంది. చల్లటి గాలులు బలంగా వీయటం మొదలుపెట్టాయి. అలాంటి భయంకరమైన వాతావరణాన్ని తట్టుకోలేని సతీదేవి "ప్రియా! శంకరా! గుండెలు బ్రద్ధలయ్యే ధ్వనితో మేఘాలు గర్జిస్తున్నాయి. చల్లని గాలులు శరీరాన్ని కోసేంత వేగంగా వీస్తున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. నెమళ్ళు కేకారావాలు చేస్తున్నాయి. ఎడతెరిపి లేకుండా ధారాపాతంగా వర్షం కురుస్తోంది.

వర్షాకాలపు చలిగాలులకి కదంబ, సర్జ, అర్జున కేతకీ పుష్పాలన్నీ రాలి పడుతున్నాయి. మేఘాల గర్జనలు విని సరోవరంలో సంచరిస్తున్న హంసలు బెదరి పారిపోతున్నాయి. శంకరా! ఇలాంటి భయానకమైన వర్షాకాలాన్ని ఎలా గడపాలో తెలియటం లేదు. మనం ఆరుబైట నివసిస్తున్నాం. ఈ కాలాన్ని గడపటం సాధ్యం కాదు. కనుక మనం నివసించటానికి తగిన గృహాన్ని దయచేసి నిర్మించు" అని కోరింది.

సతీదేవి కోరికవిన్న శంకరుడు "దేవీ! నేనేం చేయగలను? నా దగ్గర ధనం లేదు. నా శరీరం మీద పులిచర్మం, చంద్రవంక, సర్పహారం, కుడి ఎడమ చేతులకి సర్పాభరణాలు, చేతిలో త్రిశూలం, ఢమరుకం, నీలుడనే సర్పం మొలత్రాడు, ఇవి తప్ప ఇంకేమున్నాయి" అని అన్నాడు.

సతీదేవికి శంకరుడి మాటలు రుచించలేదు. నిష్ఠూరంగా ఆయనతో "నాథా! మీరు చెప్పినవన్నీ నిజాలే. కాదనను. అయినా మీరు శక్తిసంపన్నులు కదా! ఇలా ఆరుబైట వర్షాకాలమంతా కాలక్షేపం చేయమంటే ఎలా? రోజూ తడుస్తూ ఈ చెట్ల కిందా పుట్లకిందా నేనెలా ఉండగలను? అందుకే ఇంత గట్టిగా తమని ఇల్లు నిర్మించమని కోరుతున్నాను" అన్నది.

సతి ఆక్రోశం విన్న శంకరుడు చిన్నగా నవ్వి దేవీ! నీ బాధ వర్షంలో తడుస్తాననేగా, సరే ఒక పని చేస్తాను. ఒక్క వర్షం చుక్క కూడా నీ మీద పడకుండా చూస్తాను అనిచెప్పి ఒక్కసారిగా సతీదేవిని ఎత్తుకుని మేఘాల పైన

ఎక్కి కూర్చున్నాడు. అలా మేఘమండలాన్ని తనకి ఆసనంగా చేసుకోవటంతో ఆనాటి నుంచీ శంకరుడికి జీమూత కేతువు అనేపేరు వచ్చింది.

క్రమంగా వర్ష ఋతువు ముగిసి శరదృతువు ప్రవేశించింది. లోకమంతా చల్లగా ఆహ్లాదకరంగా మారిపోయింది. సరోవరాలన్నీ పద్మాలతో నిండిపోయాయి. అప్పటిదాకా గుహల్లో వాన భయంతో తలదాచుకున్న జంతువులన్నీ గుహవిడిచి అరణ్యంలో సంతోషంగా సంచరించసాగాయి. పక్షులు కిలకిల రావాలతో గీతాలు పాడుతున్నాయి. అలాంటి మనోహర వాతావరణం ఏర్పడగానే అప్పటిదాకా మేఘాల మీద కొలువున్న శంకరుడు దాక్షాయణిని తీసుకుని తిరిగి మందరగిరి పైకి వచ్చాడు. శరదృతువు ఎంతో ఆహ్లాదంగా ఉండటంతో సతీదేవికి ఏమీ బాధనిపించలేదు. అలా సతీ శంకరులు ఆనందంగా మందరగిరిమీద కాలం గడుపుతున్నారు.

## దక్షయజ్ఞం ఆరంభం

శరత్కాలం గడిచింది ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించింది. ఆ పవిత్ర కాలంలో దక్షప్రజాపతి ఒక దివ్య క్రతువుని ప్రారంభించాడు. మహావైభవంగా చేయబోతున్న ఆ క్రతువుని దర్శించటానికి ఇంద్రాది సకలదేవతల్ని, కశ్యపాది మహర్షుల్ని ఆహ్వానించాడు. వారితో పాటు సంవ్రతులైన అరుంధతీ వశిష్ఠ దంపతుల్ని, అత్రి అనసూయాదంపతుల్ని, ధృతి-కౌశికులని, అహల్యా గౌతముల్ని, అనసూయా భరద్వాజుల్ని, చంద్ర అంగిరసుల్ని తన యాగానికి ఆహ్వానించి, ఆ మహర్షులందర్నీ యాజ్ఞికులుగా నియమించాడు.

అహింసా దేవితో కలిసి వచ్చిన ధర్మపురుషుణ్ణి యజ్ఞవాటిక ద్వారపాలుడిగా ఉంచాడు. అరిష్టనేమిని సమిధలు తెమ్మని ఆజ్ఞాపించాడు. భృగుమహర్షికి మంత్ర సంస్కార బాధ్యతని అప్పగించాడు. తరువాత రోహిణీ సమేతుడై విచ్చేసిన తన అల్లుడు చంద్రుణ్ణి పిలిచి ధనాధిపత్యాన్ని స్వీకరించమన్నాడు. ఒక్క సతీ శంకరదంపతుల్ని తప్ప, మిగిలిన అల్లుళ్ళని, కూతుళ్ళని, దౌహిత్రుల్ని అందర్నీ యాగానికి ఆహ్వానించాడు దక్షుడు.

దక్షుడు శంకరుణ్ణి యాగానికి ఆహ్వానించకపోవటానికి కారణం శంకరుడు కపాలి అవటమే. పూర్వం రజోగుణంతో నిండిన బ్రహ్మదేవుడు తన అయిదో తలతో శంకరుణ్ణి కించపరిచేలా మాట్లాడాడు. అది విని ఆగ్రహించిన శంకరుడు తన గోటితో బ్రహ్మ అయిదో తలని ఖండించాడు. ఎప్పుడైతే బ్రహ్మ తల ఖండించబడిందో అది సరాసరి వచ్చి శంకరుడి చేతికి అతుక్కుంది. ఎంత చేసినా అది వదల్లేదు. ఆ విధంగా శంకరుణ్ణి బ్రహ్మహత్యా పాపం అంటుకుంది.

బ్రహ్మహత్యా పాపాన్ని, బ్రహ్మకపాలాన్ని వదిలించుకోవాలని శంకరుడు ఎన్నో దివ్యక్షేత్రాలు తిరిగాడు. అయినా అది వదల్లేదు. నారాయణుణ్ణి శరణువేడదామని బదరికాశ్రమానికి వెళ్ళాడు. అక్కడాయన జాడ కనిపించలేదు. అక్కణ్ణుంచి బయలుదేరి భూలోకంలో ఉన్న సుప్రసిద్ధ క్షేత్రాలన్నీ దర్శించాడు. ఎక్కడికి వెళ్ళినా ఆయన్ని వెంటాడుతున్న బ్రహ్మహత్య, ఆయన చేతికంటిన బ్రహ్మకపాలం వదల్లేదు. అలా తిరిగీ తిరగీ శంకరుడు ఒకనాడు కురుజాంగల క్షేత్రానికి వచ్చాడు. శంఖచక్రగదాధారి అయిన శ్రీమన్నారాయణుడు అక్కడ శంకరుడికి దర్శనమిచ్చాడు. పుండరీకాక్షుణ్ణి దర్శించిన ఆనందంలో శరీరమంతా పులకరించగా శంకరుడాయన్ని ఇలా స్తుతించాడు.

## శంకరకృత గరుడధ్వజ స్తుతి

నమస్తే దేవతానాథ నమస్తే గరుడధ్వజ ।
శంఖచక్రగదా పాణే వాసుదేవ నమోఽస్తుతే ॥ 1

నమస్తే నిర్గుణానంత అప్రతార్క్యాయ వేధసే ।
జ్ఞానాజ్ఞాన నిరాలంబ సర్వాలంబ నమోస్తుతే ॥ 2

రజోయుక్త నమస్తేఽస్తు బ్రహ్మమూర్తే సనాతన ।
త్వయా సర్వమిదం నాథ జగత్సృష్టం చరాచరమ్ ॥ 3

సత్త్వాధిష్ఠిత లోకేశ విష్ణుమూర్తే అధోక్షజ ।
ప్రజాపాల మహాబాహో జనార్దన నమోస్తుతే ॥ 4

తమోమూర్తే అహం హ్యేష త్వదంశ క్రోధసంభవః ।
గుణాభియుక్త దేవేశ సర్వవ్యాపిన్ నమోఽస్తుతే ॥ 5

భూరియం త్వం జగన్నాథ జలాంబర హుతాశనః ।
వాయుర్బుద్ధిర్మనశ్చాపి శర్వరీ త్వం నమోఽస్తుతే ॥ 6

ధర్మోయజ్ఞ స్తపః సత్య మహింసా శౌచమార్జవమ్ ।
క్షమా దానం దయా లక్ష్మీ ర్బ్రహ్మ చర్యం త్వమీశ్వర ॥ 7

త్వం సాంగాశ్చతురో వేదా స్త్వం వేద్యో వేదపారగః ।
ఉపవేదా భవానీశ సర్వోఽసి త్వం నమోఽస్తుతే ॥ 8

నమో నమస్తేఽచ్యుత చక్రపాణే నమోఽస్తుతే మాధవ మీనమూర్తే ।
లోకే భవాన్ కారుణికో మతోమే త్రాయస్వ మాం కేశవ పాశబంధాత్ ॥ 9

మమాశుభం నాశయ విగ్రహస్థం యద్బ్రహ్మ హత్యాఽభిభవం బభూవ ।
దగ్ధోఽస్మి నష్టోఽస్మ్య సమీక్ష్య పునీహి తీర్థోఽసి నమో నమస్తే ॥ 10

*(శ్లో॥14-23,అధ్యా-3)*

"ఓ దేవేశ్వరా! గరుడధ్వజా! నీకు నమస్కారం. ఓ తీర్థస్వరూపా! నన్నీ జ్వాలల నుంచి కాపాడు. బ్రహ్మహత్యా పాపం నుంచి విముక్తుణ్ణి చేయి. నీకు నమస్కరిస్తున్నాను". ఇలా శివుడు చేసిన స్తుతి విని శ్రీహరి "శంకరా! బ్రహ్మహత్యా దోషం నీకు పోవాలంటే ఈ విధంగా నేను చెప్పినట్టు చేయి.

ఈ కురుజాంగల క్షేత్రానికి తూర్పుగా ప్రయాగక్షేత్రం ఉంది. అక్కడ నా అంశతో నిత్యనివాసిగా మాధవుడున్నాడు. ఆయన దక్షిణపాదం నుంచి సకల పాప నాశని అయిన 'వరుణా' నది పుట్టింది. ఆయన ఎడమపాదం నుంచి పరమపావని అయిన 'అసి'నది ఆవిర్భవించింది. ఈ రెండు నదులూ పరమపవిత్రమైనవి. ఈ రెండు నదుల మధ్య ఉన్న దివ్యక్షేత్రం 'వారణాసి' అది సకల పాపాల్నీ తొలగించే పవిత్ర భూమి. ముల్లోకాల్లో అలాంటి దివ్య క్షేత్రం మరొకటి లేదు.

మంగళకరమైన ఆ వారణాసీక్షేత్రంలో సకల పాపహారుడైన 'లోలార్కేశ్వరు'డున్నాడు. దశాశ్వమేథ క్షేత్రంగా ప్రసిద్ధిచెందిన ఆ నగరంలో నా అంశతో కేశవుడున్నాడు. అలాంటి దివ్యక్షేత్రానికి నీవు వెళ్ళగానే నీ పాపం నశిస్తుంది" అని హిత బోధచేసాడు.

**కపాల మోచనం :** శ్రీహరి మాట విని ఎంతో ఆనందించిన శంకరుడు గరుడధ్వజుడికి నమస్కరించి ఆయన్ని వెంటబెట్టుకుని అతివేగంగా వారణాసికి వెళ్ళాడు. అక్కడవున్న పవిత్రతీర్థాలలో స్నానంచేసి, దశశ్వమేధఘట్టాన్ని లోలార్కేశ్వరుణ్ణి దర్శించి, సకల పాపాలనుంచీ విముక్తుడై తిరిగి శ్రీహరి దగ్గరకి వెళ్ళాడు. ఎందుకంటే అంతచేసినా ఆయన చేతికున్న బ్రహ్మ కపాలం ఊడిపోలేదు. ఆ విషయాన్నే శ్రీహరికి చెప్పాడు. అప్పుడు శ్రీహరి శంకరుడికి కాశీ క్షేత్రంలో ఉన్న ఒక దివ్య సరోవరాన్ని చూపి "శంకరా! పద్మాలతో నిండిన ఈ అందమైన సరోవరం మహిమాన్వితమైనది. పరమ పవిత్రమైన ఈ తీర్థంలో నీవు స్నానం చేయి. వెంటనే నీకు బ్రహ్మహత్యాదోషం పూర్తిగా తొలగిపోయి, నీ చేతికున్న కపాలం ఊడిపోతుంది. నీకు కపాలమోచనం కలిగించిన కారణంగా ఈ తీర్థం రాబోయే కాలంలో కపాలమోచన తీర్థంగా విఖ్యాతి చెందుతుంది" అని చెప్పాడు.

శ్రీహరి చెప్పినట్టుగానే శంకరుడు ఆ కపాలమోచన తీర్థంలో స్నానం చేయగానే ఆయన చేతికంటుకున్న కపాలం ఊడిపోయింది. అదే ఆనాటి నుంచి కపాలమోచన తీర్థంగా సుప్రసిద్ధమయ్యింది.

**సతీదేవి శరీర త్యాగం :** ఈ విధంగా శంకరుడు బ్రహ్మహత్యా పాపాన్ని భరించి, కపాలాన్ని ధరించిన కారణంగా శివుడు అపవిత్రుడయ్యాడని, అమంగళుడయ్యాడని దక్షుడి భావన. ఆ కారణంగానే తన అల్లుణ్ణి కుమార్తె దాక్షాయనిని తాను చేస్తున్న యాగానికి ఆహ్వానించలేదు. అదే సమయంలో గౌతమ మహర్షి కుమార్తె 'జయ' మందరపర్వతం మీద ఉన్న అందమైన వృక్షాల్ని, లతల్ని, గుహల్ని దర్శిస్తూ సతీదేవి దగ్గరకి వచ్చింది. ఒంటరిగా వచ్చిన 'జయ'ని చూసి సతీదేవి 'జయా! నీవొక్కదానివే వచ్చావే, జయంతీ, అపరాజితా అనే నీ సఖులెక్కడ!" అని ప్రశ్నించింది.

జయాదేవి సతీదేవితో "సతీ! వారంతా దక్షప్రజాపతి చేస్తున్న గొప్పయాగాన్ని చూడటానికి వెళ్ళారు. ఆయన మమ్మల్ని కూడా ప్రత్యేకంగా ఆహ్వానించాడు. నేను నా తల్లితండ్రులతో కలిసి వెళ్తూ దారిలో నిన్నోసారి చూసి పోదామని వచ్చాను. అది సరే నీవు, శంకరుడు వస్తున్నారా! లేక తరువాత వస్తారా! సకల ఋషులు, దేవతలు తమ తమ భార్యలతో సహా ఆ యాగానికి వెళుతుంటే, మీరేమిటి ఇంకా బయలుదేరలేదు. దేవీ! అసలు నిన్ను మీ తండ్రి ఆహ్వానించలేదా ఏమిటి? ఎందుకలా దిగులుగా ఉన్నావు" అని అడిగింది.

దక్షయజ్ఞం గురించి వినగానే సతీదేవి ఎంతో ఆవేదన చెందింది. సకలలోక వాసుల్నీ ప్రత్యేకంగా ఆహ్వానించిన తన తండ్రి కన్న కూతుర్నైన తనని, తన భర్తని కనీసం ఆహ్వానించనందుకు ఆమెంతో క్షోభపడింది. ఒక్కసారిగా ఆమెలో క్రోధం విజృంభించటంతో, ఆవేశంతోనే ఆమె అక్కడికక్కడే ప్రాణాలు విడిచింది. ఆ దృశ్యాన్ని చూసి హడలిపోయిన 'జయ' గట్టిగా రోదించ సాగింది. ఆమె ఏడుపు విని శంకరుడు ఏమిటి? ఏం జరిగింది? అని ఆదుర్దాగా అక్కడికొచ్చాడు. ఎదురుగా నరకబడిన తీగలాగా సతీదేవి భూమ్మీద అచేతనంగా పడిఉంది. సతిని ఆ స్థితిలో చూసిన శంకరుడికి ఎంతో వేదన కలిగింది.

**వీరభద్రుడి ఆవిర్భావం :** తన ప్రియపత్ని, కన్నతండ్రి దక్షుడి వల్ల అవమానించబడి ఆత్మత్యాగం చేసినందుకు శంకరుడి శరీరం – మనస్సు ఆగ్రహంతో ఊగిపోయాయి. క్రోధంతో ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. ఆయన శరీరంలోని అన్ని అంగ ప్రత్యంగాలనుంచీ భయంకరమైన విస్ఫులింగాలు బయలుదేరాయి. అలా క్రోధంతో ఉన్మత్తుడైన త్రిలోచనుడి రోమ కూపాలనుంచి వీరభద్రుడు ఆవిర్భవించాడు. అతడి వెనకే కోట్లాది రుద్రగణాలు కూడా పుట్టుకొచ్చాయి. వీరభద్రుడు ఆ గణాలన్నిటినీ వెంటబెట్టుకుని దక్షయజ్ఞశాలకి బయలుదేరాడు.

దక్షయజ్ఞశాలని కాపలా కాస్తున్న ధర్ముడు వీరభద్రుణ్ణి, అతడి గణాల్ని అడ్డగించాడు. ధర్ముడికి శివగణాలకీ మధ్య భీకరంగా యుద్ధం ప్రారంభమయ్యింది.

గణేశ్వరుడు సరాసరి తన ఆయుధాలతో వచ్చి ధర్మణ్ణి ఎదుర్కొన్నాడు. వారిద్దరూ పరస్పరం అస్త్ర శస్త్రాలు ప్రయోగించుకుంటూ యుద్ధాన్ని కొనసాగించారు. అంతలో వీరభద్రుడు తన బాణాలతో ధర్మణ్ణి తీవ్రంగా గాయపరిచాడు. ఆ శరప్రహారాలని తట్టుకోలేక ధర్ముడు యాగశాల నుంచి పక్కకి తప్పుకున్నాడు. వెంటనే వీరభద్రుడు తన అనుచరగణాలతో దక్షుడి యాగశాలలోకి ప్రవేశించి మొత్తం ధ్వంసం చేసేశాడు.

**వీరభద్రుడి విజృంభణ :** వీరభద్రుడి ధాటికి ఎవరూ తట్టుకోలేకపోయారు. భయంకరాకారులైన రుద్రగణాల్ని, వీరభద్ర గణాల్ని చూసే సరికి గుండె లవిసిపోయిన ఋత్విక్కులు, చేస్తున్న యజ్ఞాన్ని వదిలి పారిపోయారు. అలా ఋషులు, మునులు వెళ్ళి నారాయణుణ్ణి శరణువేడారు. నారాయణుడికి వీరభద్రుడి మీద కోపం వచ్చింది. తన పర్యవేక్షణలో జరుగుతున్న యాగాన్ని విధ్వంసం చేస్తున్న వీరభద్రుడికి బుద్ధి చెప్పాలనుకున్నాడు. వెంటనే దివ్యాస్త్రాలు ధరించి అతడి ముందుకొచ్చాడు.

శ్రీహరి తన దగ్గరున్న భయంకరమైన శస్త్రాల్ని వీరభద్రుడి మీదకి ప్రయోగించాడు. అవన్నీ వీరభద్రుణ్ణి ఏమీ చేయలేకపోయాయి. అతడి శరీరాన్ని తాకి పూలలా నేలరాలిపోయాయి. అది చూసి మరిన్ని దివ్యాస్త్రాల్ని ప్రయోగించాడు. అవి కూడా భద్రుణ్ణి కనీసం గాయపరచలేకపోయాయి. ఇక లాభంలేదని తన సుదర్శనాయుధాన్ని ప్రయోగించాడు. అయితే ఆశ్చర్యకరంగా వీరభద్రుడు అమాంతం నోరుతెరిచి ఆ చక్రాయుధాన్ని హఠాత్తుగా మింగేశాడు.

శ్రీహరికి కోపం వచ్చింది. ఒక్కసారి మెరుపులా దూసుకొచ్చి వీరభద్రుడి మీదపడి అతన్ని క్రిందపడేసి కాళ్ళతో బలంగా మర్ధించాడు. శ్రీహరి దెబ్బల్ని సహించలేక తాను మింగిన చక్రాన్ని విడిచిపెట్టాడు వీరభద్రుడు. అలా శ్రీహరిచేత ఓడించబడి గాయాల పాలైన వీరభద్రుడు సరాసరి శంకరుడి దగ్గరకి వెళ్ళి జరిగిన విషయమంతా ఆయనకి విన్నవించాడు. ఆ మాటలు విన్న శంకరుడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. స్వయంగా తానే త్రిశూలాన్ని

ధరించి దక్షయజ్ఞ శాలలోకి ప్రవేశించాడు. ఒక్కసారిగా ప్రళయ భీకరరూపంతో కనిపించిన శంకరుడి విశ్వరూపాన్ని చూసి అక్కడున్న ఋషులు, దేవతలు భయపడిపోయారు.

**దేవతల పలాయనం :** క్రోధాగ్ని జ్వాలలతో ప్రకాశిస్తున్న త్రినేత్రుడి భీకరరూపాన్ని చూసి భయపడ్డ శ్రీహరి కూడా అక్కణ్ణుంచి పారిపోయాడు. అష్టవసువులు కూడా హరుణ్ణి చూసి పరుగెత్తారు. పరమేశ్వరుడి రాకను గురించి తెలుసుకుని ఆ యాగానికి ప్రత్యేక అతిథులుగా వచ్చిన విశ్వేదేవులు, అశ్వినులు, సాధ్యులు, మరుత్తులు, సూర్యాగ్నులు భయంతో అక్కడున్న పురోడాశాన్ని తినేశారు. నక్షత్రాలతో కలిసి పారిపోయి చంద్రుడు ఆకాశంలోకి చేరాడు. శతరుద్రీయాన్ని పఠిస్తూ కశ్యపాది మహర్షులు వణుకుతూ నిలబడ్డారు. అలా ఇంద్రాది దేవతల్ని సైతం భయపెట్టిన శంకరుణ్ణి చూసి దక్షుడి భార్య వీరిణి భయంతో విలపించింది.

అప్పుడు క్రోధావేశంతో నిండిన శంకరుడు ఎవరి మీదా జాలి చూపకుండా దొరికిన వారిని దొరికినట్టు చావబాదాడు. శంకరుడి దెబ్బల్ని తట్టుకోలేక ద్వాదశ ఆదిత్యులు, ఇంద్రాది దేవతలు, మునులు, మహర్షులు హాహాకారాలు చేస్తూ ఆ యాగశాల నుంచి బైటికి పరుగెత్తారు. ఒక్కసారిగా శివుడు ఆ యాగశాలనంతా పరికించి చూసాడు. ఆగ్రహంతో తనమూడో కంటిని తెరిచాడు. అంతే, ఆగ్రహజ్వాలల్లో దక్షయజ్ఞవాటిక మొత్తం భస్మీపటలమైపోయింది.

**యజ్ఞదేవుడి పలాయనం :** శివుడి మూడో కంటిధాటికి దక్షయజ్ఞం విధ్వంసం కాగా హోమకుండంలో మండుతున్న యజ్ఞదేవత చల్లారిపోయి ఒక మృగం (లేడి) రూపాన్ని ధరించి తన భార్య దక్షిణాదేవితో సహా ఆకాశంలోకి ఎగిరిపోయింది. అలా తనని తప్పించుకుపారిపోతున్న యజ్ఞపురుషుణ్ణి చూసి కాలరూపుడైన శివుడు పాశుపతాస్త్రాన్ని ధరించి అతడి వెంటపడ్డాడు. ఆ సమయంలో శంకరుడు జటాజూటాలు ధరించి యజ్ఞశాలలో సగభాగం ఆకాశంలో సగభాగం కాలరూపుడిగా విస్తరించాడు.

## కాలరూపుడి స్వరూపం

1. **శంకరుడి శిరస్సు :** అశ్వని, భరణి, కృత్తిక మొదటి పాదంతో కలిసిన మేషరాశి, దానితో కలిసిన కుజ క్షేత్రం.
2. **శంకరుడి ముఖం :** కృత్తికా మూడుపాదాలు, రోహిణి, మృగశిర రెండు పాదాలు వృషభరాశితో కూడిన శుక్ర క్షేత్రం.
3. **శంకరుడి భుజాలు :** మృగశిరా మూడు, నాలుగుపాదాలు ఆర్ద్రా, పునర్వసు, మొదటి పాదత్రయం మిథునరాశి బుధ క్షేత్రం.
4. **శంకరుడి ఇరుపార్శ్వాలు :** పునర్వసు చివరిచరణం, పుష్యమి, ఆశ్లేషా నక్షత్రాలతో కలిసిన కర్కాటక రాశి, చంద్ర క్షేత్రం.
5. **శంకరుడి హృదయం :** మఖ, పూర్వఫల్గుణీ, ఉత్తరఫల్గుణీ నక్షత్రం మొదటి పాదంతో కూడుకున్న సింహరాశి రవి క్షేత్రం.
6. **శంకరుడి ఇతరభాగాలు :** బుధుడి రెండో గృహం, కన్యారాశి, మిగిలిన ఉత్తర ఫల్గుణీ మూడు పాదాలు హస్తా, చిత్తా నక్షత్రపాద ద్వయాలు.
7. **శంకరుడి నాభిస్థానం :** శుక్రుడి రెండో ఇల్లు తులారాశి, చిత్తానక్షత్రం మూడు నాలుగుపాదాలు, స్వాతి, విశాఖా నక్షత్రానికి చెందిన మూడుపాదాలు.
8. **శంకరుడి గుహ్యాంగం :** కుజగ్రహానికి రెండో ఇల్లు వృశ్చికరాశి, విశాఖా నాలుగోపాదం, అనురాధా, జ్యేష్ఠా నక్షత్రాలు.
9. **శంకరుడి ఊరువులు :** బృహస్పతి క్షేత్రం ధనూరాశి. మూలా, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ మొదటి చరణం.
10. **శంకరుడి మోకాళ్ళు :** శనిగృహం, మకరరాశి, ఉత్తరాషాఢ రెండు, మూడు నాలుగు పాదాలు, శ్రవణం, ధనిష్ఠా రెండు రెండు పాదాలు.
11. **శంకరుడి జంఘులు(పిక్కలు) :** ధనిష్ఠా మూడు నాలుగు పాదాలు, శతభిషం, పూర్వాభాద్రా మూడు పాదాలు సూర్యుడి రెండో ఇల్లు కుంభరాశి.
12. **శంకరుడి పాదద్వయం :** పూర్వాభాద్రా చివరి పాదం, ఉత్తరాభాద్రా రేవతీ నక్షత్రాలు, బృహస్పతి రెండో ఇల్లు మీనరాశి.

ఈ విధంగా అనంతమైన కాలరూపాన్ని ధరించిన త్రిలోచనుడు కోపంగా అస్త్రాన్ని సంధించి పారిపోతున్న యజ్ఞమృగాన్ని ప్రహరించాడు (కొట్టాడు). ఆ బాణాల దెబ్బకి యజ్ఞమృగం తారలతో కలిసి అలా ఆకాశంలోనే నిలబడిపోయింది.

## ద్వాదశ రాశుల స్వరూపాలు - లక్షణాలు

1. **మేషరాశి :** ఇది గొర్రె ఆకారంలో ఉంటుంది. ధాన్యాలు, గనులు, మేకలు, ధనరాశులు, పచ్చిక బయళ్ళు, పచ్చగా కళకళలాడే జలాశయాలు ఇవి ఈ రాశి ప్రభావానికి లోనయ్యే వస్తువులు.
2. **వృషభరాశి :** ఇది వృషభాకారంలో ఉంటుంది. గోశాలలు, వ్యవసాయ భూముల్ని ఇది ప్రభావితం చేస్తుంది.
3. **మిథునరాశి :** ఇది దంపతుల జంటలాగా ఉంటుంది. శయ్య (మంచం) ఆసనాలు, వీణ, వేణువులాంటి వాద్యాలు, గీత, నర్తనాదులు శిల్పకళ, క్రీడలపట్ల ఆసక్తి, అభినివేశం, కేళీవిహార సుందర భూములు ఈ రాశి ప్రభావితం చేసే వస్తువులు. ఇది ద్వేధాత్మకమైన రాశి.
4. **కర్కాటక రాశి :** ఇది ఎండ్రకాయ ఆకారంలో వుంటుంది. దీని సంచార స్థానాలు నివాస స్థానాలు. నీరు మాగాణీ భూములు, బావులు, నదీ తటాకాలు, ఏకాంతమైన భూములు మొదలైనవి.
5. **సింహరాశి :** ఇది సింహం ఆకారంలో ఉంటుంది. దాని స్థానాలు ఇలా ఉంటాయి. కొండలు, కోనలు, అడవులు, లోయలు, గుహలు, వేటగాళ్ళ పల్లెలు లాంటి దుర్గమమైన ప్రదేశాలు.
6. **కన్యారాశి :** ఒకచేత్తో ధాన్యం కంకులు, మరోచేత్తో కరదీపిక పట్టుకుని నావమీద కూర్చున్న కన్యలాగా ఉంటుంది ఈ రాశి స్వరూపం. స్త్రీ పురుషుల సమాగమ స్థలాలు, రెల్లు పొదలు ఈ రాశి సంచార స్థానాలు.
7. **తులారాశి :** చేతిలో త్రాసు పట్టుకున్న పురషాకృతితో ఈ రాశిస్వరూపం ఉంటుంది. వ్యాపార స్థలాలు, వ్యాపార సంస్థలు, అంగళ్ళు, బజార్లు మొదలైనవి ఈ రాశి సంచార స్థానాలు.

**8. వృశ్చికరాశి :** ఇది తేలు ఆకారంలో ఉంటుంది. పుట్టలు, మెట్టప్రాంతాలు, గుంటలు, విషం, ఆవుపేడ, రాళ్ళు, రప్పలు, కీటకాలు వీటిని ఈ రాశి ప్రభావితం చేస్తుంది.

**9. ధనూరాశి :** గుర్రం లాంటి పిరుదులు కలిగి, చేతిలో ధనుస్సు ధరించి, పురుషాకృతితో కనిపించేది ఈ ధనూరాశి. వీరులు, శూరులు, అస్త్రకోవిదులు, రథ, గజ, తురగాలు(గుర్రాలు) ఈ రాశికి సంబంధించిన స్థానాలు.

**10. మకరరాశి :** ఇది లేడి ముఖంతో ఎద్దు భుజాలతో కళ్ళు, రోమాలు కలిగి మొసలి ఆకారంలో ఉంటుంది. నదుల్లో సంచరిస్తూ సముద్రంలో నివాసం కలిగి ఉంటుంది.

**11. కుంభరాశి :** నీళ్ళులేని కుండని భుజాలమీద పెట్టుకుని తడిసిన పురుషుడిలా ఈ కుంభరాశి ఉంటుంది. జూదగృహాలు, మద్యపానశాలలు, ఈ రాశి సంచరించే స్థానాలు

**12. మీనరాశి :** పరస్పరం జతగా కలిసిన చేపలజంటలాగా ఈ రాశి ఉంటుంది. పవిత్రమైన తీర్థాలలో, సముద్రాలలో, క్షేత్రాలలో సంచరిస్తూ, పుణ్యదేశాలలో, దేవబ్రాహ్మణ గృహాలలో ఈ రాశి నివాసం కలిగి ఉంటుంది.

## నరనారాయణులు

బ్రహ్మ మానసపుత్రుడైన ధర్ముడి భార్య దాక్షాయణీదేవి. ఆ పుణ్యదంపతులకి హరి, కృష్ణుడు, నరుడు–నారాయణుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వారిలో హరి–కృష్ణుడు అనే ఇద్దరూ యోగాభ్యాసాన్ని చేస్తూ కాలం గడుపుతుండగా, నర–నారాయణులిద్దరూ లోకకల్యాణం కోసం హిమాలయాల్లో ఉన్న బదరికాశ్రమంలో పరబ్రహ్మని గురించి కఠోరమైన తపస్సు చేయసాగారు.

నర నారాయణులు చేసే తపస్సుకి ప్రపంచమంతా తల్లడిల్లిపోయింది. వారితపోజ్వాలలు అన్ని లోకాల్నీ తాపానికి గురిచేస్తున్నాయి. అది చూసి ఇంద్రుడు భయపడిపోయి తన అధీనంలో ఉన్న అప్సరగణాల్ని వారితోపాటు వసంత మన్మథుల్ని కూడా వారి దగ్గరకి పంపించారు.

వసంతుడు రావటంతో బదరికాశ్రమం అంతా చెట్లు చిగురించి, పూలతో, ఫలాలతో నందన వనంలా మారిపోయింది. అలా అందంగా విరాజిల్లుతున్న బదరికాశ్రమంలో మన్మథుడు విహరించసాగాడు. అలా విహరిస్తున్న మన్మథుణ్ణి చూసి నారాయణ ఋషి "ఓయీ! మన్మథా! రావయ్యా రా! వచ్చి ఇలా కూర్చో" అని ఆహ్వానించాడు. ఋషి మాటలు వినగానే మన్మథుడికి భయం వేసింది. వెంటనే నారాయణ ఋషి అతడితో వచ్చిన వసంతుణ్ణి అప్సరసల్ని కూడా పిలిచి స్వాగతసత్కారాలు చేసాడు. వారంతా ఆశ్చర్యపోయి చూస్తుండగా నారాయణముని ఒక పూలగుత్తిని తీసుకుని తన తొడలమీద చిన్నగా తాకించాడు. అంతే అందరికి సంభ్రమం గొలిపేలా ఆయన తొడనుంచి సర్వాంగ సుందరి అయిన ఒక స్త్రీ ఆవిర్భవించింది.

దివ్యాలంకార సంశోభిత అయిన ఆ సుందరిని చూసి ఆమె తన భార్య రతీదేవే అని భ్రమపడ్డాడు మన్మథుడు. అదే ముక్కు, అవే పెదవులు, అదే లావణ్యం, అదే సౌందర్యం. ఈ దివ్య సుందరి అచ్చం నా భార్య రతీదేవిలా కాదు కాదు అంతకన్నా గొప్పగా వుందని" అనుకుని ఆమెని అలాగే రెప్పవేయకుండా చూస్తున్నాడు. వసంతుడికి కూడా అదే స్థితి. ఇక అప్సరసలైతే ఆమెని చూసి ముల్లోకాల్లో ఆ స్త్రీతో సమానమైన అందగత్తెలు లేరు. ఇక రారు అని నిర్ధారించుకున్నారు. ఈ విధంగా అప్సరసలు, మన్మథ వసంతులు తాను సృష్టించిన కన్యని చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనౌటాన్ని చూసి నారాయణ మహర్షి నవ్వుతూ మన్మథ వసంత అప్సరసలారా! నా తొడ నుంచి పుట్టిన ఈ సుందరికి 'రంభ' అని పేరు పెడుతున్నాను. ఈమెని తీసుకెళ్ళి నా కానుకగా ఇంద్రుడికి సమర్పించండి. ఇక వెళ్ళండి" అని ఆజ్ఞాపించాడు.

నారాయణముని మాటలు విన్న వారు ఎలాంటి ఆలస్యం చేయకుండా వెంటనే ఆమెని తీసుకుని స్వర్గానికి వెళ్ళి ఇంద్రుడికి సమర్పించారు. ఆపై జరిగిందంతా ఆయనకి చెప్పగానే ఇంద్రుడెంతో ఆశ్చర్యపోయాడు. నర నారాయణు లిద్దరూ అసామాన్యులు, కారణజన్ములు అని గుర్తించాడు. నర నారాయణులకి చెందిన ఈ అద్భుతగాథ అన్నిలోకాల్లో వ్యాపించింది.

# నర నారాయణులతో ప్రహ్లాదుడి యుద్ధం

హిరణ్యకశిపుణ్ణి నరసింహావతారంలో శ్రీహరి సంహరించాక, దానవకులానికి ప్రతినిధిగా అతడి కుమారుడు ప్రహ్లాదుడు పట్టాభిషిక్తుడయ్యాడు. సహజంగానే శ్రీహరిభక్తుడైన ప్రహ్లాదుడి పాలనలో దేవ బ్రాహ్మణులు పూజించబడ్డారు. యజ్ఞయాగాది క్రతువులు నిర్విఘ్నంగా కొనసాగుతున్నాయి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు తమ తమ వర్ణాశ్రమ ధర్మాల్ని తు.చ తప్పకుండా పాటిస్తున్నారు. ఇక స్వర్గంలో ఉన్న దేవతలు కూడా ఎలాంటి శత్రుభయం, యుద్ధభయం లేకుండా సంతోషంగా వున్నారు.

ఒకనాడు బార్గవ వంశీయుడైన చ్యవనమహర్షి నర్మదానదీ తీరంలో ఉన్న నకులీశ్వర తీర్థానికి వచ్చాడు. ఆ తీర్థంలోకి దిగి స్నానం చేస్తుండగా గోధుమరంగుతో ఉన్న ఒక మహాసర్పం ఆయన్ని కాటేసింది. సర్పం కాటుకి ముని శరీరంలోకి విషం ప్రవేశించింది. అది గ్రహించిన చ్యవనుడు వెంటనే ఆర్తత్రాణ పరాయణుడై శ్రీహరిని స్మరించాడు. అంతే ఒక్కసారిగా ఆయనలో ప్రవేశించిన విషం నిర్వీర్యమైపోయింది. అప్పుడా చ్యవనుడు ఆ సర్పాన్ని పట్టుకుని దాన్ని తీసుకెళ్ళి పాతాళంలో వదిలాడు.

పాతాళానికి చేరిన చ్యవనమహర్షిని అక్కడి నాగకన్యలు, సర్పరాజులు ఎంతో గౌరవంగా పూజించారు. అలా వారందరి సత్కారాలూ అందుకుంటూ తిరుగుతున్న చ్యవనుడు ఒకనాడు అక్కడే వున్న దానవలోకంలో ప్రవేశించాడు. ఆ లోకంలో సకల దైత్యుల సమూహంతో పూజించబడుతున్న ప్రహ్లాదుణ్ణి చూసాడు. మహాపరాక్రమవంతుడైన ప్రహ్లాదుడు చ్యవనమహర్షిని చూసి ఎంతో ఆదరంగా ఆయన్ని ఆహ్వానించి అతిథి మర్యాదలు చేసి, ఆయన వచ్చిన కారణాన్ని అడిగాడు.

చ్యవనుడు ప్రహ్లాదా! నేను భూలోకంలో మహాదేవుడైన నకులీశ్వరుడి దర్శనం కోసం బయల్దేరాను. ఆ స్వామి దగ్గరకొచ్చి అక్కడున్న కుండంలో స్నానానికి దిగగానే ఒక మహాసర్పం నన్ను పట్టుకుంది. ఎలాగో దాని బారినుంచి తప్పించుకుని ఆ సర్పబాధ మరెవరికీ కలగకూడదని పాతాళానికి తెచ్చి వదిలాను.

అలా ఇక్కడికి రావటం వల్ల దైత్యేంద్రుడవైన నిన్ను చూడగలిగాను” అని అన్నాడు  చ్యవనమహర్షి.

చ్యవనుడి మాటలు వినగానే ప్రహ్లాదుడికి భూలోకాన్ని దర్శించాలన్న కోరిక కలిగింది. “భగవాన్! భూలోకంలో పవిత్రమైన పుణ్యతీర్థాలు ఏవి? అవి ఎక్కడున్నాయో చెప్పండి. నాకు వాటిని దర్శించాలని చాలా కుతూహలంగా ఉంది” అని అడిగాడు. అప్పుడు చ్యవనుడు “ప్రహ్లాదా! భూలోకంలో నైమిశారణ్య క్షేత్రం పరమపవిత్రమైన దివ్యతీర్థం. దాన్ని దర్శిస్తే చాలు అన్ని క్షేత్రాల్ని, తీర్థాల్ని దర్శించినట్టే” అని చెప్పాడు.

ప్రహ్లాదుడు వెంటనే దానవులందర్నీ సమావేశ పరిచి “దైత్యులారా, అందరూ సిద్ధంకండి, మనమంతా భూలోకంలో ఉన్న నైమిశారణ్యానికి వెళదాం. అక్కడే కొలువున్న శ్రీహరిని సేవించి మన జీవితాల్ని ధన్యం చేసుకుందాం” అని చెప్పాడు. ప్రభువు మాటవిని దైత్యులంతా బయలుదేరి రసాతలం నుంచి భూలోకంలో ఉన్న నైమిశారణ్యానికి చేరారు. అక్కడున్న దివ్యతీర్థంలో అందరూ పవిత్ర  స్నానాలాచరించారు.

ప్రహ్లాదుడు ఎంతో రమణీయంగా వున్న ఆ నైమిశారణ్యంలో గుర్రమెక్కి సంచరించసాగాడు. అలా తిరుగుతుండగా అరణ్యంలోపల నిర్మలమైన నీళ్ళతో ప్రవహిస్తున్న సరస్వతీ నది కనిపించింది. దాని పక్కనే సందులేకుండా బాణాలతో కొట్టబడ్డ ఒక పెద్ద సాలవృక్షాన్ని చూసి ప్రహ్లాదుడు ఎంతో ఆశ్చర్యపోయాడు. దానికి కొట్టబడ్డ బాణాలన్నీ ఒకదాని ముఖం ఒకటి అంటుకుని చాలా విచిత్రంగా కనిపించాయి.

అద్భుతాకారంతో ఉన్న ఆ బాణాల్ని చూడానే ప్రహ్లాదుడికి ఆశ్చర్యం కలిగింది. ఇంత అందమైన వృక్షాన్ని అలా బాణాలతో గాయపరిచినందుకు కోపం కూడా వచ్చింది. అటూ ఇటూ చూసాడు. అక్కడికి కొంతదూరంలో నల్లని లేడి చర్మాలు ధరించి, దీర్ఘమైన జటాజూటాలతో కూర్చున్న ఇద్దరు తపస్వులు కనిపించారు. వారి పక్కనే ధనస్సు బాణాలు ఉన్నాయి.

అది చూసి ప్రహ్లాదుడు వారి దగ్గరకెళ్ళి వారిని దొంగ మునీశ్వరులుగా భావించి "ఏమయ్యా! ఎవరు మీరు? ఇలా మునుల వేషం ధరించి ఎందుకు అధర్మకార్యాలు చేస్తున్నారు? అసలు మీరు నిజంగా తపస్వులేనా! అలా అయితే మీ దగ్గర ఈ ధనుర్బాణాలు ఎందుకున్నాయి" అని పరుషంగా ప్రశ్నించాడు.

ప్రహ్లాదుడి మాటలువిన్న ఆ మునులిద్దరిలో ఒకడైన నరుడు "దైత్యేంద్రా! మా దగ్గర ఏ ఆయుధాలుంటే నీకెందుకు? సమర్థులైన వారి దగ్గర ఏ వస్తువున్నా అది శోభిస్తుంది. అయినా నీకు మేమెందుకు సమాధానం చెప్పాలి?అని ధీటుగా జవాబిచ్చాడు. అది వినే సరికి ప్రహ్లాదుడికి కోపం ముంచుకొచ్చింది. ధర్మస్థాపన కోసం కంకణం కట్టుకున్న దైత్య రాజుని నేను. నన్నే ధిక్కరించి మాట్లాడతావా! ఎంత ధైర్యం! అసలు నాతో యుద్ధంచేయగలరా! చూస్తుంటే మీరు నిజమైన సన్యాసుల్లా లేరు అని అన్నాడు. వెంటనే నరుడు కూడా ఆవేశంగా "దైత్యేంద్రా! నీవొక్కడివే వీరుడనుకోకు. మేమిద్దరం నరనారాయణులం. ఎవరైనా ఎదిరించే శక్తి సామర్థ్యాలు మాకున్నాయి. అసలు మాతో యుద్ధం చేసి ఎవరూ గెలవలేరు. మేము అజేయులం. అని ప్రతిసమాధానమిచ్చాడు.

**ప్రహ్లాద-నరుల యుద్ధం :** నరుడి సమాధానం ప్రహ్లాదుడిలో పౌరుషాన్ని రేకెత్తించింది. ఆగ్రహంగా వారితో "నరనారాయణులారా! మీ పొగరుకి తగినట్టుగా బుద్ధి చెబుతాను. మిమ్మల్ని ఓడించి నా పరాక్రమాన్ని లోకానికి మరోసారి తెలియచేస్తాను" అని చెప్పి తన సైన్యాన్నంతా అడవి అవతలే ఉంచాడు. తానొక్కడే వారిముందు నిల్చి యుద్ధానికి సిద్ధమని ధనుష్టంకారం చేసాడు. ప్రహ్లాదుడి ధనుష్టంకారాన్ని విని వెంటనే నరుడు తన 'అజగవ' ధనుస్సుని ఎక్కుపెట్టి అతడిమీదకి శరపరంపర కురిపించాడు. ప్రహ్లాదుడు ఆ బాణాలన్నిటినీ తన రెండు రెక్కలున్న బంగారు శరాలతో ఖండించేసాడు. అది చూసి నరుడు మరింత కోపంగా దివ్యాస్త్రాల్ని బైటికి తీసి ప్రహ్లాదుడి మీదకి వరుసగా ప్రయోగించటం ప్రారంభించాడు.

ఆ విధంగా ఒకర్ని మించి ఒకరు శరపరంపర కురిపించుకోసాగారు. అలా వారిద్దరి మధ్యా ఎంతో కాలం యుద్ధం కొనసాగింది. ఒకనాడు ప్రహ్లాదుడు

ఆగ్రహం పట్టలేక బ్రహ్మాస్త్రాన్ని సంధించగా, నరుడు పాశుపతాస్త్రాన్ని ప్రయోగించాడు. సమానశక్తి సామర్థ్యాలు కలిగిన ఆ రెండు అస్త్రాలూ పరస్పరం ఢీకొని నేలమీద పడిపోయాయి. అది చూసి ప్రహ్లాదుడు గదని పట్టుకుని రథం మీదనుంచి నేలమీదకి దూకాడు. ఒక్కసారిగా నరుడి మీదకి దాడిచేసాడు. అది గమనించి నారాయణుడు ముందుకొచ్చి ప్రహ్లాదుణ్ణి ఎదుర్కొన్నాడు.

**ప్రహ్లాద–నారాయణుల యుద్ధం :** శార్ఙ్గ ధనుస్సుని ధరించి తన మీదకి దూసుకొస్తున్న నారాయణుణ్ణి చూసి ప్రహ్లాదుడు ఆగ్రహంగా తన గదని గిరగిరా త్రిప్పి ఆయన తలపై మోదాడు. ప్రహ్లాదుడి గదదెబ్బ తగలగానే ధర్మపుత్రుడైన నారాయణుడి కళ్ళనుంచి జలజలా అగ్నిధారలాంటి నీళ్ళు కారి భూమిమీద పడ్డాయి. నారాయణుడి తలని తాకిన అతడి గద కొండ శిఖరం మీద పడ్డ పిడుగులాగా వందముక్కలైపోయింది. అది చూసి ప్రహ్లాదుడు వెనక్కి వెళ్ళి రథంలో ఉన్న తన ధనుర్బాణాల్ని తీసుకుని నారాయణుడి మీదకి అస్త్రాల్ని ప్రయోగించటం ప్రారంభించాడు.

ప్రహ్లాదుడు ప్రయోగిస్తున్న అస్త్రాల్ని తన దివ్యాస్త్రాలతో ఖండిస్తున్నాడు నారాయణుడు. ఇలా వారిద్దరూ ఒకర్ని మించి మరొకరు భీకరంగా యుద్ధాన్ని కొనసాగిస్తున్నారు. ప్రళయ భీకరంగా సాగుతున్న వారి యుద్ధాన్ని నింగిపై నుంచి చూసిన దేవతలు ఎంతో సంతోషించి వారిమీద పూలవాన కురిపించారు. ఆ విధంగా దేవతలందరికీ ఆనందాన్ని కలిగించేలా నారాయణ ప్రహ్లాదుల యుద్ధం జరుగుతోంది. వారిద్దరి బాణాల ప్రయోగంతో దిక్కులన్నీ నిండిపోయాయి. అప్పుడు నారాయణుడు ఒక దివ్యాస్త్రాన్ని తీసి ప్రహ్లాదుడి మర్మస్థానం మీద కొట్టాడు. ఆ దెబ్బకి తట్టుకోలేని ప్రహ్లాదుడు కొంచెం వెనకడుగువేసి కొద్ది సేపట్లోనే తిరిగి కోలుకున్నాడు. వెంటనే తానుకూడా మహాస్త్రాన్ని తీసి నారాయణుడి వక్షఃస్థలం మీద గురిచూసికొట్టాడు.

అలా ప్రహ్లాద నారాయణులిద్దరూ కేవలం బాణాలతోనే కాక వివిధరకాల ఆయుధాల్ని ఉపయోగించి యుద్ధంచేసారు. చివరికి నారాయణుడు

తన శక్తినంతా ఉపయోగించి ఒకేసారి వేలాది అస్త్రాల్ని స్మరించి వాటిని ప్రహ్లాదుడి మీదకి ప్రయోగించాడు. ప్రచండ వేగంతో వచ్చిన ఆ మహాస్త్రాలన్నీ ప్రహ్లాదుడి శరీరాన్ని తీవ్రంగా గాయపరిచాయి. వాటి తాకిడిని తట్టుకోలేక ప్రహ్లాదుడు రథంమీద ఒరిగిపోయాడు. అది గమనించిన రథసారధి వెంటనే ఆ రథాన్ని అక్కణ్ణుంచి దూరంగా తీసుకుపోయాడు. మర్నాడు బలాన్ని పుంజుకున్న ప్రహ్లాదుడు తిరిగి నారాయణుడి మీదకొచ్చాడు. అలా ఎంత ప్రయత్నించినా ఆయన్ని ఓడించలేకపోయాడు.

**ప్రహ్లాదుడి హరిదర్శనం :** ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంత బలాన్ని ప్రయోగించినా నారాయణుణ్ణి జయించలేకపోవటం ప్రహ్లాదుడికి చాలా అవమానం అనిపించింది. వెంటనే తన ఇష్టదైవమని శ్రీమహావిష్ణువు దగ్గరకెళ్ళాడు. "ప్రభూ! ఏమిటీ విచిత్రం? నేనెంత యుద్ధం చేసినా నారాయణముని జయించలేకపోతున్నాను. దీనికి కారణం ఏమిటి? అని అడిగాడు. ప్రహ్లాదా! నారాయణముని సామాన్యుడు కాదు. ధర్ముడి పుత్రుడు, మహావీరుడు. అతన్ని నీవు జయించలేవు. నీవే కాదు సకల దేవతలు, రాక్షసులు ఎవరూ జయించలేరు" అని అన్నాడు శ్రీహరి. స్వామీ! అలా అయితే నేను చేసిన ప్రతిజ్ఞ ఎలా నెరవేరుతుంది? నాలాంటి మానధనుడు ప్రతిజ్ఞనెరవేరకుండా ఎలా జీవించగలడు? ఇక నేను జీవించి ప్రయోజనం లేదు ప్రభూ! నీ ముందే శరీరత్యాగం చేస్తాను" అని అన్నాడు ప్రహ్లాదుడు.

ఆ విధంగా శ్రీహరితో పలికిన ప్రహ్లాదుడు వెంటనే శిరఃస్నానం చేసి పద్మాసనం వేసుకుని యోగమార్గం ద్వారా ప్రాణాల్ని వదలాలని నిశ్చయించుకున్నాడు. అందుకు ఉపక్రమించేలోగా శ్రీహరి అతన్ని వారిస్తూ ప్రహ్లాదా! నీవు పరాక్రమంతో కాదు, కేవలం భక్తితోనే నారాయణుణ్ణి జయించగలవు" అని హితబోధ చేసాడు.

శ్రీహరి హితబోధతో ప్రహ్లాదుడిలో మార్పు వచ్చింది. క్రమంగా అతడిలో ఉన్న తామసగుణం నశించి సాత్త్వికగుణం వృద్ధిచెందింది. ఒకనాడు దైత్యులందర్నీ సమావేశపరిచి హిరణ్యాక్షుడి కుమారుడు తన సోదరుడైన అంధకుడితో "సోదరా!

ఈనాటి నుంచి మన దైత్యకులాన్నంతా నీవే పాలించు. నాకీ రాజ్యభోగాల మీద ఆసక్తి పోయింది. తపస్సు చేసుకోవటానికి నేను వెళ్ళిపోతున్నా" అని చెప్పి రాజ్యభారాన్ని అంధకుడికి అప్పగించాడు.

ఆ విధంగా రాజ్యాన్ని, పరివారాన్ని త్యజించిన ప్రహ్లాదుడు వైరాగ్య భావంతో హిమాలయాల్లోని బదరికాశ్రమానికి వెళ్ళాడు. అప్పటికే నైమిశారణ్యం నుంచి అక్కడికి చేరుకుని తపోసాధన చేస్తున్నారు నరనారాయణులు. ప్రహ్లాదుడు వారిముందు కొచ్చి వినయంగా నమస్కరించి నిలబడ్డాడు. ప్రహ్లాదుణ్ణి చూసి ఆశ్చర్యపోయిన నారాయణఋషి! దైత్యేంద్రా! ఏమిటయ్యా ఇలా మాకు నమస్కారాలు చేస్తున్నావు. మాతో యుద్ధం చేయాలిగానీ ఏమిటీ పని? అని అడిగాడు.

ప్రహ్లాదుడు వారితో "ప్రభూ! ముల్లోకాల్లో మిమ్మల్ని జయించగల వాడెవ్వడు? మీకన్నా గొప్ప పరాక్రమవంతులు ఎవరు? నీవు సాక్షాత్తు నారాయణుడివే! అని భక్తితో నారాయణ ఋషిని ఇలా స్తుతించాడు.

## ప్రహ్లాదుడు చేసిన నారాయణ స్తుతి

కస్త్వాంజేతుం ప్రభో శక్తః కస్త్వత్తః పురుషోఽధికః ।
త్వంహి నారాయణోఽనంతః పీతవాసా జనార్దనః ॥ 1

త్వం దేవః పుండరీకాక్షః త్వం విష్ణుః శార్ఙ్గచాపధృక్ ।
త్వమవ్య యోమహేశానః శాశ్వతః పురుషోత్తమః ॥ 2

త్వాం యోగినశ్చింతయంతి చార్చయంతి మనీషిణః ।
జపంతి స్నాతకాస్త్వాం చ యజంతి త్వాం చ యాజ్ఞికాః ॥ 3

త్వమచ్యుతో హృషీకేశ శ్చక్రపాణి ర్ధరాధరః ।
మహామీనో హయశిరా స్త్వమేవ వర కచ్ఛపః ॥ 4

హిరణ్యాక్ష రిపుః శ్రీమాన్ భగవానథ సూకర ః ।
మత్పితుర్నాశనకరో భవానపి నృకేసరీ ॥ 5

బ్రహ్మా త్రినేత్రోఽమరరాడ్ హుతాశః ప్రేతాధిపో నీరపతిః సమీరః ।
సూర్యో మృగాంకోఽచల జంగమాద్యో భవాన్విభో నాథ ఖగేంద్ర కేతో ॥ 6

త్వం పృథ్వీ జ్యోతి రాకాశం జలం భూత్వా సహస్రశః ।
త్వయావ్యాప్తం జగత్సర్వం కస్త్వాం జేష్యతి మాధవః ॥ 7

భక్త్యాయది హృషీకేశ తోషమేషి జగద్గురో ।
నాన్యథా త్వం ప్రశక్యోఽసి జేతుం సర్వగతావ్యయ ॥ 8

*(శ్లో॥48-55,అధ్యా-8)*

దైత్యేంద్రుడు నారాయణ మునిని ఇలా భక్తితో స్తుతించి క్షమించమని ప్రార్ధించాడు. అతడిలో వచ్చిన పరివర్తన గమనించిన నారాయణ ముని "దైత్యేంద్రా! పశ్చాత్తాపానికి మించిన పుణ్యం మరొకటి లేదు. నీ భక్తి శ్రద్ధలు నాకెంతో ఆనందాన్ని కలిగించాయి. నీకేం వరం కావాలో కోరుకో అన్నాడు. "ప్రభూ! నా బుద్ధి ఎల్లప్పుడూ నీ పాదాబ్జాలమీదే లగ్నమై ఉండాలి. ఇంతకన్నా నాకేవరమూ వద్దు" అని కోరాడు ప్రహ్లాదుడు. అప్పుడు నారాయణుడు ఎంతో సంతోషించి దైత్యేంద్రా! నీవు నీ రాజ్యానికి వెళ్ళు అక్కడే నివసిస్తూ దైత్యులందరూ ధర్మం తప్పకుండా ప్రవర్తించేలా వారికి హితబోధచేయి. నీకు శుభం కలుగుతుంది" అని ఆశీర్వదించి పంపాడు.

నారాయణముని ఆదేశాన్ననుసరించి ప్రహ్లాదుడు తిరిగి తన రాజ్యానికి రాగా దైత్యులంతా ఎంతో సంతోషంతో అతడికి ఘనస్వాగతం పలికారు. తిరిగి రాజ్యాధికారాన్ని స్వీకరించమని కోరారు. అయితే వైరాగ్య భావంతో నిండిపోయిన ప్రహ్లాదుడు అందుకంగీకరించలేదు. నారాయణుడు చెప్పిన విధంగా వారందరికీ మార్గదర్శకుడిగా ఉంటూ నిరంతరం నారాయణ నామస్మరణ చేస్తూ తన జీవితాన్ని ధన్యం చేసుకున్నాడు.

## పన్నెండు ధర్మలక్షణాలు

1. **దేవతల ధర్మాలు :** యజ్ఞయాగాలు చేయటం, వేదాధ్యయనం, వేదజ్ఞానాన్ని సంపాదించటం, విష్ణుపూజ – ఇవి దేవతలు అనుష్ఠించాల్సిన ధర్మకార్యాలు.

**2. దైత్యదానవ ధర్మాలు :** బాహుబలం ప్రదర్శించటం, మాత్సర్యబుద్ధి కలిగి ఉండటం, యుద్ధాలు చేయటం, ఆతిథ్యమివ్వటం, నీతిశాస్త్ర జ్ఞానాన్ని కలిగి ఉండటం, శివభక్తి – ఇవి దైత్యదానవులు ఆచరించాల్సిన ధర్మాలు.

**3. సిద్ధుల ధర్మాలు :** యోగాభ్యాసం, వేదాధ్యయనం, బ్రహ్మజ్ఞానప్రాప్తి వీటన్నిటికన్నా అచంచలమైన భక్తి–ఇవి సిద్ధుల ధర్మాలు.

**4. గంధర్వుల ధర్మాలు :** ఉపాసన, నృత్య, గాన, వాద్య పరిజ్ఞానం, స్థిరమైన సరస్వతీ ఆరాధన – ఇవి గంధర్వుల ధర్మాలు.

**5. విద్యాధరుల ధర్మాలు :** అసమానమైన విద్యా విజ్ఞానాల్ని కలిగిఉండటం, లోకవిజ్ఞానం, పౌరుషం, సద్భక్తి – విద్యాధరుల ధర్మాలు.

**6. కింపురుష ధర్మాలు :** సంగీత విద్యలో నైపుణ్యాన్ని కలిగి ఉండటం, సూర్యుడి మీద భక్తి, శిల్ప శాస్త్రంలో ప్రావీణ్యం కలిగి ఉండటం.

**7. పితృదేవతల ధర్మాలు :** బ్రహ్మచర్యం, అమానిత్వం, దృఢమైన యోగాభ్యాసం మీద ఆసక్తి, కామగనం అనేవి పితృదేవతల ధర్మాలు.

**8. ఋషుల ధర్మాలు :** బ్రహ్మచర్యం, మితాహారం, జపం, జ్ఞానప్రాప్తి, ధర్మస్వరూపాన్ని తెలుసుకోవటం, తపస్సు చేయటం అనేవి.

**9. మానవుల ధర్మాలు :** స్వాధ్యాయం, బ్రహ్మచర్యం, దానం, యజనం, ఔదార్యం, సారళ్యం, దయ, అహింస, ఇంద్రియ విజయం, క్షమాగుణం, ఆత్మ సంయమనం, శుచి, సత్సంకల్పం, శివకేశవుల మీద భక్తి–ఇవన్నీ మానవులు ఆచరించాల్సిన ధర్మాలు అనగా ఈ గుణాలన్నీ అందరూ కలిగి ఉండాలి.

**10. రాక్షస ధర్మాలు :** ఇతరుల భార్యల్ని చెరబట్టటం, పరుల ధనాన్ని అపహరించటం, శివారాధన చేయటం, దయాగుణం లేకపోవటం – అనేవి రాక్షస ధర్మాలు.

**11. యక్షుల ధర్మాలు :** ధనాధిపత్యం, బోగాలనుభవించటం, స్వాధ్యాయం, శివారాధన, అహంకారం, ఔద్ధత్యం–అనేవి యక్షధర్మాలు.

**12. పిశాచ ధర్మాలు :** అవివేకం, అజ్ఞానం, అశౌచం, అసత్యం ఎప్పుడూ మాంసాన్నే భుజించటం – ఇవి పిశాచ లక్షణాలు.

ఇవన్నీ పన్నెండు వర్గాలలో జన్మించిన వారికి బ్రహ్మదేవుడు నిర్దేశించిన ధర్మాలు. వీటిని ఆచరించిన వారు సద్గతి పొందుతారు.

## భువనకోశం - ద్వీపాలు

సమస్త భూమండలం వైశాల్యం ఏభైకోట్ల యోజనాలు. కాగా దీనిచుట్టూ సముద్రాలు వ్యాపించాయి. ఈ భూమండలం మీద ప్రజాపతి బ్రహ్మదేవుడు కమలం మధ్యలో ఉన్న కర్ణికలాగా ఒక వేదిక నిర్మించాడు. అదే మేరు పర్వతం. దానికి నాలుగు దిక్కులా సకల మానవుల్ని వివిధ రకాల ద్వీపాలలో సృష్టించాడు. ఆ ద్వీపాల మధ్యలో లక్షయోజనాల విస్తీర్ణంలో సుప్రసిద్ధమైన జంబూద్వీపాన్ని నిర్మించాడు. ఆ ద్వీపం చుట్టూ దానికి రెండింతలుగా సముద్రం వ్యాపించి ఉంది. దాని తరువాత 'ప్లక్షద్వీపం'. ఆ ద్వీపానికి నాలుగువైపులా ఇక్షుసముద్రం వ్యాపించి ఉంది. ఆ ప్లక్ష ద్వీపానికి రెండింతలు ఎక్కువ విస్తీర్ణంలో 'శాల్మలీ' ద్వీపం ఉండగా దాన్ని సురాసముద్రం పరివేష్ఠించింది. ఈ శాల్మలీ ద్వీపానికి రెండింతల అధిక ప్రమాణంతో కుశద్వీపం నెలకొంది. ఆ ద్వీపాన్ని నేతిసముద్రం చుట్టూ ఉండి రక్షిస్తోంది.

నేతి సముద్రం చుట్టూ రెండింతల ప్రమాణంతో క్రౌంచద్వీపం, దానికి రెండింతలు అధికంగా పెరుగు సముద్రం కమ్ముకొని వున్నాయి. ఆ పెరుగు (దధి) సముద్రానికన్నా రెండింతల అధిక వైశాల్యంతో శాకద్వీపం ఆవరించి ఉండగా, దాని చుట్టూ క్షీరసముద్రం వ్యాపించి ఉంది. ఆ క్షీరసముద్రం మీదే శేషశయనుడైన శ్రీహరి శయనించి ఉంటాడు. జంబూద్వీపం నుంచి - క్షీరసముద్రం దాకా విస్తరించిన అన్ని ద్వీపాలూ సముద్రాల విస్తీర్ణం మొత్తం నలభైకోట్ల తొంభై అయిదు లక్షల యోజనాలు.

ఈ క్షీరసముద్రం తరువాత పుష్కరద్వీపం ఉంటుంది. దానిచుట్టూ మంచినీటి సముద్రం నాలుగు కోట్ల ఏభై రెండు లక్షల యోజనాల విస్తీర్ణంతో వ్యాపించి ఉంటుంది. వీటన్నిటికీ లక్షయోజనాల దూరంగా నాలుగువైపులా ఆవరించి వుంది బ్రహ్మాండ కటాహం (పెంకు). ఈ విధంగా ఏర్పడ్డ సప్తద్వీపాలకీ

వేరువేరుగా ధర్మాచరణలు నిర్దేశించబడ్డాయి. ప్లక్షద్వీపంనుంచి శాకద్వీపం దాకా వున్న ద్వీపాలలో నివసించేవారికి యుగాలన్నవే ఉండవు. వారంతా దేవతల్లాగా సకల సౌఖ్యాలూ అనుభవిస్తూ ఉంటారు.

## కర్మవిపాకం

మానవులు ఏఏ కర్మల్ని ఆచరిస్తే ఎలాంటి నరకాలకి వెళతారో, అక్కడ ఎలాంటి శిక్షలనుభవిస్తారో ధర్మశాస్త్రాలలో చాలా వివరంగా చెప్పారు.

- ఎప్పుడూ విప్రుల్ని, వేదాల్ని, పురాణ ఇతిహాసాన్ని ద్వేషించే పాపాత్ములు గురునింద చేసే అధములు, యజ్ఞయాగాలని ధ్వంసం చేసేవారు, దాతల్ని దానం చేయనీయకుండా అడ్డుకునేవారు అందరూ ఘోరమైన నరకాలకి వెళతారు.
- స్నేహితుల్ని, దంపతుల్ని, అన్నదమ్ముల్ని, యజమాని సేవకుల్ని, తండ్రీ కొడుకుల్ని, గురుశిష్యుల్ని, దుర్బుద్ధితో విడదీసేవారు ఒకడికి తన కూతుర్నిచ్చి వివాహం చేస్తానని చెప్పి చెయ్యకుండా మరొకడికిచ్చి చేసేవాడు, వీరంతా యమదండనకి గురౌతారు.
- ఇతరులకి బాధలు కలిగించేవారు, చందనం, వట్టివేళ్ళు, చామరాలు, వ్యజనాలు దొంగతనం చేసేవాళ్ళు కరంభసికత నరకానికి వెళతారు.
- శ్రాద్ధ నిమంత్రణ ఒకచోట స్వీకరించి, మరోచోట భుజించేవారు, నిందావాక్యాలతో సాధువుల మనసుల్ని నొప్పించేవారు, మంచివారికి వ్యతిరేకంగా చాడీలు చెప్పేవారు, పాపాత్ములు – ఇలాంటివారి నెత్తిమీద గ్రద్ధలు వాలి ముక్కుతో పొడుస్తాయి.
- తల్లితండ్రుల్ని, గురువుల్ని అవమానించేవారు మలమూత్రాలతో నిండిన అప్రతిష్టం అనే నరకంలో పడతారు.
- దేవతలకు, అతిథులకు, జీవాలకు, సేవకులకు, అభ్యాగతులకు, బాలురకు, పితృదేవతలకి, అగ్నికి ఆహారం పెట్టకుండా తాము భుజించేవారు అధములు. అలాంటివారు చీమునెత్తురునిండిన నరకం చేరుకుంటారు. అక్కడ యమభటులు నోటినిండా సూదులు గుచ్చే శిక్షని వారికి విధిస్తారు.

- ఒకే పంక్తిలో భోజనానికి కూర్చున్నవారికి భేదభావంతో వడ్డించేవారు పరమనీచులు. వారు విద్భోజనం అనే నరకంలో ఉన్న పక్షుల రెట్టలకుప్పలో పడిపోతారు.
- ఇతరులతో కలిసి ప్రయాణం చేసేడప్పుడు తాము తెచ్చుకున్న తినుబండారాలని ఇతరులకి ఏ కొంచెం ఇవ్వకుండా తామే భుజించేవారు శ్లేష్మ భోజనం అనే నరకానికి వెళతారు.
- ఎంగిలిచేత్తో గోవుల్ని, బ్రాహ్మణుల్ని, పవిత్రమైన అగ్నిని తాకిన వారి చేతుల్ని ఎర్రగా కాగిన కుంభాలలో వేసి కాల్చుతారు.
- అశుచిగా ఎంగిలినోటితో, చేతుల్తో సూర్య, చంద్రుల్ని, నక్షత్రాలని కావాలని ఎవరు చూస్తారో వాళ్ళనేత్రాగ్నిని యమకింకరులు లాగి పారేస్తారు.
- మిత్రుడి భార్యని, తన తల్లిని, అన్నని, తండ్రిని, తోబుట్టువుల్ని, కూతుర్ని, గురువుల్ని, బంధువుల్ని, పెద్దల్ని ఎవరైతే కాలితో తాకుతారో అలాంటి పాపాలపాదాల్ని ఇనుప సంకెళ్ళతోకట్టి మోకాళ్ళ వరకూ కాల్చి రౌరవ నరక జ్వాలల్లోకి తోసేస్తారు.
- పాలతో వండిన పరమాన్నాన్ని, మాంసాహారాన్ని భగవంతుడికి నివేదించకుండా భుజించేవారి నోళ్ళలో నిప్పులతో కాల్చిన ఇనుప గుళ్ళని కుక్కుతారు.
- గురువు, దేవత, బ్రాహ్మణులు, వేదాలు, వీటిని నిందించేవారి మాటల్ని శ్రద్ధగా వినేవారి చెవుల్లో, యమదూతలు బాగా కాల్చినమేకుల్ని దూర్చుతారు.
- పర్వదినాల్లో స్త్రీ సంగమం చేసేవారిని, పరస్త్రీలని బలాత్కారంచేసే వారిని శాల్మలి అనే నరకంలోకి తోసేస్తారు. వారిని అక్కడ భగభగా మండే ఇనుపస్తంభాలకి కట్టేస్తారు.
- ఉపాధ్యాయుడికన్నా ఎత్తైన ఆసనంమీద కూర్చొని అధ్యయనం చేసిన శిష్యుడు, అందుకనుమతించిన గురువూ ఇద్దరి నెత్తిమీదా పెద్ద పెద్ద రాతి బండలు పెట్టి మోయిస్తారు.

❊ నీళ్ళలో మలమూత్ర విసర్జన చేసేవారిని 'విణ్మూత్రం' అనే దుర్గంధ పూరితమైన నరకంలో పడేస్తారు.

❊ వేదాల్ని, విప్రుల్ని, భార్యాబిడ్డల్ని, గురువుల్ని, తల్లితండ్రుల్ని విడిచిపెట్టే పాపుల్ని యమకింకరులు పర్వతశిఖరాల మీద నుంచి క్రిందికి తోస్తారు.

❊ విధవాస్త్రీలని పెళ్ళాడేవారు, కన్యల్ని చెరచేవారు మురికి గుంటల్లో పురుగులు చీమలు భక్షించాల్సి వుంటుంది.

❊ శూద్రులు – చండాలుర నుంచి దక్షిణలు స్వీకరించిన పురోహితుడు, ఆ పురోహితుణ్ణి నియమించిన యజమాని ఇద్దరూ శిలాగర్భంలో పురుగులుగా జన్మిస్తారు.

❊ లంచగొండులు వృకమాంస భక్షకులు, వృక్షభక్షమనే నరకంలో పడతారు

❊ బంగారాన్ని దొంగలించేవారు, బ్రాహ్మణుల్ని చంపేవాడు సురాపానం చేసేవారు, గురువు భార్యను పొందేవారు, ఇతరుల గోవుల్ని, భూముల్ని బలవంతంగా అపహరించేవారు, గోవుల్ని, స్త్రీలని, శిశువుల్ని సంహరించే వారు, వేదాల్ని విక్రయించేవారు, తప్పుడు సాక్ష్యం చెప్పేవారు మహా రౌరవం" అనే నరకానికి వెళతారు.

ఇలా వివిధరకాల పాపాలు చేసిన వారంతా పదివేల సంవత్సరాల చొప్పున తామిస్రక, అంధతామిస్ర, అసితపత్రవన, ఘటీయంత్ర, తప్తకుంభ అనే నరకాలలో పడి యమయాతనలనుభవిస్తారు.

## శ్రేష్ఠమైనవి

1.దేవతలందరిలో – శ్రీహరి శ్రేష్ఠుడు 2.పర్వతాల్లో – హిమవంతుడు 3.ఆయుధాలలో – సుదర్శనం 4.పక్షుల్లో – గరుత్మంతుడు 5.జాతిసర్పాల్లో – అనంతుడు 6.భూతాల్లో – భూమి 7.నదుల్లో – గంగ 8.జలజాలలో – పద్మం 9. అసురుల్లో – శివభక్తుడైన అసురుడు 10.క్షేత్రాల్లో – కురుజాంగలక్షేత్రం 11.తీర్థాలలో –పృథూదకతీర్థం 12.సరస్సుల్లో – మానస సరోవరం 13.వనాల్లో – నందనవనం 14. లోకాల్లో – బ్రహ్మలోకం 15.ధర్మక్రియల్లో – సత్యవాక్పాలన

16.యజ్ఞాల్లో – అశ్వమేధం 17.ప్రియబంధువుల్లో – పుత్రుడు 18.తపస్వులలో– అగస్త్యమహర్షి 19.ఆగమాలలో – వేదాలు 20.పురాణాలలో – మత్స్యపురాణం 21.సంహితల్లో – స్వాయంభువ సంహిత 22.స్మృతుల్లో – మనుస్మృతి 23.తిథుల్లో – అమావాస్య 24.విఘనాల్లో – దానం 25.తేజఃపుంజాల్లో – సూర్యుడు శ్రేష్ఠమైనవి. 26.నక్షత్రాల్లో – చంద్రుడు 27.జలాశయాల్లో– సముద్రం 28.రాక్షసుల్లో–సుకేశి 29.పాశాలలో – నాగపాశం 30.స్తిమితులలో – బంధితుడు 31.ధాన్యాలలో – వరి 32.ద్విపాదుల్లో – విప్రుడు 33.నాలుగు పాదాల జీవుల్లో – ఆవు 34.శ్వాపదాల్లో – సింహం 35.పుష్పాలలో – జాజిపువ్వు 36.నగరాలలో – కాంచీపురం 37.దేవతాస్త్రీలలో – రంభ 38.ఆశ్రమాలలో– గృహస్థాశ్రమం 39.పురాలలో–కుశస్థలి 40.దేశాలలో–మధ్యదేశం 41.ఫలాలలో– మామిడి 42.మొగ్గల్లో – అశోకం 43.ఔషధాలలో – హరీతకీ (కరక్కాయ) 44.దుంపల్లో – కంద 44.వ్యాధుల్లో – అజీర్ణం 45.తెల్లపదార్థాలలో – పాలు 46.వస్త్రాలలో–నూలు 47.కళల్లో – గణితం 48.విజ్ఞానాలలో – ఇంద్రజాలం 49. ఆకుకూరల్లో – కాకమాచి ఆకుకూర 50.షడ్రసాలలో – ఉప్పు 51.ఎత్తైన చెట్లలో – తాళవృక్షం 52.పద్మసరోవరాల్లో – పంపాసరోవరం 53.వనచరుల్లో– జాంబవంతుడు 54.వృక్షాలలో – వటవృక్షం (మర్రి) 55.జ్ఞానుల్లో – శివుడు 56.పతివ్రతల్లో – పార్వతీ దేవి 57.గోవుల్లో – కపిలగోవు 58.నరకాలలో – వైతరణీ శ్రేష్ఠమైనవి.

## కృతఘ్నుడు

అన్ని రకాల పాపాలకన్నా తీవ్రమైనది కృతఘ్నత అనే పాపం. దీనికి నిష్కృతి అనేదే లేదు.

పాపీయసాంత ద్విదిహ కృతఘ్నః సర్వేషు పాపేషు నిశాచరేంద్ర ॥
బ్రహ్మఘ్న గోఘ్నాదిషు నిష్కృతి తిర్హి విద్యేతనైవాస్యతు దుష్టచారిణః ॥
ననిష్కృతిశ్చాస్తి కృతఘ్నవృత్తేః సహృత్కృతం నాశయతోఽబ్దకోటిభిః ॥

*(శ్లో॥55–56, అధ్యా–12)*

పాపులందరిలోకీ పరమనికృష్టుడు కృతఘ్నుడు. కృతఘ్నుతం అనగా చేసిన మేలు మరిచి ప్రవర్తించటం అనేది అన్ని పాపాలకన్నా భయంకరమైనది. బ్రహ్మ హత్య, గోహత్యలకన్నా నిష్కృతి (ప్రాయశ్చిత్తం)ఉంటుంది కానీ చేసిన మేలు మరిచి ప్రవర్తించే కృతఘ్నుడికి కోటి సంవత్సరాలకైనా నిష్కృతిలేదు.

## సదాచార స్వరూపం

లోకంలో మానవులందరూ సదాచార పరాయణులై ఉండాలి. ముఖ్యంగా గృహస్థుడైన వాడు తప్పకుండా ఆచారాల్ని సంప్రదాయాల్ని పాటించాలి. ఆచారహీనుడైన వాడికి ఇహపరాల్లో ఎక్కడా మేలు జరుగదు. సదాచారాన్ని ఉల్లంఘించిన వాడికి యజ్ఞం, దానం, తపస్సు, వ్రతాల వల్ల ఎలాంటి మంచి జరగదు. కనుక గట్టిగా ప్రయత్నించి మరీ సదాచారాన్ని పాటించాలి. సదాచరణ అనేది మనుషుల్లో ఉన్న చెడుని నశింపచేస్తుంది. సదాచార స్వరూపం ఎలా ఉంటుందంటే!

ధర్మో౽స్య మూలం ధనమస్యశాఖా పుష్పం చ కామః ఫలమస్య మోక్షః ।
అసౌ సదాచార తరుః సుకేశిన్ సంసేవితో యేన సపుణ్యభోక్తా ॥

*(శ్లో॥19,అధ్యా-14)*

సదాచారం అనేది ఒక దివ్య వృక్షం. దాని మొదలు ధర్మం అయితే, ఆ వృక్షానికున్న శాఖలు ధనం. కామం ఆ చెట్టుకి మొలిచిన పుష్పం. మోక్షం దానికి కాసిన కాయ (ఫలం) ఇలాంటి సదాచార వృక్షాన్ని సేవించినవాడే పుణ్యాత్ముడుగా  గుర్తించబడతాడు.

## శంకరుడు చెప్పిన సుప్రభాతం

మానవులు చేసే పాపాలన్నిటి నుంచీ విముక్తి పొందాలనుకుంటే బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి, ముందుగా దేవ, ఋషి, గురు స్మరణ చేసి శంకరుడు చెప్పిన ఈ సుప్రభాత స్తోత్రాన్ని శ్రద్ధగా పఠించాలి.

బ్రహ్మ మురారి స్త్రిపురాంతకారీ భానుః శశీ భూమిసుతోబుధశ్చ ।
గురుశ్చ శుక్రః సహభానుజేన కుర్వంతుసర్వే మమసుప్రభాతమ్ ॥ 1

భృగుర్వశిష్టః క్రతురంగిరాశ్చ మనుః పులస్త్యః పులహః స గౌతమః ।
రైభ్యో మరీచిశ్చ్యవనో ఋభుశ్చ కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥2
సనత్కుమారః సనకః సనందనః సననాతనో౽ప్యాసు రిపింగళౌ చ ।
సప్తస్వరాః సప్తరసాతలాశ్చ కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్ ॥ 3
పృథ్వీ సగంధా సరసాస్తథా౽౽పః స్పర్శశ్చ వాయుర్జ్వలనః సతేజాః ।
నభః సశబ్దం మహతా సహైవ యచ్ఛంతు సర్వే మమసుప్రభాతమ్ ॥ 4
సప్తార్ణవాః సప్తకులాచలాశ్చ సప్తర్షయో ద్వీపవరాశ్చ సప్త ।
భూరాదికృత్వా భువనానిసప్త దదంతుసర్వే మమ సుప్రభాతమ్ ॥ 5
ఇత్థం ప్రభాతే పరమం పవిత్రం పఠేత్ స్మరేద్వా శృణుయాచ్చ భక్త్యా ।
దుః స్వప్న నాశో౽నఘ సుప్రభాతం భవేచ్చసత్యం భగవత్ప్రసాదాత్ ॥6

*(శ్లో॥23-28,అధ్యా-14)*

బ్రహ్మ మురారి, త్రిపురాంతకుడు, సూర్యచంద్రులు, అంగారక బుధులు, గురు శుక్రులు, శనైశ్చరుడు వీరంతా నాకు సుప్రభాతం అనుగ్రహింతుగాక ! భృగువు, వశిష్టుడు, క్రతువు, అంగిరసులు, మునువు, పులస్త్యుడు పులహ గౌతములు, రైభ్య మరీచులు, చ్యవన ఋభులు నాకు సుప్రభాతం అనుగ్రహింతురు గాక! సనకసనందన సనత్కుమార సనాతనులు, ఆసురిపింగళులు, సప్తస్వరాలు, సప్త రసాతలాలు నా ఈ ప్రభాతాన్ని కల్యాణమయం చేయుదురు గాక! గంధ గుణం గల పృథ్వి, రసాత్మకమగు జలములు, స్పర్శ గుణాత్మకమగు వాయువు, తేజోరూపము గల అగ్ని, శబ్ద గుణకమైన ఆకాశం, మహత్తుతో కూడి ఈ ఉదయం నాకు శుభములు చేకూర్చు గాక! సప్త భువనాలు వీరందరూ నాకు సుప్రభాత మనుగ్రహింతురు గాక! ఉదయం నిద్ర నుండి లేవగానే ఈ సుప్రభాత పఠనం శ్రవణం లేక స్మరణం చేస్తే అంతకుముందు రాత్రి సంభవించిన దుఃస్వప్న దోషాలు తొలగిపోయి భగవత్కృప వల్ల మానవుడు శుభాలు పొందుతాడు. ఇందులో సందేహం లేదు.

## మంగళకరమైనవి

దూర్వాదధీ సర్పిరథోధకుంభం ధేనుం సవత్సాం వృషభం సువర్ణం ।
మృద్గోమయం స్వస్తిః మక్షతాని లాజామధు బ్రాహ్మణ కన్యకాం చ ॥
శ్వేతాని పుష్పాణ్యధశోభనాని హుతాశనం చందన మర్కబింబం ।
అశ్వత్థవృక్షం చ సమూల భేత తతస్తు కుర్యాన్నిజజాతి ధర్మం ॥

*(శ్లో॥36-38,అధ్యా-14)*

గరిక, పెరుగు, నెయ్యి, నీళ్ళతో నిండిన కుండ, దూడతో ఉన్న ఆవు, వృషభం (ఎద్దు), బంగారం, మట్టి, ఆవుపేడ, స్వస్తికచిహ్నం, అక్షతలు, పేలాలు, తేనె, బ్రాహ్మణకన్య, తెల్లటిపూలు, అగ్ని, చందనం, సూర్యబింబం, రావిచెట్టు ఇవన్నీ మంగళకరమైన వస్తువులు. ఏదైనా పనులమీద వెళ్ళేడప్పుడుగానీ, శుభకార్యక్రమాలని చేసేముందు గానీ ఈ వస్తువుల్లో దేనినైనా స్పర్శించినట్లైతే ఆయాకార్యాలు మంగళ ప్రదంగా ముగుస్తాయి.

## సదాచారపరులు చేయకూడనివి

❄ దుష్టులతో సావాసం చేయకూడదు.

❄ ఉభయ సంధ్యల్లో అలాగే పగటి పూట మైథునం చేయకూడదు.

❄ అర్థంలేని దానం, పశుహింస చేయకూడదు.

❄ వివస్త్రలుగా ఉన్న పరస్త్రీలని చూడకూడదు, దొంగలతో సంభాషించకూడదు.

❄ తోబుట్టువులతో గానీ, ఇతరుల భార్యతో గానీ, తల్లితో గానీ, వయసుకి వచ్చిన కూతురితో కానీ ఒకే ఆసనం మీద కూర్చోకూడదు.

❄ దిగంబరంగా పడుకోకూడదు. అలాగే పూర్తి దిగంబరంగా స్నానం చేయకూడదు. అటు ఇటు తిరగకూడదు.

❄ పగిలిన విరిగిన ఆసనాలని, పీటల్ని, పాత్రల్ని ఉపయోగించకూడదు.

❄ శుక్లపక్షపాడ్యమి, షష్ఠి, ఏకాదశి తిథుల్లో తైలాభ్యాంగన స్నానం చేయకూడదు.

❄ చతుర్థి, నవమి, చతుర్దశీ తిథుల్లో క్షౌరం చేయించుకోకూడదు.

❈ శుక్లపక్ష పంచమి, దశమి, పూర్ణిమా తిథుల్లో స్త్రీ సంగమం పనికిరాదు.

❈ ఆది, మంగళవారాల్లో తలంటు స్నానం చేయకూడదు.

❈ శుక్రవారంనాడు క్షౌరం, శనివారంనాడు మాంసాహారం వర్జించాలి.

❈ చిత్త, హస్త, శ్రవణానక్షత్రాలలో ఆభ్యంజన స్నానం, విశాఖా అభిజిత్తుల్లో క్షౌరం, మూల, మృగశిరా నక్షత్రాలలో మాంస భక్షణం, మఖ, కృత్తికా ఉత్తరా నక్షత్రాలలో స్త్రీ సంగమం చేయకూడదు.

❈ పడమర, ఉత్తర దిశల్లో తలపెట్టి నిద్రపోకూడదు.

❈ దక్షిణ, పడమర దిశలకి అభిముఖంగా కూర్చుని భోజనం చేయకూడదు.

❈ ఇతరులు ఉపయోగించిన పూలమాలల్ని, అన్న పానీయాలని వస్త్రాలని ఉపయోగించకూడదు.

❈ రోజూ శిరఃస్నానం చేయాలి. కారణం లేకుండా రాత్రిపూట తలమీద స్నానం చేయకూడదు.

❈ గ్రహణ పర్వదినాలలో గానీ, బంధువులు మరణించినప్పుడు గానీ, చంద్రుడు జన్మ నక్షత్రంలోకి ప్రవేశించినప్పుడు గానీ రాత్రిపూట తలమీద స్నానం చేయవచ్చు.

❈ తలమీద స్నానం చేసాక వెంట్రుకల్ని విదల్చకూడదు.

(ఈ విషయాలన్నీ 'సుకేశి' అనే రాక్షసరాజుకి మహర్షులు ప్రబోధించారు)

## అసూర్య శయన ద్వితీయావ్రతం

ఉత్తరాయణం వెళ్ళిపోయిన తరువాత ఆషాఢమాసం వచ్చేసరికి ఆదిదేవుడైన నారాయణుడు శేషతల్పం మీద హాయిగా శయనిస్తాడు. ఆషాఢ శుద్ధ ఏకాదశి తిథిన ఆ విధంగా శ్రీహరి నిద్రకి ఉపక్రమించగానే, దేవగంధర్వ యక్షులు వారి కుటుంబాల వారు కూడా నిద్రపోతారు.

శ్రీహరి అనుగ్రహం పొందాలనుకునే మానవుడు పూజామందిరంలో ఒక శేషశయన ప్రతిమని ఏర్పర్చి ఆ మూర్తిని అర్ఘ్యపాద్యాలతో అర్చించి, ద్వాదశినాడు బ్రాహ్మణ పూజచేసి, వారిచేత అనుజ్ఞ పొంది నారాయణుడి

ప్రతిమని సుఖంగా ఒక చిన్న మంచం మీదకి చేర్చి స్వామిని శయనింపచేయాలి. త్రయోదశినాడు కదంబపుష్పాల శయ్యమీద మన్మథుడు నిద్రిస్తాడు. చతుర్దశి రోజు బంగారు కమలాలు పరిచిన మంచం మీద యక్షులు నిద్రపోతారు. పౌర్ణమినాడు పరమేశ్వరుడు తన జటాజూటాన్ని, పులితోలుని ముడివేసుకుని వ్యాఘ్రాజినం మీద శయనిస్తారు.

సూర్యుడు కర్కాటక రాశిలోకి ప్రవేశించటంతో దేవతలకి రాత్రి ప్రారంభమౌతుంది. దాన్నే దక్షిణాయనం అంటారు. పాడ్యమినాడు బ్రహ్మదేవుడు నల్లకలువలు పరిచిన శయ్యమీద పవళిస్తాడు. తరువాత వరుసగా విదియనాడు దేవశిల్పి విశ్వకర్మ, తదియనాడు జగన్మాత పార్వతీదేవి, చవితినాడు గణపతి, పంచమినాడు యమధర్మరాజు, షష్ఠీతిథినాడు కుమారస్వామి, సప్తమినాడు సూర్యభగవానుడు, అష్టమితిథిన కాత్యాయనీదేవి, నవమినాడు మహాలక్ష్మీదేవి, దశమీ తిథినాడు వాయుభుక్కులైన సర్పాలు, కృష్ణ శుద్ధ ఏకాదశి నాడు సాధ్యులు నిద్రిస్తారు. ఈ విధంగా దేవతలంతా శ్రావణమాసంలో నిద్రపోగా అప్పటినుంచీ వర్షాకాలం ప్రారంభమవుతుంది.

వర్షాకాలం ప్రారంభం కాగానే గ్రద్దలు, కొంగలు, కాకులు కొండకొమ్మల మీదకి చేరుకుంటాయి. కాకులు, పావురాలు తదితర పక్షులన్నీ చెట్లమీద గూళ్ళు కట్టటం ప్రారంభిస్తాయి. ఈ వర్షఋతువులోనే గర్భంతో ఉండే ఆడకాకులు ఆ గూళ్ళలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకుంటాయి. ప్రజాపతి విశ్వకర్మ నిద్రపోయిన రోజుని 'అశూన్యశయన ద్వితీయా' అంటారు. ఆ రోజు శ్రీవత్సలాంఛనుడైన శ్రీహరిని–మహాలక్ష్మితో సహా మంచి శయ్యమీద ప్రతిష్ఠించి, గంధపుష్పాలతో పూజించి, సువాసన గల పుష్పాలు, మధురమైన ఫలాలు నైవేద్యంగా సమర్పించాలి. వాటిని సమర్పిస్తూ –

యథాహి లక్ష్మ్యా నవియుజ్యసేత్వం త్రివిక్రమానంత జగన్నివాస
తథా<u>ఽ</u>స్త్వశూన్యం శయనం సదైవ అస్మాకమేవేహ తవప్రసాదాత్ ।
యథాత్వశూన్యం తవదేవతల్పం సమం హి లక్ష్మ్యా వరదాచ్యుతేశ ।
సత్యేనతేనామిత వీర్యవిష్ణోః గార్హస్థ్యనాశో మమనాస్తుదేవ ॥

*(శ్లో॥22–23,అధ్యా–17)*

ఓ త్రివిక్రమా! జగన్నివాసా! నీవు ఎలాగైతే ఒక్క క్షణం కూడా లక్ష్మీదేవిని విడవకుండా ఉంటావో అదేవిధంగా మా శయ్యలు కూడా ఒక్క క్షణం కూడా శూన్యంగా ఉండకుండా ఉండుగాక! మేము కూడా అశూన్యశయనులమగు గాక! ఓ వరదా! అచ్యుతా! లక్ష్మీదేవితో కూడిన నీతల్పం ఏవిధంగా అశూన్యంగా వుండదో అదేవిధంగా మా గార్హస్థ్య జీవితాలు కూడా కళకళలాడేలా ఉండాలి. ఆ విధంగా మమ్మల్ని అనుగ్రహించు" అని ప్రార్థించి తిరిగి ఆ దివ్యదంపతులకి నమస్కరించాలి. శ్రియః పతి అయిన ఆ జగన్నాథుణ్ణి ప్రసన్నం చేసుకుని వ్రతం చేసిన రోజు రాత్రి నూనె, ఉప్పు లేని భోజనం చేయాలి. మర్నాడు ఉత్తమమైన బ్రాహ్మణుడికి ఒక పండుని యథాశక్తి దక్షిణతో సహా దానంచేయాలి" శ్రీ లక్ష్మీనాథః ప్రీయతాం" అని సంకల్పించి ఆ ఫలాన్ని దానం చేయాలి.

ఈ విధంగా సూర్యుడు వృశ్చిక రాశిలో ప్రవేశించేంత వరకూ నాలుగు మాసాలు ఈ వ్రతాన్ని ఇవే తిథుల్లో ఆచరించాలి. అప్పుడు దేవతలంతా ఒక్కరొక్కరుగా నిద్రనుంచి మేలుకొంటారు. ముందుగా సూర్యుడు తులారాశిలోకి చేరగానే శ్రీహరి నిద్రనుంచి లేస్తాడు. తర్వాత మన్మథుడు, పరమేశ్వరుడు మేలుకొంటారు. విదియనాడు శ్రీలక్ష్మీ నారాయణుల ప్రతిమని తల్పంతో సహా యథాశక్తి దక్షిణ తాంబూలాలతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. ఈ విధంగా అశూన్యశయన వ్రతాన్ని ఆచరించిన దంపతులకి జీవితంలో ఎడబాటు కలగదు. వారెప్పుడూ లక్ష్మీ నారాయణుల్లాగా అన్యోన్యంగా వుంటారు.

## శ్రీ కాలాష్టమీ వ్రతం

మృగశిరా నక్షత్రంతో కూడిన శ్రావణి కృష్ణపక్ష అష్టమీతిథినే కాలాష్టమీ వ్రతం అంటారు. పరమ పవిత్రమైన ఆ రోజు పరమేశ్వరుడు అన్ని శివలింగాలలో నిద్రిస్తూ ఉంటాడు. ఆ సమయంలో శివారాధన చేసిన వాడికి అక్షయమైన ఫలితాలు లభిస్తాయి.

కాలాష్టమీ పర్వదినాన గోమూత్రంతో శివలింగాన్ని స్నానం చేయించి ఉమ్మెత్త పూలతో పూజించాలి. ధూపాన్ని వేసి తేనె-నెయ్యి నైవేద్యంగా సమర్పించి

“ప్రీయతాం మే విరూపాక్ష” అని చెప్పి బంగారంతో సహా ఆ నైవేద్యాన్ని ఉత్తముడైన బ్రాహ్మణుడికి దానం చేయాలి. అదేవిధంగా ఆశ్వయుజమాసంలో కూడా కృష్ణ అష్టమినాడు ఉపవసించి, జితేంద్రియుడై, నవమినాడు కమలాలతో గోమయంతో స్నానం చేయించాలి. తరువాత కమలాలతో ఆయన్ని పూజించి, ధూపం వేసి తేనె – కుడుములని – “ప్రీయతాం మేహిరణ్యాక్షః” అని చెబుతూ యోగ్యుడైన విప్రుడికి నువ్వులు దానం ఇవ్వాలి.

**కార్తీకమాసం :** ఈ మాసంలో శివలింగానికి కృష్ణ – అష్టమినాడు ఆవుపాలతో స్నానం చేయించి, కరవీర పుష్పాలతో అర్చన చేయాలి. తరువాత శ్రీగంధం సమర్పించి ధూపం వేసి పాయసం, తేనె నివేదించాలి. వెండి నాణాన్ని నైవేద్యంతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం ఇవ్వాలి. అలా దానమిచ్చేడప్పుడు “ప్రీయతాం భగవాన్ స్థాణుః” అని చెప్పి నమస్కరించాలి.

**మార్గశీర్షమాసం :** ఈ నెలలో వచ్చే కృష్ణపక్ష అష్టమినాడు ఉపవాసముండి నవమినాడు శివలింగానికి పెరుగుతో స్నానం చేయించాలి. భద్రపుష్పాలతో స్వామిని అర్చించి బిల్వవృక్షం బెరడుతో ధూపం వేయాలి. నైవేద్యంగా అన్నంలో కొంచెం తేనె వేసి సమర్పించాలి. తరువాత ఆ నైవేద్యాన్ని ఎర్రటి బియ్యం దక్షిణతో కలిపి “ప్రీయతాం భగవాన్ శర్వః” అని చెప్పి యోగ్యుడైన ఒక విప్రుడికి సమర్పించాలి.

**పుష్యమాసం :** పవిత్రమైన పుష్యమాసం అష్టమినాడు శివలింగానికి నేతితో అభిషేకం చేయాలి. అనంతరం మంగళ ప్రదాలైన తగరు పుష్పాలతో స్వామిని పూజించి, మధూక (విప్ప) చెట్టు బెరడుతో ధూపం వేయాలి. నైవేద్యంగా తేనె – గోధుమ రొట్టెల్ని స్వామికి సమర్పించి పెసలతో సహా ఆ నైవేద్యాన్ని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. దానం చేసేముందు “నమస్తే దేవేశ త్ర్యంబకేతి” అని చెప్పి నమస్కరించాలి.

**మాఘమాసం :** పవిత్రమైన మాఘమాసంలో శివలింగాన్ని దర్భలు వేసిన జలంతో అభిషేకించాలి. తరువాత కస్తూరితో పూజించి, కడిమి చెట్టు

బెరడులో ధూపం వేసి, నువ్వులు చల్లిన అన్నాన్ని నివేదించాలి. తరువాత బంగారు కాసు, పాయసాన్నం, దానితో పాటు స్వామికి నివేదించిన అన్నాన్ని దక్షిణతో సహా విప్రుడికి దానం చేయాలి. "ప్రీయతాం మే మహాదేవ ఉమాపతిః" అని దానం చేసేముందు చెప్పి ఆ విప్రుడికి నమస్కరించాలి.

వ్రతం పారణలో భాగంగా ఈ మాఘమాసంలోనే కృష్ణపక్ష నవమినాడు గోరోజనం కలిపిన బెల్లం నీళ్ళతో తిరిగి స్వామిని అభిషేకించి "ప్రీయతాం మే ఈశ్వరః" మచ్ఛోకనాశం ప్రకురుష్యయోగ్యమ్" అని చెప్పి ఆత్మనివేదన చేయాలి.

ఈ విధంగా వరుసగా ఆరుమాసాలు శివలింగాన్ని పూజించి, అభిషేకించిన తరువాత తిరిగి ఈ క్రింది విధంగా మిగిలిన మాసాలలో కూడా సర్వేశ్వరుణ్ణి అర్చించి యథావిధిగా దానాలు చేయాలి.

**ఫాల్గుణమాసం :** ఈ మాసంలో వచ్చే కృష్ణపక్ష అష్టమినాడు యథావిధిగా ఉపవసించి ఆ మర్నాడు నవమితిథినాడు పంచగవ్యాలతో శివలింగానికి అభిషేకం చేయాలి. తరువాత మల్లెలతో స్వామిని అర్చించి చందన ధూపం వేయాలి. ఒక రాగి పాత్రలో నేయి బెల్లంతో వండిన అన్నాన్ని నివేదనగా సమర్పించాలి. ఆ తరువాత రెండు వస్త్రాల్ని (ఉత్తరీయం-పంచె) దక్షిణ నైవేద్యంతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. దానం చేసేముందు శివనామాల్ని పఠించాలి.

**చైత్రమాసం :** ఈ మాసంలో కూడా కృష్ణ అష్టమినాడు ఉపవసించి నవమినాడు ఉదయం మేడిపళ్ళ రసంతో శివలింగానికి అభిషేకం చేయాలి. మందార పూలతో స్వామిని అర్చించి మహిష గుగ్గిలంతో ధూపం వేయాలి. నైవేద్యంగా నేయి కుడుములు సమర్పించాలి. అనంతరం యోగ్యుడైన విప్రుణ్ణి పిలిచి దక్షిణతో సహా ఆ నైవేద్యాన్ని దానం చేయాలి. దానం చేసిన తరువాత ఆ విప్రుణ్ణి శివస్వరూపుడుగా భావించి నమో నాట్యేశ్వరా! అని చెప్పి నమస్కరించాలి.

**వైశాఖమాసం :** ఈ నెలలో కృష్ణపక్ష అష్టమినాడు శ్రద్ధగా ఉపవాసం చేసి, నవమినాడు ఉదయం సుగంధపుష్పాలు కలిపిన నీటితో శివలింగాన్ని అభిషేకించాలి. తరువాత తియ్యమామిడి పూలతో అర్చనచేసి నేతితో తడిపిన పాలవృక్షం బెరడుతో ధూపం వేయాలి. నైవేద్యంగా స్వామివారికి నేయి–పండ్లు సమర్పించాలి. తరువాత ఆ నైవేద్యంతో పాటు, జలకుంభం ఒకటి, యజ్ఞోపవీతం ఒకటి, భోజన సామాగ్రి కొంత కలిపి దక్షిణతో సహా ఒక విప్రుడికి దానం చేయాలి. దానం స్వీకరించిన విప్రుడిని 'నమోకాలఘ్నా' అని చెప్పి నమస్కరించాలి.

**జ్యేష్ఠమాసం :** ఈ మాసంలో కృష్ణపక్ష అష్టమినాడు యథావిధిగా ఉపవసించాలి. మర్నాడు నవమి ఉదయం ఉసిరికాయ జలంతో శంకర లింగానికి అభిషేకం చేయాలి. తరువాత జిల్లేడు పూలతో స్వామిని అర్చించి సరళ వృక్షం బెరడుతో ధూపం వేయాలి. నైవేద్యంగా నేయి, పెరుగుతో తడిపిన సత్తుపిండిని సమర్పించాలి. అనంతరం ఆ నైవేద్యాన్ని, దానితో పాటు రెండు పాదరక్షలు, గొడుగు, దక్షిణతో సహా ఒక విప్రుడికి దానం చేయాలి. దానం స్వీకరించిన విప్రుణ్ణి శివస్వరూపుడిగా భావించి "నమస్తే భగన్నేత్రఘ్నః" అని చెప్పి నమస్కరించాలి.

**ఆషాఢమాసం :** ఈ మాసంలో కూడా యథావిధిగా కృష్ణ పక్ష అష్టమినాడు ఉపవాసం ఉండి, నవమినాడు ఉదయం బిల్వాలు వేసిన నీళ్ళతో శివలింగాన్ని అభిషేకించాలి. తెల్ల ఉమ్మెత్త పూలతో స్వామిని అర్చించి సాంబ్రాణీ ధూపాన్ని వేయాలి. నైవేద్యంగా నేతితో వండిన అప్పాలు స్వామికి భక్తిగా సమర్పించాలి. తరువాత యోగ్యుడైన విప్రుణ్ణి పిలిచి, స్వామికి నివేదించిన నైవేద్యం దానితో పాటు నేయి, యవలు, దక్షిణ కలిపి అతడికి దానమివ్వాలి. దానం స్వీకరించిన బ్రాహ్మణుణ్ణి శివస్వరూపుడిగా భావించి "నమోదక్షయజ్ఞ నాశకా!" అని చెప్పి నమస్కరించాలి.

**శ్రావణ మాసం :** ఈ మాసంలో యథావిధిగా అష్టమినాడు ఉపవసించి, మర్నాడు ఉదయం శంకరలింగాన్ని గుంట గలగరాకురసంతో అభిషేకించాలి.

మారేడు దళాలతో పూజించి అగరుధూపం వేయాలి. నైవేద్యంగా, నేతితో వండిన పెరుగువడలు, లడ్డూలు, పెరుగన్నం, అప్పాలు స్వామికి సమర్పించాలి. అనంతరం ఆ నైవేద్యాలతో పాటు తెల్లటి ఎద్దుని, కపిలగోవుని ఎర్రటి వస్త్రాలతో దక్షిణతో సహా పండితుడైన బ్రాహ్మణుడికి దానమివ్వాలి. దానం స్వీకరించిన పండితుణ్ణి 'నమో గంగాధరా' అని కీర్తించి భక్తితో నమస్కరించి ఆయన ఆశీర్వాదాన్ని తీసుకోవాలి.

ఈ విధంగా మొత్తం ఒక సంవత్సరం పాటు వృషభకేతుడైన శంకరుణ్ణి భక్తిగా ఆరాధించినవాడు అనంతమైన కోరికలు సిద్ధింపచేసుకుంటాడు. ఇది స్వయంగా పరమేశ్వరుడన్నమాట. ఇది అన్నివిధాలా అక్షయమైన ఫలితాల నిచ్చే మహిమాన్విత వ్రతం. దీన్ని అన్ని వర్ణాల వారూ ఆచరించవచ్చు.

## దేవతలు - వృక్షాలు - పుష్పాలు

భూమండలంలో ఉన్న వివిధ రకాల పుష్పాలు వృక్షాలు వివిధ రకాల దేవతల నుంచి ఆవిర్భవించాయి. ఇవన్నీ పవిత్రమైన ఆశ్వయుజమాసంలో జన్మించాయి. ముందుగా జగన్నాథుడైన శ్రీమన్నారాయణుడి నాభినుంచి – కమలం పుట్టింది. తరువాత వరుసగా మన్మథుడి చేతి నుంచి – కదంబపుష్పం పుట్టింది. ఆ పువ్వంటే ఆయనకెంతో ఇష్టం. యజ్ఞేశ్వరుడైన మణిభద్రుడి నుంచి –వట(మర్రి) వృక్షం పుట్టింది. ఆయనకి ఆ వృక్షమంటే ప్రీతి. శివుడి హృదయం నుంచి – ఉమ్మెత్త పూవు ఆవిర్భవించింది. అలాగే బ్రహ్మదేవుడి శరీరం మధ్య భాగం నుంచి – మరకత వర్ణంలో ప్రకాశించే ఖదిర వృక్షం పుట్టింది. అదేవిధంగా విశ్వకర్మ నుంచి –కంటకీ వృక్షం ఉద్భవించింది. దీన్ని దేవతలందరూ ఇష్టపడతారు.

పార్వతీదేవి అరచేతి నుంచి – కుందం (మల్లె), గణపతి చెంపల నుంచి – సింధువారక పుష్పం, యమధర్మరాజు దక్షిణ పార్శ్వం నుంచి పాలాశ వృక్షం, దక్షిణ ఉత్తర భాగాలనుంచి – నల్లమేడి చెట్టు, రుద్రుడి శరీరం నుంచి క్షోభ కలిగించే విషవృక్షం, కాత్యాయనీ దేవి నుంచి జమ్మి చెట్టు, మహాలక్ష్మీదేవి

నుంచి బిల్వ వృక్షం, నాగదేవతల నుంచి–రెల్లు దుబ్బ, కుమార స్వామి నుంచి – బంధుజీవన పుష్పం, సూర్యభగవానుడి నుంచి అశ్వత్థ(రావి) వృక్షం, వాసుకి సర్పం విశాలమైన తోక నుంచి తెల్లగరిక, వీపు నుంచి నల్ల గరిక, సాధ్యుల హృదయాల నుంచి – హరిచందన వృక్షాలు, పుష్పాలు ఉద్భవించాయి. ఈ వృక్షాలు, పుష్పాలు ఆయా దేవతలకి ఎంతో ప్రీతి కనుక ఆయాదేవతల అనుగ్రహాన్ని కోరుకునేవారు వారికి సంబంధించిన వృక్షాల్ని పూజించాలి.

## శ్రీ విష్ణు పంజర స్తోత్రం

నమో నమస్తే గోవింద చక్రంగృహ్యా సుదర్శనమ్ ।
ప్రాచ్యాంరక్షస్వమాంవిష్ణో త్వామహం శరణం గత ॥ 1

గదాం కౌమోదకీం గృహ్యా పద్మనాభామితద్యుతే ।
యామ్యాం రక్షస్వ మాం విష్ణో త్వామహం శరణం గతః ॥ 2

హలమాదాయ సౌనందం నమస్తే పురుషోత్తమ ।
ప్రతీచ్యాం రక్ష మే విష్ణో భవంతం శరణం గతః ॥ 3

ముసలం శాతనంగృహ్యా పుండరీకాక్ష రక్షమామ్ ।
ఉత్తరస్యాం జగన్నాథ భవంతం శరణం గతః ॥ 4

శార్ఙ్గమాదాయ చ ధనురస్త్రం నారాయణం హరే ।
నమస్తే రక్షరక్షోఘ్న ఐశాన్యాం శరణం గతః ॥ 5

పాంచజన్యం మహాశంఖ మంతర్బోధ్యం చ పంకజమ్ ।
ప్రగృహ్యా రక్షమాం విష్ణో ఆగ్నేయ్యాం యజ్ఞసూకర ॥ 6

చర్మసూర్యశతం గృహ్యా ఖడ్గం చంద్రమసంతథా ।
నైర్‌ఋత్యాం మాం చ రక్షస్వ దివ్యమూర్తే నృకేసరిన్ ॥ 7

వైజయంతీం ప్రగృహ్యాత్వం శ్రీవత్సం కంఠభూషణమ్ ।
వాయవ్యాం రక్షమాం దేవ అశ్వశీర్ష నమోస్తుతే ॥ 8

వైనతేయం సమారుహ్యా అంతరిక్షే జనార్దన ।
మాం త్వం రక్షాజిత సదా నమస్తే త్వపరాజిత ॥ 9

విశాలాక్షం సమారుహ్య రక్ష మాంత్వం రసాతలే ।
అకూపార నమస్తుభ్యం మహామోహ నమోస్తుతే ॥ 10

కరశీర్షాంఘ్రిపర్వేషు తథాఽష్టబాహుపంజరమ్ ।
కృత్వారక్షస్వ మాం దేవ నమస్తే పురుషోత్తమ ॥ 11

ఏతదుక్తం భగవతా వైష్ణవం పంజరం మహత్ ।
పురా రక్షార్థమీశేన కాత్యాయన్యా ద్విజోత్తమ ॥ 12

నాశయామాస సా యత్ర దానవం మహిషాసురమ్ ।
సమరం రక్తబీజం చ తథాన్యాన్ సురకంటకాన్ ॥ 13

*(శ్లో॥26-38,అధ్యా-18)*

గోవిందా! నీకు నమస్కారం. నీకు శరణాగతుడను. సుదర్శన చక్రం ధరించి విష్ణో! నీవు నన్ను తూర్పున రక్షించు. అమిత తేజస్వియైన పద్మనాభా! కామోదకి గదను ధరించి నన్ను దక్షిణదిశన రక్షించుము. విష్ణో! నీకు శరణాగతుడను. నీకు నమస్కారము. పురుషోత్తమా! నమస్కారం. సౌనంద హలాన్ని ధరించిన విష్ణూ! పశ్చిమ దిక్కున నన్ను రక్షించు. నీకు శరణాగతుడను! పుండరీకాక్ష! ఉత్తమమైన నీ ముసలాయుధంతో ఉత్తరాన నన్ను రక్షించు. జగన్నాథా! నీకు శరణాగతుడను! ఓ రాక్షసనాశకా! శార్ఙ్గ ధనుస్సును నారాయణాస్త్రాన్ని ధరించి నన్ను ఈశాన్య దిశన రక్షింపుము. నీకు శరణాగతుడను. ఓ విష్ణూ యజ్ఞపురుషా! పాంచజన్య శంఖాన్ని అంతర్బోధ్య కమలాన్ని ధరించి నన్ను ఆగ్నేయ దిక్కును రక్షించు. ఓ నరసింహప్రభూ! దివ్యమూర్తీ! సూర్యశతమనే డాలును చంద్రమస ఖడ్గాన్ని ధరించి నైరృతి దిక్కున నన్ను రక్షింపుము. వైజయంతీమాలను శ్రీవత్సాంకాన్ని ధరించిన ఓ హయగ్రీవ ప్రభూ! వాయువ్య దిశన నన్ను రక్షించు. నీకు నమస్కారము. జనార్దనా! గరుడ వాహనారూఢుడవై నన్ను అంతరిక్షంలో రక్షించు. అజితా అపరాజితా! నీక సదానమస్సులు! విశాలాక్షాన్ని అధిరోహించిన నన్ను పాతాళంలో రక్షించు! ఆకూపారా! మహామోహా! నీకు నమస్కారం! అష్టబాహు పంజర రూపాన

నా శరీరంలోని చేతులు, తల, పాదాలు, మడమలు మొదలగు వానిని రక్షించు. పురుషోత్తమ దేవా! నీకు నమస్కారం! ఈ విధంగా ఈ విష్ణు పంజర స్తోత్రం పూర్వం శివుడు రక్షకొరకు కాత్యాయనికి చెప్పాడు.

## కాత్యాయనీ చరిత్ర

పూర్వం జగత్తునంతా భయభ్రాంతులకి గురిచేసే మహాబలవంతులైన ఇద్దరు రాక్షసులుండేవారు. వారే రంభుడు–కరంభుడు. వారిద్దరికీ ఎంతకాలం గడిచినా సంతానం కలగలేదు. పుత్ర ప్రాప్తి కోసం వారిద్దరూ పంచనదీ జలాలతో మునిగి చాలా సంవత్సరాలు తపస్సుచేసారు. తరువాత వారిలో కరంభుడు నీళ్ళలో, రంభుడు అగ్నిలో కూర్చుని తమ తపస్సుని కొనసాగించారు.

నీళ్ళల్లో మునిగి తపస్సు చేస్తున్న కరంభుణ్ణి మొసలిరూపంలో వెళ్ళిన ఇంద్రుడు ఆ నీళ్ళలోనే వధించాడు. ఈ విషయం ఒడ్డునున్న రంభుడికి తెలిసింది. తన సోదరుడి మరణాన్ని తట్టుకోలేక తన తలని తానే నరుక్కోబోయాడు. అప్పుడు అగ్నిదేవుడు రంభుణ్ణి వారించి "రాక్షసేశ్వరా! ఆత్మహత్య మహాపాపం. బ్రతికే ఏదన్నా సాధించాలి. ఇన్నాళ్ళు నా మధ్యలో ఉండి తపస్సు చేస్తావు. నీకేం కావాలో కోరుకో" అన్నాడు. అప్పుడు రంభుడు అగ్నిదేవుడికి నమస్కరించి అగ్నిదేవా! నాకు నీకన్నా గొప్ప తేజోవంతుడు, దేవతలందర్నీ జయించేవాడు, అవధ్యుడు, వాయువులాగా బలవంతుడు, కామరూపుడు, సర్వశస్త్రాస్త్ర కోవిదుడు, త్రిలోకాల్నీ జయించగలిగినవాడు అయిన వీరాధివీరుణ్ణి పుత్రుడిగా ప్రసాదించు" అని కోరాడు. అగ్ని 'తథాస్తు' అని ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు.

అగ్నిదేవుడి ద్వారా వరాన్ని పొందిన రంభుడు ఆనందంగా తనలోకానికి బయలుదేరాడు. దారిలో అందంగా ఉన్న ఒక ఆడమహిషి (గేదె) అతడికి కనిపించింది. రంభుడు దాన్ని చూసి మనసుపడ్డాడు. ఆ మహిషికూడా రంభుణ్ణి మోహించింది. వారిద్దరూ పరస్పరం సంగమించారు. తత్ఫలితంగా మహిషి గర్భాన్ని ధరించింది. అప్పుడు రంభుడు తన భార్యని తీసుకుని సరాసరి పాతాళానికి వెళ్ళాడు. అయితే పాతాళంలో ఉన్న రాక్షసులందరూ రంభుడు

మహిషాన్ని రమించి అకార్యం చేసాడన్న కోపంతో అతన్ని వెలేశారు. అవమానం సహించలేని రంభుడు పాతాళం వదిలి తాను పూర్వం తపస్సు చేసిన మఱ్రిచెట్టు దగ్గరకి మహిషితో సహా తిరిగి వచ్చాడు.

ఒకనాడు గర్భం పండిన మహిషి అందమైన ఒక దున్నపోతుని ప్రసవించింది. రంభుడు అదిచూసి ఎంతో సంతోషించాడు. వారిద్దరూ అలా ఆనందంగా కాలం గడుపుతున్నారు. కొన్నాళ్ళు గడిచాక రంభుడు లేని సమయంలో మరో దున్నపోతు మహిషిని మోహించి దాని మీద పడి రమించటానికి ప్రయత్నించింది. తన శీలాన్ని రక్షించుకోవాలని మహిషి కేకలు వేయగా రంభుడా అరుపులు విని కత్తి పట్టి అక్కడికొచ్చాడు. ఎదురుగా బలిష్ఠంగా ఉన్న దున్నపోతు కనిపించింది. వెంటనే దాన్ని ఎదుర్కొన్నాడు. కొద్దిసేపు వారిద్దరి మధ్యా యుద్ధం జరిగింది. చివరికి బలిష్ఠమైన ఆ దున్నపోతు తన బలమైన కొమ్ములతో రంభుడి గుండెల్లో పొడిచింది. ఆ దెబ్బతో శరీరం రెండుగా చీలి రంభుడు మరణించాడు.

తన భర్త దున్నపోతు చేతిలో దారుణంగా చంపబడడంతో మహిషి పారిపోయి యక్షుల్ని శరణు వేడుకుంది. యక్షులు ఆమెకి అభయమిచ్చి ఆ దున్నపోతుని ఎదుర్కొన్నారు. యక్షులు ధాటికి తట్టుకోలేక ఆ దున్నపోతు అక్కడే ఉన్న సరోవరంలో పడి మరణించింది. అలా మరణించిన దున్నపోతు ఒక రాక్షసరూపాన్ని ధరించి బైటికి వచ్చింది. అలా వచ్చిన అసురుడే సమరుడుగా విఖ్యాతి పొందాడు. అక్కణ్ణుంచి యక్షుల కంటబడకుండా తప్పించుకుని వెళ్ళిపోయాడు.

భర్త మరణంతో విలపిస్తున్న మహిషిని ఓదార్చిన యక్షులు రంభుడి శరీరానికి దహన సంస్కారాలు మొదలుపెట్టారు. భర్త మరణాన్ని తట్టుకోలేని మహిషి తన కుమారుణ్ణి పక్కనపెట్టి పరుగున వెళ్ళి ఆ చితిలో పడి రంభుడితో సహా ఆహుతైపోయింది. ఆశ్చర్యంగా ఆ చితి నుంచి రౌద్రాకారుడైన ఒక పురుషుడు ఆవిర్భవించాడు. మహాభయంకరుడైన ఆ రాక్షసుడు అక్కడున్న మహిషాలన్నిటినీ

వధించాడు. అతన్ని చూసి భయభ్రాంతులైన యక్షులు అక్కణ్ణుంచి పారిపోయారు. ఆ భయంకరుడు మరెవరోకాదు రక్తబీజుడు. రంభుడికి, మహిషికి జన్మించిన మహిషాసురుడి సోదరుడు.

మహాబలవంతుడైన మహిషాసురుణ్ణి సకల రాక్షస గణాలూ తమ నాయకుడిగా ఎన్నుకొన్నాయి. తనని రాజుగా అంగీకరించని శంబరుడు - తారకుడు లాంటి అసురుల్ని భయపెట్టి తన దారిలోకి తెచ్చుకున్నాడు మహిషాసురుడు. తన పదవి సుస్థిరమయ్యాక మహిషాసురుడు సకల రాక్షస గణాల్నీ వెంటబెట్టుకుని దేవలోకం మీద దండెత్తాడు. మహిషుడి ధాటికి తట్టుకోలేక లోకపాలకులందరూ తమ తమ స్థానాలు వదిలి చెల్లాచెదురై పారిపోయారు. అలా లోకాలన్నీ మహిషుడి ఆధీనంలోకి వచ్చాయి. త్రిలోకాధిపతిగా మహిషుడు రాక్షసులందరి చేతా కీర్తించబడ్డాయి.

మహిషుడి దెబ్బకి తలోదిక్కు పారిపోయిన దేవతలంతా ఒకచోట సమావేశమై అందరూ కలిసి బ్రహ్మదేవుణ్ణి వెంట బెట్టుకుని వైకుంఠానికి వెళ్ళారు. అదే సమయంలో ఏదో పనిమీద అక్కడికి వచ్చాడు శివుడు. అలా వారిద్దరూ ఒకేచోట కనిపించేసరికి ఎంతో ఆనందించిన దేవతలు మూకుమ్మడిగా ముక్తకంఠంతో మహిషాసురుడి అకృత్యాలు, అతడివల్ల వారుపడ్డ బాధలు ఏకరువుపెట్టారు.

దేవతలందరి దీనాలాపాలు వినగానే ఒక్కసారిగా శ్రీహరి ముఖం కూడా రౌద్రంగా మారింది. వారిద్దర్నీ చూసిన ఇంద్రాది దిక్పాలకులందరి ముఖాలు కూడా ఆవేశంతో ఎర్రబడ్డాయి. అలా అందరు దేవతల ముఖాలు క్రోధంతో ఎర్రబడగా వాటినుంచి తీవ్రమైన అగ్ని వెలువడింది. ఆ అగ్నినుంచి ఒక దివ్యతేజం ఆవిర్భవించింది. అది కాత్యాయన మహర్షి తేజంతో కలిసి విజృంభించి ఒక మహాశక్తి స్వరూపిణిగా ఆకారాన్ని ధరించింది.

జ్వలిస్తున్న కోటిసూర్యుల కాంతితో వెలుగొందే ఆ దివ్యతేజస్సు నుంచి ఆవిర్భవించిన శక్తే కాత్యాయనీ దేవి. శివుడి తేజస్సుతో ఆమెకి మూడు కళ్ళు,

యముడి తేజస్సుతో నల్లటికేశాలు, శ్రీహరి తేజస్సుతో ఆ దేవికి 18 బాహువులు. చంద్రుడి కాంతితో చక్కని స్తనయుగళం, ఇంద్రుడి తేజస్సుతో అందమైన నడుము, వరుణుడి తేజస్సుతో తొడలు, జంఘాలు, పిరుదులు, బ్రహ్మతేజస్సుతో అందమైన పాదాలు, సూర్యుడి కాంతితో పాదాల వేళ్ళు, అష్టవసువుల తేజస్సుతో చేతివేళ్ళు, ప్రజాపతుల కాంతితో దంతాలు, యక్షుల తేజస్సుతో నాసిక, మరుత్తుల తేజస్సుతో చేతులు, సాధ్యుల తేజస్సుతో కనుబొమలు రూపొందాయి.

తథర్షి తేజోత్తమ ముత్తమం మహనామ్నా పృధివ్యానుభవత్ర్వ సిద్ధమ్ ।
కాత్యాయనీత్యేవ తదా బభౌ సా నామ్నా చ తేనైవ జగత్ర్వసిద్ధా ॥

*(శ్లో॥13,అధ్యా-19)*

కాత్యాయన మహర్షి తపశ్శక్తితో ఆవిర్భవించిన ఆ తేజోమూర్తి ఆనాటి నుంచీ కాత్యాయనీ దేవిగా ప్రసిద్ధి చెందింది. జగన్మోహనాకారంతో సకల దేవతల తేజోరూపంతో నిండిన ఆ కాత్యాయనీ దేవికి దేవతలంతా ఇలా వివిధరకాల వస్తువుల్ని, ఆయుధాల్ని, వాహనాన్ని సమకూర్చారు.

శంకరుడు త్రిశూలాన్ని, శ్రీహరి చక్రాయుధాన్ని వరుణదేవుడు శంఖాన్ని, అగ్ని శక్త్యాయుధాన్ని,వాయువు ధనస్సుని, సూర్యుడు అక్షయ తూణీరాన్ని, ఇంద్రుడు వజ్రఘంటని, యముడు దండాన్ని, కుబేరుడు గదని, బ్రహ్మ అక్షమాల కమండలాలని, కాలుడు ఖడ్గాన్ని, డాలుని, చంద్రుడు కంఠహారాన్ని చామరాలని, సముద్రుడు ముత్యాల మాలని, హిమవంతుడు మృగరాజు సింహాన్ని, శిరోమణిని, కుండలాల్ని, చంద్రరేఖని, అలాగే విశ్వకర్మ గండ్రగొడ్డలిని ఆ దేవికి సమర్పించారు.

కుబేరుడు అందమైన పాన పాత్రని, ఆదిశేషుడు సర్పమణిహారాన్ని, ఋతువులు ఎప్పటికీ వాడిపోని పుష్పమాలని దేవికి అందించారు. ఆ విధంగా సకలదేవతల చేతా సంభావించబడిన కాత్యాయనీ దేవి ఒక్కసారి ఆనందంతో అట్టహాసం చేసింది. అది విని ఇంద్రాది దేవతలంతా ఎంతో ఆనందించి ఆమెనిలా స్తుతించారు.

## దేవతలు చేసిన కాత్యాయనీ స్తుతి

నమోస్తు దేవ్యై సురపూజితాయై యాసంస్థితా యోగవిశుద్ధదేహా ।
నిద్రాస్వరూపేణ మహీం వితత్య తృష్ణాత్రపాక్షుధ్ భయదాఽధికాంతిః ॥
శ్రద్ధా స్మృతిః పుష్టిరథోక్షమా చ ఛాయా చ శక్తిః కమలాలయాచ ।
వృత్తిర్దయాభ్రాంతి రథేహ మాయా నమోఽ స్తుదేవ్యై భవరూపికాయై ॥

*(శ్లో॥19-20,అధ్యా-19)*

సకల దేవతల చేతా పూజించబడే ఓ కాత్యాయనీ! నీకు నమస్కారం. భూలోకంలో వున్న సకల జీవుల్లో నిద్రారూపిణిగా, తృష్ణ, లజ్జ, ఆకలి, భయం, కాంతి, శ్రద్ధా, స్మృతి, పుష్టి, క్షమ, ఛాయ, శక్తి, లక్ష్మి, వృత్తి, దయ, భ్రాంతి, కోరిక, మాయ, ఇత్యాది రూపాల్లో నిండి వుండే సంసార స్వరూపిణీ పరమేశ్వరీ! నీకు నమస్కారం.

ఈ విధంగా దేవతలంతా తనని స్తుతించిన వెంటనే కాత్యాయనీ దేవి ఆనందించి తన సింహవాహనాన్ని అధిష్ఠించి వింధ్య పర్వత శిఖరం మీదకి వెళ్ళిపోయింది. దేవతలు కూడా దేవి నివసించే వింధ్యగిరికి వెళ్ళి నిత్యం ఆమెని స్తుతిస్తూ, సేవిస్తూ కాలం గడుపుతున్నారు.

మహిషాసురుడి అనుచరులు చండముండులు, ఒకనాడు వాళ్ళిద్దరూ వింధ్యపర్వతం మీద సంచరిస్తుండగా వారి కళ్ళకి జగన్మోహనాకారంతో వెలుగొందే కాత్యాయనీ దేవి కనిపించింది. ఆమె దివ్య సౌందర్యాన్ని చూసి వారిద్దరికీ నోటమాట రాలేదు. వెంటనే అక్కణ్ణుంచి సరాసరి మహిషుడి దగ్గరకెళ్ళి “ప్రభూ! వింధ్య పర్వత శిఖరం మీద జగదేక సౌందర్య వతి అయిన ఒక స్త్రీ సంచరిస్తోంది. సింహవాహనం మీద కూర్చుని చేతుల్లో ఎన్నో దివ్యాయుధాలు ధరించి కోటిసూర్యుల కాంతితో మెరిసిపోతోంది. ఆమె గురించి మా మాటల్తో చెప్పటంకాదు. నీవు స్వయంగా చూస్తేనే తెలుస్తుంది. నా మాట లెంత నిజమో అని” అన్నారు.

చండ-ముండుల ద్వారా దేవి సౌందర్యం గురించి తెలుసుకున్న మహిషాసురుడు దేవి దగ్గరకి తన దూతల్ని పంపాడు. వారు కాత్యాయనీ దేవి దగ్గరకి వెళ్ళి మహిషుడి గొప్పతనాన్ని, బలపరాక్రమాలని వర్ణించి ఆయన్ని వరించమని కోరారు. దేవి వారి మాటలు విని ఆగ్రహంతో మహిషుణ్ణి దూషించి " మీ ప్రభువు అంత బల పరాక్రమం కలవాడైతే వచ్చి నన్ను యుద్ధంలో జయించమను అప్పుడు చెప్తాను" అని అన్నది. ఆ దూతలిద్దరూ దేవి చెప్పిన మాటల్ని యథాతథంగా మహిషుడికి నివేదించారు.

మహిషుడికి దూతలమాటలు విని ఆశ్చర్యం కలిగింది. ఒక స్త్రీ త్రిలోకాధిపతినైన నన్ను తిరస్కరిస్తుందా! పైగా యుద్ధానికి ఆహ్వానిస్తుందా! చూద్దాం ఏం జరుగుతుందో అని అనుకుని వెంటనే అసురవీరులందర్నీ పిలిచి వింధ్య పర్వతంమీదకి పంపించాడు. మహిషుడి ఆజ్ఞతో చండ-ముండ, బడాల, బాష్కల, ఉగ్రాయుధ చిక్షుర, రక్తబీజాది వీరులు సకల సైన్యసమేతంగా వింధ్యగిరిపైకి బయల్దేరారు. అందరూ అక్కడికి చేరి సైన్యంతో సహా విడిది చేసారు. ముందుగా మహిషుడి దూత దుందుభి వెళ్ళి దేవితో "దేవీ! మాప్రభువు మహిషాసురుడు మహావీరుడు. త్రిలోకాధిపతి ఆయన నిన్ను వివాహం చేసుకోవాలనుకుంటున్నాడు. అందుకు నీవు అంగీకరిస్తే నీవు త్రిలోకాలకీ మహారాణివవుతావు. ఆలోచించి వెంటనే మా ప్రభువుని పెళ్ళాడటానికి నీ సమ్మతి తెలియచేయి" అని మహిషుడి సందేశాన్ని మరోసారి వినిపించాడు.

దుందుభి మాటలు విన్న కాత్యాయనీ దేవి ఓరీ! నీవు చెప్పింది నిజమే. మీ ప్రభువు దేవతల్ని యుద్ధంలో జయించిన మాట వాస్తవం. అయితే మీకు ఇంతకు ముందే చెప్పాను మా కులాచారం ప్రకారం యుద్ధంలో నన్ను జయించిన వాడినే నేను వివాహం చేసుకుంటా ఇదే మా నియమం. వచ్చి ముందు నన్ను యుద్ధంలో గెలవమని వెళ్ళి మీ ప్రభువుకి చెప్పు అని అంది. అదే సమయంలో శివుడు దేవికి సకల శత్రునాశకరమైన విష్ణు వజ్ర పంజర కవచాన్ని బోధించాడు. దుందుభి అమె మాటలు మహిషుడికి చెప్పాడు. ఇక ఆలస్యం చేయకూడదని భావించిన మహిషుడు తన సేనతో దేవిమీద యుద్ధాన్ని ప్రకటించాడు.

మహిషుడి ఆజ్ఞతో అసురసైన్యాలు దేవి సైన్యంమీదకి ఉరికాయి. దేవతలకీ దానవులకీ మధ్య భీకరంగా యుద్ధం ప్రారంభమైంది. అప్పుడు దేవతలంతా కాత్యాయనీదేవి దగ్గరకొచ్చి 'అమ్మా! నీవు కవచాన్ని ధరించు" అని కోరారు. దేవి నవ్వుతూ సురులారా! నాకు వేరొక కవచాలెందుకు మహిమాన్వితమైన విష్ణు పంజర స్తోత్రాన్ని పఠిస్తాను. అది చాలు నాకు వంద కవచాలతో సమానం అంది.

మహిషుడి సైన్యం విజృంభించారు. దేవి అసమాన పరాక్రమం ప్రదర్శించి వారి సైన్యాన్ని చెల్లాచెదురు చేసింది. దేవి ధాటికి తట్టుకోలేక మహిషుడి సైన్యంలో ప్రధానమైన బాష్కల, బిడాల, చిక్షుర, చండ, ముండ, తదితర మహావీరులంతా ఓటమి పాలయ్యారు. దేవి వాళ్ళందర్నీ అవలీలగా సంహరించింది. ఆ విధంగా దేవి చేతిలో తన పరివారమంతా నశించిపోయే సరికి ఆగ్రహం పట్టలేక మహిషాసురుడు స్వయంగా యుద్ధ రంగంలోకి ప్రవేశించాడు.

కాత్యాయనీ మహిషాసురుల మధ్య పోరు ప్రారంభమైంది. చిత్ర విచిత్రమైన రూపాల్ని ధరిస్తూ మహిషుడు దేవితో యుద్ధం చేయటం ప్రయోగించింది. అవి మహిషుణ్ణి ఏమీ చేయలేక పోయాయి. మహిషుడు మహిష రూపాన్ని ధరించి తన బలమైన కొమ్ముల్తో దేవిని పొడవబోయాడు. దేవి వాడి కొమ్ముల్ని పాశంతో బంధించింది. మహిషుడు తప్పించుకుని మదమెక్కిన ఏనుగులాగా మారి దేవి మీదకి లంఘించాడు. దేవి తన ఖడ్గంతో ఆ ఏనుగు తొండాన్ని నరికేసింది. తిరిగివాడు దున్నపోతుగా మారాడు.

కాత్యాయనీ దేవి అగ్ని ప్రసాదించిన శక్తిని, శంకరుడిచ్చిన శూలాన్ని, శ్రీహరి ప్రసాదించిన దివ్యచక్రాన్ని ప్రయోగించింది. అయితే అవేవీ మహిషుణ్ణి గాయపరచలేకపోయాయి. దేవి కోపంతో కుబేరుడిచ్చిన గదని, వరుణుడిచ్చిన పాశాన్ని, యముడిచ్చిన కాలదండాన్ని ప్రయోగించింది. అవి కూడా అతణ్ణి ఏమీ చేయలేక వ్యర్థమైపోయాయి.

కాత్యాయనిలో సహనం నశించింది. తన శక్తినంతా కేంద్రీకరించింది. ఒక్కసారి రథం దిగి మహిషాసురుడి మీదకి లంఘించింది. మహిషుడు

తేరుకునేలోపు దేవి అతణ్ణి కిందపడేసి మహాశక్తివంతమైన తన పాదాలతో మర్దించింది. దేవి పాదాలతాకిడికి మహిషుడిలో ఉన్న బలమంతా నీరు కారిపోయింది. వెంటనే తన శూలంతో వాడి శిరస్సుని ఖండించేసింది.

మహిషుడి శరీరం నుంచి ఖడ్గధారి అయిన ఒక మహావీరుడు ఆవిర్భవించగా దేవి తన ఖడ్గంతో వాడి తలని కూడా ముక్కలు చేసింది. ఈ దృశ్యాన్ని చూసి రాక్షససైన్యమంతా భయంతో హాహాకారాలు చేసారు. తమ నాయకుడు దేవిచేతిలో దారుణంగా చంపబడటంతో అందరూ యుద్ధరంగాన్ని వదిలి భయంతో పాతాళానికి పారిపోయారు.

అలా అవలీలగా అసురుల్ని జయించిన దేవి పరాక్రమాన్ని చూసి సకల దేవతలూ జయజయ ధ్వానాలు చేసారు. నింగి నుంచి పూలవాన కురిపించారు. దివ్యస్తోత్రాలతో ఆమె పరాక్రమాన్ని శ్రవణపేయంగా కీర్తించారు. దేవి వారి ప్రార్థన విని సంతోషించి అందర్నీ ఆశీర్వదించి అదృశ్యమయ్యింది.

## వామన చరిత్ర

బలిచక్రవర్తి జన్మించిన దైత్య వంశానికి మూలపురుషుడు హిరణ్యకశిపుడు. ఆ హిరణ్యకశిపుడి కుమారుడు ప్రహ్లాదుడు, ఆయన కొడుకు విరోచనుడు, విరోచనుడి పుత్రుడే బలిచక్రవర్తి. హిరణ్యకశిపుడు నృసింహావతారాన్ని ధరించిన శ్రీహరి చేతిలో వధించబడ్డ తరువాత అతడి వంశీకులు ముల్లోకాల్నీ నిరాటంకంగా పాలిస్తున్నారు. వారిని జయించటానికి దేవతలు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

బలిచక్రవర్తి ముల్లోకాల్నీ ఆక్రమించినప్పటికీ ధర్మాన్ని విడవలేదు. అతడి పాలనలో లోకాలన్నీ శాంతి సౌభాగ్యాలతో వర్ధిల్లాయి. ప్రజలంతా తమ తమ విధుల్ని చక్కగా నిర్వర్తిస్తున్నారు. శాంతి సౌభాగ్యాలు వెల్లి విరిసాయి. ధర్మం అనే ధేనువు మూడు పాదాలతో నిల్చుంది. దేవతలు కూడా ఎలాంటి భయం లేకుండా యజ్ఞయాగాది క్రతువుల్ని నిర్విఘ్నంగా చేసుకుంటున్నారు. ఎవరిమధ్యా పరస్పర ద్వేషాలు లేవు. అలాంటి పరిస్థితుల్లో బలిచక్రవర్తి

పట్టాభిషిక్తుడయ్యాడు. దైత్య గణాలన్నీ ఆనందంతో చిందులు వేశాయి. ఆ సందర్భంగా కమలకోమలగర్భదాయిన అయిన లక్ష్మీదేవి రెండుచేతుల్లో పద్మాల్ని ధరించి, సకల శుభ లక్షణాలతో పట్టాభిషిక్తుడైన బలిని సమీపించింది. అతడితో "ఓ దైత్యేశ్వరా! బలిచక్రవర్తీ! మహాబలవంతుడవైన నీవు సురరాజైన ఇంద్రుణ్ణి సైతం జయించగలిగినందుకు నేనెంతో సంతోషించాను. నీకు శుభాలు కలుగుగాక! యుద్ధంలో వీరాధివీరులెందర్నో ఓడించావు. నీ ధైర్యసాహసాలు చూసి మెచ్చి నేనే స్వయంగా ఇలా వచ్చాను. నీ పితామహుడి కీర్తికి ఎంతో వన్నె తెచ్చావు. నేను నీలో ప్రవేశించి నీకు శుభాల్ని, మంగళాల్ని చేకూరుస్తాను" అని చెప్పి వెంటనే బలిచక్రవర్తి శరీరంలోకి ప్రవేశించింది లక్ష్మీదేవి.

ఎప్పుడైతే లక్ష్మీదేవి బలిచక్రవర్తి శరీరంలోకి ప్రవేశించిందో అప్పుడే– హ్రీ, కీర్తి, ద్యుతి, ప్రభ, ధృతి, క్షమ, భూతి, బుద్ధి, మహామతి, శ్రుతి, స్మృతి, ఇడ, శాంతి, పుష్టి, క్రియ మొదలైన దేవీ గణాలు సంతోషంగా ఆమెని అనుసరించి బలిచక్రవర్తి శరీరంలోకి ప్రవేశించాయి. ఇక స్వర్గంలో నృత్య గీత వాద్యాలలో ప్రవీణులైన అప్సరసలు మొత్తం బలిచక్రవర్తిని ఆశ్రయించారు. ఆ విధంగా బలిచక్రవర్తి ముల్లోకాలకీ అధిపతిగా మారి ధర్మబద్ధంగా పరిపాలించసాగాడు.

బలి ద్వారా పరాజితులైన దేవతలంతా కలిసి తమ తల్లి 'అదితి' దగ్గరకి వెళ్ళారు. ఆమె కుమారుల దుఃస్థితిని గమనించి "ఇంద్రా! ఇంతమంది మహావీరులు, అష్టదిక్పాలకులూ ఉన్నారు. మీరంతా ఆ బలిని ఎదిరించలేక పోయారు. ఇది కర్మ ప్రారబ్ధం కాక మరేమిటి? ఇక ఆ బలిని జయించటం మీ వల్లకాదు. అందుకు జగన్నాథుడైన శ్రీహరే సమర్థుడు. పదండి అందరంవెళ్ళి బలిని ఓడించే ఉపాయాన్ని గురించి మీ తండ్రిగారిని అడుగుదాం" అన్నది.

అదితితో కలిసి దేవతలంతా కశ్యపప్రజాపతి దగ్గరకి వెళ్ళారు. మహాతపస్వి, లోక శ్రేష్ఠుడు అయిన ఆ కశ్యపుడికి వినయ పూర్వకంగా నమస్కారం చేసి బలిచక్రవర్తి ద్వారా తాము పొందిన పరాభవాన్ని ఆయనకి విన్నవించారు. కశ్యపుడు వారి వేదన విని కొన్ని ఉపశమన వాక్యాలు పలికాడు.

వెంటనే అందర్నీ వెంటబెట్టుకుని తేజోమయమైన సత్యలోకానికి బయలుదేరాడు. అవిరళ జపహోమతత్పరులైన మునులు ఋషులు రూపాన్ని ధరించిన వేదాలు, శాస్త్రాలు, పురాణ ఇతిహాసాలు సేవిస్తుండగా ఆనందంగా కొలువుదీరిన బ్రహ్మ సభలోకి అందరూ ప్రవేశించారు. ఎంతో ఆందోళనగా వచ్చిన వారందర్నీ చూసి దేవతలారా! మీ ఆందోళనకి కారణం గ్రహించాను. మీకు త్వరలోనే విజయం లభిస్తుంది. బలిని నిర్జించే మహాత్ముడు జన్మిస్తాడు. సకలలోకాల్నీ ఉద్ధరించే ఆ మహాత్ముడు మిమ్మల్నీ నన్నూ కూడా ఉద్ధరిస్తాడు. అందుకు మీరంతా ఒక గొప్ప కార్యాన్ని చేయాలి. క్షీరసముద్రానికి ఉత్తరదిక్కులో విశ్వప్రభువు నివాసమైన 'అమృత' అనే దివ్యమైన ప్రదేశం ఉంది. అక్కడికి వెళ్ళి దీక్షగా తపస్సుచేయండి. కొంతకాలం గడిచాక మీకు స్నిగ్ధగంభీరమైన స్వరం వినిపిస్తుంది. అది అభయప్రదమైనది. మంగళకరమైనది కూడా. ఆ దివ్యస్వరం మరెవరిదో కాదు జగన్నాథుడైన శ్రీమన్నారాయణుడిది.

మీ తపోదీక్షలకి మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు. అదితి-కశ్యపులారా! మీరు వెంటనే ఆయనకి నమస్కరించి "ప్రభూ! మీరే మాకు పుత్రుడుగా జన్మించాలి" అని కోరుకోండి. మీ కోరికని స్వామి నెరవేరుస్తాడు. ఇక వెంటనే అందరూ అక్కడికి బయల్దేరండి" అనిచెప్పి సాగనంపాడు.

బ్రహ్మమాట ప్రకారం అదితి కశ్యపులతో సహా దేవగణాలన్నీ క్షీరసముద్ర ఉత్తర ప్రాంతానికి చేరుకున్నాయి. బ్రహ్మచెప్పిన 'అమృత' అనే ప్రాంతంలో అందరూ తపస్సుచేయటానికి ఆసీనులయ్యారు. కశ్యపుడు తన పుత్రులందరికీ 'సహస్రవర్ష' తపోదీక్షని ఇవ్వగా శ్రీమన్నారాయణుడి దివ్యానుగ్రహం కోసం అందరూ మౌనంగా ఉగ్రమైన తపస్సుని ప్రారంభించారు. ఆ విధంగా వెయ్యి సంవత్సరాలు తమ తపోదీక్షని కొనసాగించాక ఒకనాడు కశ్యపుడు జగన్నాథుడైన శ్రీమన్నారాయణుణ్ణి వేదోక్తంగా ఇలా స్తుతించాడు.

## కశ్యపుడు చేసిన నారాయణ స్తవం

నమోஉస్తుతే దేవ దేవ ఏకశృంగ వృషార్చే
సింధువృష వృషాకపే సురవృష అనాదిసంభవ

రుద్ర కపిల విష్వక్సేన సర్వభూతపతే ధ్రువ
ధర్మాధర్మ వైకుంఠ వృషావర్త అనాదిమధ్యనిధన
ధనంజయ శుచిశ్రవః పృశ్ని గర్భ నిజజయ. 1

అమృతేశయ సనాతన త్రిథామ తుషిత మహాత త్వ
లోకనాథ పద్మనాభ విరించే బహురూప అక్షయ
అక్షర హవ్యభుజ ఖండపరశో శక్ర ముంజకేశ
హంస మహాదక్షిణ హృషీకేశ సూక్ష్మ మహానియమధర
విరజ లోక ప్రతిష్ఠ అరూప అగ్రజ ధర్మజ ధర్మనాభ. 2

గభస్తినాభ శతక్రతునాభ చంద్రరథ సూర్యతేజః
సముద్రవాసః అజ సహస్రశిరః సహస్రపాద
అధోముఖ మహాపురుష పురుషోత్తమ సహస్రబాహో
సహస్రమూర్తే సహస్రాస్య సహస్రసంభవ సహస్రసత్వం
త్వామాహుః పుష్పహాస చరమ త్వమేవ వౌషట్. 3

వషట్కారం త్వామాహురగ్ర్యం మఖేషు ప్రాశితారం సహస్రధారం
చ భూశ్చ భువశ్చ స్వశ్చ త్వమేవ వేదవేద్య బ్రహ్మశయ
బ్రాహ్మణప్రియ త్వమేవ ద్యౌరసి మాతరిశ్వాఽసి
ధర్మోఽసి హోతా పోతా మంతా నేతా హోమ హేతు స్త్వమేవ
అగ్ర విశ్వధామ్నా త్వమేవ దిగ్భిః సుభాండ 4

ఇజ్యోఽసి సుమేధోఽసి సమిధ స్త్వమేవ మతి ర్గతిర్
దాతా త్వమసి మోక్షోఽసి యోగోఽసి సృజసి
ధాతా పరమయజ్ఞోఽసి సోమోఽసి దీక్షితోఽసి దక్షిణాఽసి
విశ్వమసి, స్థవిర హిరణ్యనాభ నారాయణ
త్రినయన ఆదిత్యవర్ణ ఆదిత్యతేజః మహాపురుష 5

పురుషోత్తమ ఆదిదేవ సువిక్రమ ప్రభాకర
శంభో స్వయంభో భూతాదిః మహాభూతోఽసి విశ్వభూత

విశ్వం త్వమేవ విశ్వగోప్తాఽసి పవిత్రమసి విశ్వభవ
ఊర్ధ్వకర్మ అమృత దివస్పతే వాచస్పతే ఘృతర్చే
అనంతకర్మ వంశప్రాగ్వంశ విశ్వపాస్త్వమేవ 6

వరార్ధినాం వరదోఽసి త్వం
చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవ చ
హూయసే చ పునర్ద్వాభ్యాం తుభ్యంహోత్రాత్మనే నమః 7

*(శ్లో॥5-31,అధ్యా-4)*

ఓ దేవా! ఏకశృంగా, వృషార్చీ, సింధుపతే, వృషాకపీ, సురశ్రేష్ఠ అనాది సంభవా రుద్రా కపిలా విష్వక్సేనా సర్వభూతపతీ, ధ్రువా ధర్మాధర్మా, వైకుంఠా, వృషావర్తా, అనాది మధ్యనిధనా, ధనంజయా, శుచిశ్రవా (సత్కీర్తి) పృశ్నితేజా నిజజయా నీకు నమస్కారము అమృతేశయా సనాతనా, త్రిధామా, తుషితా, మహాతత్వా, లోకనాథా, పద్మనాభా, విరించీ, బహురూపా, అక్షయా, అక్షరా, హవ్యభోజీ, ఖండపరశూ, శక్రా, ముంజకేశా, హంసా, మహాదక్షిణా, హృషీకేశా, సూక్ష్మా, మహానియమధరా, విరజా, లోకప్రతిష్ఠా, అరూపా, అగ్రజా, ధర్మజా ధర్మనాభా నీకు ప్రణామాలు. గభస్తినాభా శతక్రతునాభా చంద్రరథా సూర్యతేజా, సముద్రవసనా, ఆజా, సహస్రశీర్షా, సహస్రచరణా, అధోముఖా, మహాపురుషా, పురుషోత్తమా, సహస్రబాహూ, సహస్రరూపా, సహస్రముఖా, సహస్రసంభవా, సహస్రసత్త్వా, నిన్ను ఈ విధంగా వర్ణిస్తారు. ఓ పుష్పహాసా, చరమా, వౌషట్‌వషట్‌కారాలు నీవే. నిన్ను మొదటివాడనీ యజ్ఞభోక్తవనీ, సహస్రధారివనీ భూర్భువః సువర్లోకరూపుడవని, వేదవేద్యుడవు మహాశయుడవు బ్రాహ్మణప్రియుడవనీ అంటారు. అంతరిక్షం, వాయువు ధర్మానివి నీవే. హోతవు, పురోహితుడవు నీవే. మంత్రానివి నీవే. నేతవు హోమహేతువు నీవే. నీవే అగ్ర్యుడవు, విశ్వధాముడవు. దిక్కులు నీవు. సుభాండము, యజింపబడదగిన వాడవు, చక్కని మేధస్వరూపివి నీవే. సమిధలు, మతిగతి దాతవు నీవే. మోక్షం వీవు యోగం నీవు. స్రష్టవు నీవు. ధాతవు, పరమయజ్ఞానివి, సోమరసానివి, దీక్షితుడవు, యజ్ఞదక్షిణవు. విశ్వానివీ నీవే. స్థవిరుడవు. హిరణ్యనాభుడవు.

నారాయణుడవు, త్రినేత్రుడవు, ఆదిత్యవర్ణుడవు, ఆదిత్య తేజస్వియగు మహాపురుషుడవు, పురుషోత్తముడవు, ఆది దేవుడవు, సువిక్రముడవు, ప్రభాకరుడవు, శంకరుడవు, స్వయంభువు నీవే. సమస్త భూత జాలానికీ ఆదివి, మహాభూతానివి, విశ్వభూతానివి, విశ్వానివి, విశ్వరక్షకుడవు నీవే. నీవు పవిత్రుడవు. విశ్వభవుడవు. ఊర్ధ్వ కర్మవు, అమృతానివి, దివస్పతివి, వాచస్పతివి, ఘృతార్చివి, వంశానివి, ప్రాగ్వంశానివి (అన్ని వంశాలకు మూలం) విశ్వ రక్షకుడవు నీవే, అర్థులకు కామ్యాలు వర్షించే వరదుడవైన నీకు నమస్కారం. నిన్ను నాలుగు మరి నాలుగు, రెండు మరియు అయిదు మరల రెండు హోమాలతో అర్చిస్తారు. అట్టి హోత్రాత్మ యజ్ఞరూపివైన ప్రభో! నీకు నమస్కారం.

కశ్యపాదులు చేసిన దివ్యస్తుతికి సంతోషించి శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. దేవతలందర్నీ ఆశీర్వదించి వరం కోరుకోమన్నాడు. అప్పుడు కశ్యపుడు “దేవదేవా! జగన్నాథా! నీవు అదితికి పుత్రుడుగా జన్మించు అని కోరారు. అదితి కూడా శ్రీహరిని అదే వరం కోరింది. మిగిలిన దేవతలంతా ముక్తకంఠంతో శ్రీహరిని అదితికి పుత్రుడుగా జన్మించమని ప్రార్థించారు. అందరి కోరికా విన్న శ్రీహరి “దేవతలారా! మీ కోరిక ప్రకారం అతి త్వరలో నేను అదితి నందనుడుగా జన్మిస్తాను. బలిచక్రవర్తి దర్పాన్ని అణిచి తిరిగి మీ మీ స్థానాల్ని మీకు ప్రసాదిస్తాను. ఇక ఎలాంటి ఆందోళనా లేకుండా తిరిగి మీ ప్రదేశాలకి వెళ్ళండి అని ధైర్యం చెప్పి పంపాడు.

శ్రీహరి వరప్రదానంతో అందరూ సంతోషించారు. కశ్యపుడితో సహా వారంతా జగన్నాథుడికి తమ కృతజ్ఞతలు చెప్పి తమ తమ ప్రాంతాలకి బయల్దేరారు. అదితి కశ్యపులు తమ ఆశ్రమానికి వచ్చారు. సాక్షాత్తు జగన్నాథుణ్ణి తన పుత్రుడుగా పొందటం కోసం ఆ దేవమాత అదితి ఒక శుభముహూర్తాన ప్రారంభించి పదివేల సంవత్సరాలు దీక్షగా తపస్సుచేసింది. సర్వజగద్రక్షకుడు, లోకనాథుడు అయిన ఆ శ్రీహరి తనని త్వరగా అనుగ్రహించాలని దైత్యులనుంచి

కోల్పోయిన తన పుత్రుల సామ్రాజ్యం తిరిగి వారికి దక్కాలని సంకల్పించి ఆ దివ్య మంగళ మూర్తిని మంగళకరమైన మాటలతో ఇలా కీర్తించింది.

## అదితి చేసిన వామన స్తుతి

నమః కృత్యా ర్తినాశాయ నమః పుష్కరమాలినే ।
నమః పరమకల్యాణాయాది వేధసే ॥ 1

నమః పంకజనేత్రాయ నమః పంకజనాభయే ।
నమః పంకజసంభూతి సంభవాయాత్మయోనయే ॥ 2

శ్రియః కాంతాయదాంతాయ దాంతదృశ్యాయచక్రిణే ।
నమః పద్మాసిహస్తాయ నమః కనకరేతసే ॥ 3

తథాత్మజ్ఞాన యజ్ఞాయ యోగిచింత్యాయ యోగినేః ।
నిర్గుణాయ విశేషాయ హరయే బ్రహ్మరూపిణే ॥ 4

జగచ్చతిష్ఠతే యత్ర జగతో యోనదృశ్యతే ।
నమః స్థూలాతిసూక్ష్మాయ తస్మైదేవాయ శార్ఙ్గిణే ॥ 5

యం నపశ్యంతి పశ్యంతో జగదప్యఖిలంనరాః ।
అపశ్యద్భిర్జగద్యశ్చ దృశ్యతే హృది సంస్థితః ॥ 6

బహిర్జ్యోతిరలక్ష్యో యోలక్ష్యతే జ్యోతిషః పరః ।
యస్మిన్నే వయతశ్చైవ యస్యైతదఖిలం జగత్ ॥ 7

తస్మై సమస్త జగతామమరాయ నమోనమః ।
ఆద్యః ప్రజాపతిః సోఽపి పితౄణాం పరమః పతిః ॥ 8

పతిః సురాణాం యస్తస్మై నమః కృష్ణాయవేధసే ।
యః ప్రవృత్తై ర్నివృత్తైశ్చ కర్మభిస్తు విరజ్యతే ।
స్వర్గాపవర్గ ఫలదో నమస్తస్మై గదాభృతే ॥ 9

యస్తుసంచింత్యమానోఽపి సర్వపాపం వ్యపోహతి ।
నమస్తస్మై విశుద్ధాయ పరస్మై హరిమేధసే ॥ 10

యే పశ్యంత్యఖిలాధార మీశాన మజమవ్యయమ్ ।
నపునర్జన్మ మరణం ప్రాప్నువంతి నమామితమ్ ॥ 11

యోయజ్ఞే యజ్ఞపరమై రిజ్యతే యజ్ఞసంస్థితః ।
తం యజ్ఞపురుషం విష్ణుం నమామి ప్రభుమీశ్వరమ్ ॥ 12

గీయతే సర్వవేదేషు వేదవిద్భి ర్విదాంగతిః ।
యస్తస్మై వేదవేద్యాయ నిత్యాయ విష్ణవేనమః ॥ 13

యతో విశ్వంసముద్భూతం యస్మిన్ ప్రలయమేష్యతి ।
విశ్వోద్భవ ప్రతిష్ఠాయ నమస్తస్మై మహాత్మనే ॥ 14

అబ్రహ్మ స్తంబ పర్యంతం వ్యాప్తం యేన చరాచరమ్ ।
మాయాజాల సమున్నద్ధం తముపేంద్రం నమామ్యహమ్ ॥ 15

యోఽత్రతో యస్వరూపస్థో బిభర్త్యఖిలమీశ్వరః ।
విశ్వం విశ్వపతిం విష్ణుం తం నమామి ప్రజాపతిమ్ ॥ 16

మూర్తంతమోఽసురమయం తద్విధో వినిహంతి యః ।
రాత్రిజం సూర్యరూపీ చ తముపేంద్రం నమామ్యహమ్ ॥ 17

యస్యాక్షిణీ చంద్రసూర్యౌ సర్వలోకశుభాశుభమ్ ।
పశ్యతః కర్మసతతం తముపేంద్రం నమామ్యహమ్ ॥ 18

యస్మిన్ సర్వేశ్వరేసర్వం సత్యమేతన్మయోదితమ్ ।
నానృతం తమజం విష్ణుం నమామి ప్రభవాప్యయమ్ ॥ 19

యద్యేతత్సత్యముక్తం మే భూయశ్చాతో జనార్దనః ।
సత్యేన తేన సకలాః పూర్యంతాం మే మనోరథాః ॥ 20

*(శ్లో॥17-36,అధ్యా-6)*

"కృత్యాది అభిచార పీడితుల బాధలు పోగొట్టే శ్రీహరికి నమస్కారం. జీవుల శుభాశుభకర్మల్ని రాత్రి పగలు సూర్యచంద్రులు అనే కళ్ళతో చూసే ఉపేంద్రుడికి నమస్కారం. ప్రభూ! జగన్నాథా! నేను స్తుతించిన మాటలన్నీ సత్యాలే

అయితే ఆ మాటల ప్రభావంతో నా మనోరథం నెరవేరాలి. దయచేసి వెంటనే నన్నునుగ్రహించు” అని ప్రార్థించింది.

అదితి చేసిన స్తవాన్ని విని ఆమె ఆర్తిని గ్రహించిన శ్రీహరి కేవలం ఆమెకి మాత్రమే కనిపించేలా దర్శనమిచ్చి “ధర్మజ్ఞురాలా! నీ కోరిక నెరవేరుతుంది. నీవు తపస్సు చేసిన ఈ దివ్య ప్రదేశం అదితివనంగా జగత్ప్రసిద్ధమవుతుంది. నీవు కోరినట్టు నీ పుత్రుడు ఇంద్రుడికి తిరిగి త్రిలోకాధిపత్యం లభిస్తుంది. అతి త్వరలో నేను నీ గర్భంలో ప్రవేశిస్తున్నాను. ఇక తపస్సు చాలు వెళ్ళిరా” అని పంపించాడు.

శ్రీహరి అన్నమాట ప్రకారం ఒక శుభముహూర్తంలో అదితి గర్భంలోకి ప్రవేశించాడు. జగన్నాథుడు ఆమె గర్భంలో ప్రవేశించేసరికి ఒక్కసారిగా భూమండలమంతా కంపించింది. మహాపర్వతాలు క్రుంగిపోయాయి. మహాసాగరాలు ఉవ్వెత్తున ఎగిసాయి. ఆ అదితి ఎక్కడ అడుగుపెడితే అక్కడ నేల క్రుంగిపోసాగింది. అలా శ్రీహరి దేవమాత గర్భంలో ప్రవేశించగానే దైత్యుల తేజస్సు క్రమంగా క్షీణించసాగింది.

ఉన్నట్టుండి తమ పరివారమంతా తేజోహీనులవటంతో బలిచక్రవర్తికి ఆందోళన కలిగింది. వెంటనే తన తాత గారైన ప్రహ్లాదుడి దగ్గరికి వెళ్ళి పితామహా! మన దైత్యులందరూ ఉన్నట్టుండి తమ తమ తేజస్సుని కోల్పోయి నీరసంగా కనిపిస్తున్నారు. కారణమేమిటో నాకు తెలియటం లేదు. ఎవరైనా మనమీద అభిచార ప్రయోగాలు చేసారా! లోకమంతా ఎంతో అల్లకల్లోలంగా ఉంది. పర్వతాలు కంపిస్తున్నాయి. గ్రహాలన్నీ తమ కక్ష్యల్లో నడవటం లేదు. చూస్తుంటే మనకి చెడ్డరోజులొస్తున్నట్టనిపిస్తోంది. ఇప్పుడేం చేయాలో చెప్పండి” అని ప్రార్థించాడు.

బలిమాటలు విన్న ప్రహ్లాదుడు ఈ ఉత్పాతాలన్నీ అసురుల వినాశనాన్ని సూచిస్తున్నాయని గ్రహించాడు. ఒక్క క్షణం ధ్యానంలోకి వెళ్ళి తమ ఇష్టదైవం శ్రీహరి ఎక్కడున్నాడా అని గాలించాడు. కొద్దిసేపటికి దేవదూత అదితి గర్భంలో

శిశువుగా ఆయన చేరినట్టు ప్రహ్లాదుడికి కనిపించింది. ఎంతో ఆశ్చర్యంగా ఆ శిశువుని తేరిపార చూడగా ఆ శిశువుల్లో – అష్టవసువులు, ఏకాదశరుద్రులు, పంచభూతాలు, సప్తసాగరాలు, పద్నాలుగులోకాలు, ద్వాదశఆదిత్యులు, సప్తమరుత్తులు, నవద్వీపాలు, జ్యోతిర్మండలం నక్షత్రాలు, దక్షాదిప్రజాపతులు, అష్టదిక్పాలకులు, సప్తర్షులు, నవగ్రహాలు, విశ్వేదేవులు, నాగులు, గంధర్వులు, విరోచనుడు, ప్రహ్లాదుడు, బలి, నరకాసురుడు, బాణాసురుడు – ఇలా సమస్త విశ్వం కనిపించింది. కొద్ది సేపు అద్భుత దృశ్యాన్ని చూసి తిరిగి ఈ లోకంలోకి వచ్చాడు ప్రహ్లాదుడు. వెంటనే బలిని పిలిచి "మనవడా! మన దైత్యులు తేజోహీనులవటానికి కారణం నాకు తెలిసింది. చెబుతా విను" అని అంటూ ముందుగా ధ్యానంలో తాను దర్శించిన శ్రీహరిని ఇలా కీర్తించాడు.

## ప్రహ్లాదుడు చేసిన శ్రీహరి స్తవం

దేవదేవో జగద్యోని రయోనిర్జగదాదిజః ।
అనాదిరాది ర్విశ్వస్య వరేణ్యో వరదో హరిః ॥ 1

పరావరాణాం పరమః పరాపరనతాంగతిః ।
ప్రభుః ప్రమాణం మానానాం సప్తలోకగురోర్గురుః ।
స్థితిం కర్తుం జగన్నాథః సో ఽ చింత్యో గర్భతాంగతః ॥ 2

ప్రభుః ప్రభూణాం పరమః పరాణా మనాదిమధ్యో భగవాననంతః ।
త్రైలోక్యమంశేన సనాథమేకః కర్తుం మహాత్మా ఽ దితిజో ఽ వతీర్ణః ॥ 3

నయస్యరుద్రోనచపద్మ యోని ర్నేంద్రోవ సూర్యేందు మరీచి మిశ్రాః ।
జానంతి దైత్యాధిపయత్స్వరూపం సవాసుదేవః కలయా ఽ వతీర్ణః ॥ 4

యమక్షరం వేదవిదో వదంతి విశంతి యం జ్ఞానవిధూతపాపాః ।
యస్మిన్ ప్రవిష్టానపునర్భవంతి తం వాసుదేవం ప్రణమామి దేవమ్ ॥ 5

భూతాన్యశేషాని యతోభవంతి యథోర్మయస్తోయనిధేరజస్రమ్ ।
లయంచయస్మిన్ ప్రలయే ప్రయాంతి తంవాసుదేవం ప్రణతో ఽ స్మ్యచింత్యమ్ ॥ 6

నయస్య రూపంనబలం ప్రభావో నచప్రతాపః పరమన్యపుంసః ।
విజాయతే సర్వపితామహాద్యై స్తంవాసుదేవం ప్రణమామి నిత్యమ్ ॥ 7
రూపస్య చక్షుర్గ్రహణేత్వగేషా స్పర్శగ్రహిత్రీర సనారసస్య ।
ఘ్రాణం చ గంధ గ్రహణే నియుక్తం నఘ్రాణ చక్షుః శ్రవణాదితస్య ॥8
స్వయం ప్రకాశః పరమార్థతోయః సర్వేశ్వరోవేదితవ్యః సయుక్త్యా
శక్యం తమీడ్య మనఘం చ దేవం గ్రాహ్యం నతోఽహం హరిమీశితారమ్ ॥9
యేనైకదంష్ట్రేణ సముద్ధృతేయం ధరాఽచలాధార యతీహసర్వమ్ ।
శేతేగ్రసిత్వా సకలం జగద్య స్తమీడ్య మీశం ప్రణతోఽస్మి విష్ణుమ్ ॥ 10
అంశావతీర్ణేన చ యేనగర్భే హృతాని తేజాంసి మహాఽసురాణామ్ ।
నమామితం దేవ మనంత మీశ మశేషసంసారతరోః కుఠారమ్ ॥ 11

*(శ్లో॥17-27,అధ్యా-8)*

అయోనిజుడు, దేవదేవుడు జగత్తుకన్నా ముందు పుట్టినవాడు, మొదలన్నదే లేనివాడు, లోకాలన్నిటికీ అధిపతి అందరికీ పరమగతి, ప్రభువులకి ప్రభువు అయిన శ్రీహరికి నమస్కారం. అనంతుడు, ఈశ్వరుడు, సంసారవృక్షాన్ని ఛేదించే కుఠారం లాంటివాడు అయిన దేవ ప్రభువుకి నమస్కారం అని తన ఇష్టదైవమైన శ్రీహరి స్తుతించి, ఓ బలీ! జగత్ప్రభువు, దేవ దేవుడైన శ్రీహరి తన పదహారో అంశతో దేవమాత అదితిని గర్భంలోకి ప్రవేశించాడు. ఆ శిశువే మీ అందరి తేజస్సున్ని బలాన్ని అపహరించాడు" అని చెప్పగా బలిచక్రవర్తి తన తాతతో ఇలా అన్నాడు.

పితామహా! మనందరికీ ఇంత భయాన్ని కలిగించే ఆ శ్రీహరి ఎవరు? నీవింతగా చెబుతున్నావే అతడక్కెడుంటాడు? ఆ శ్రీహరి కన్నా గొప్ప వీరాధివీరులు విప్రచిత్తి శిబి, శంకు, అయఃశంకు, అశ్విరుడు, భంగకారుడు, మహాహనువు, ప్రతాపి, దుర్జయుడు - ఇలా ఎంతో మంది మన పరివారంలో ఉన్నారు. వీరంతా భూమండలాన్నంతా ఒంటిచేత్తో మోయగల సమర్థులు వీరిలో ఒక్కరి బలానికీ నీవుచెప్పిన శ్రీహరి సరితూగడు" అని శ్రీహరిని నిందించాడు.

తన ఇష్టదైవం శ్రీహరిని తూలనాడేసరికి 'ఆపు నీ అధిక ప్రసంగం' అని ఒక్కసారిగా గద్దించాడు ప్రహ్లాదుడు. "బలీ! నీ మాటలు వింటుంటే దైత్యులందరికీ వినాశకాలం దాపురించిందని అనిపిస్తోంది. అందుకే నీవి వ్యర్థప్రలాపాలు చేస్తున్నావు. జగన్నాథుడైన శ్రీహరిని అవమాన పరుస్తున్నావు. నీలాంటి పాపాత్ముడు తప్ప శ్రీహరిని ఎవరూ విమర్శించరు. నీవు చెప్తున్న ఈ దైత్యులు, దానవులు, సకలదేవతలు, స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచం, నీవు, నేను, అందరూ ఆ దేవదేవుడి అల్పాంశం నుంచే ఆవిర్భవించాం.

శ్రీహరి నా ఇష్టదైవమని నీకు తెలిసినప్పటికీ ఆయన్ని నా ముందే దూషించి నా పెద్దరికాన్ని అవమానపరిచావు. నీలాంటి అథముణ్ణి నా మనవడని చెప్పుకోవటానికి సిగ్గుపడుతున్నాను. ఓ బలీ! నీ తండ్రి విరోచనుడు నీకు గురువు. నీ తండ్రికి నేను గురువును. నాకు శ్రీమన్నారాయణుడు గురువు. అలాంటి సకల గురవులకీ గురువైన వాణ్ణి నీవు నిందించావు. జగద్గురువుని నిందించిన నీవు శాపార్హుడివి. కనుక అతి త్వరలో "నీవు రాజ్యభ్రష్టుడివై పోగాక!" అని శపించాడు ప్రహ్లాదుడు.

ప్రహ్లాదుడి శాపవచనాలు విని బలిచక్రవర్తి గజగజావణికి పోయాడు. వెంటనే ఆయన పాదాల మీద పడి పితామహా! నన్ను క్షమించు. అవివేకంతో, బలగర్వంతో నేనలా మాట్లాడాను. చిన్నవాణ్ణి నన్ను కనికరించండి. అజ్ఞానం నా కళ్ళు కప్పేసింది. మోహంతో నేనేం మాట్లాడుతున్నానో నాకు తెలియటం లేదు. మీరు చెప్పినట్టు నేను శాపార్హుడనే. నా అవినయం వల్ల రాజ్యాన్ని, కీర్తిని కోల్పోతాను. అయినా దానికి నేనేం చింతించటం లేదు. తమలాంటి మహానుభావులు లభించటం ఎంతో కష్టం. కనుక పితామహా! నన్ను క్షమించండి అని పరిపరి విధాలుగా దీనంగా ప్రార్థించాడు.

మనవడి ప్రార్థన ప్రహ్లాదుడి మనసుని కరిగించింది. "నాయనా! బలీ! విధి చాలా బలీయమైంది. నీ మూర్ఖత్వం నాకు కోపాన్ని తెప్పించింది. ఇదంతా శ్రీహరి సంకల్పం. నా శాపం ఫలించక మానదు. అయితే ఇందుకు నీవేం విచారించకు. నీ రక్షణ బాధ్యత నేనే చూసుకుంటాను. వెళ్ళిరా ! అని పంపించాడు.

## వామనావతారం

దేవమాత అదితిగర్భంలో చేరిన శ్రీహరి క్రమక్రమంగా పెరగసాగాడు. సరిగ్గా పదినెలలు గడిచేసరికి పుణ్యాత్మురాలైన అదితి గర్భం నుంచి వామనావతారుడిగా శ్రీహరి జన్మించాడు. వామనుడి అవతరణతో దేవతల్లో ఆనందం వెల్లివిరిసింది. దేవమాత దుఃఖం తొలగిపోయింది. అందరికీ తిరిగి మంచిరోజులొస్తాయన్న నమ్మకం కలిగింది. వాయువులు చల్లగా వీచాయి. ఆకాశం నిర్మలంగా ప్రశాంతంగా వుంది. సకల జీవుల్లో ధర్మాసక్తి పెరిగింది. అప్పటిదాకా సకల జీవుల్లో ఉన్న జాడ్యం తొలగిపోయింది. దేవదేవుడు వామనుడుగా జన్మించగానే బ్రహ్మ అక్కడికి వచ్చి ఆయనకి జాతకర్మ నిర్వహించాడు. ఆ సందర్భంగా ముల్లోకాల్నీ రక్షించబోయే వామనుణ్ణి ఇలా కీర్తించాడు.

## బ్రహ్మ చేసిన వామన స్తుతి

జయధీశః జయాజేయః జయవిశ్వగురోహరేః ।
జయమృత్యుజరాతీతః జయానంతః జయాచ్యుత ॥ 1

జయాజిత జయశేష జయవ్యక్తస్థితే జయ ।
పరమార్థార్థ సర్వజ్ఞ జ్ఞానజ్ఞేయార్థనిః సృత ॥ 2

జయాశేష జగత్సాక్షిన్ జగత్కర్తర్జగద్గురో ।
జగతోఽజగదంతేశః స్థితౌ పాలయతే జయః ॥ 3

జయాఽఖిలజయాశేష జయస్సర్వహృదిస్థిత ।
జయాదిమధ్యాంతమయ సర్వజ్ఞానమయోత్తమ ॥ 4

ముముక్షుభిరనిర్దేశ్య నిత్యహృష్ట జయేశ్వరః ।
యోగిభిర్ము క్తికామైస్తు దమాదిగుణభూషణ ॥ 5

జయాతిసూక్ష్మదుర్జ్ఞేయ జయస్థూల జగన్మయః ।
జయాసూక్ష్మాతి సూక్ష్మత్వం జయానింద్రియ సేంద్రియ ॥ 6

జయ స్వమాయా యోగస్థ శేషభోగ జయాక్షర ।
జయైకదంష్ట్ర ప్రాంతేన సముద్ధృత వసుంధరః ॥ 7

నృకేసరిన్ః సురారాతి వక్షఃస్థలవిదారణః ।
సాంప్రతం జయవిశ్వాత్మన్ మాయావామనకేశవః ॥ 8

నిజమాయాభిరిచ్ఛిన్న జగద్ధాత ర్జనార్దనః ।
జయాచింత్యజయానేక స్వరూపైక విధప్రభో ॥ 9

వర్ధస్వ వర్ధితానేక వికార ప్రకృతేహరే ।
త్వయ్యేషా జగతామీశే సంస్థితాధర్మ పద్ధతిః ॥ 10

సత్వామహంస చేశానో నేంద్రాద్యాస్త్రిదశాహరే ।
జ్ఞాతుమీశా న మునయః సనకాద్యానయోగినః ॥ 11

త్వం మాయాపటనం వీతో జగత్యత్ర జగత్పతే ।
కస్త్వాం వేత్స్యతి సర్వేశ త్వత్ప్రసాదం వినా నరః ॥ 12

త్వమేవాధితోయస్య ప్రసాదసుముఖః ప్రభో ।
స ఏవ కేవలం దేవం వేత్తిత్వాం నేతరోజనః ॥ 13

తదీశ్వరేశ్వరేశాన విభోవర్ధస్వ భావన ।
ప్రభావాయాస్య విశ్వస్య విశ్వాత్మన్ పృథులోచనః ॥ 14

*(శ్లో॥18-31,అధ్యా-9)*

సర్వాధీశా! సర్వాజేయా, నీకు జయమగుగాక, విశ్వగురూ నీకు జయం. శ్రీహరీ, జన్మమృత్యుజరాతీతా, అచ్యుతా జయం, జయం! అశేషా, అవ్యక్తరూపా, సర్వజ్ఞా, పరమార్థరూపా, జ్ఞానజ్ఞేయసారరూపా, జగత్సాక్షీ, జగత్కారణా, జగద్గురో, జగత్ స్థితిపాలకా నీకు జయమగుగాక! సకల జీవహృదయ నివాసా, ఆదిమధ్యాంతమయా, జ్ఞానమయా! ముముక్షువులకు గూడ నిర్దేశించినలవిగానివాడా, నిత్యహృష్టా, దయాదిసద్గుణభూషణా, అతిసూక్ష్మా, స్థూలా, దుర్జేయాసర్వమయాజయం. ఇంద్రియరూపా, యింద్రియరహితా, స్వమాయా యోగస్థితా, శేషశాయీ నీకు జయం జయం! నిజదంష్ట్రాగ్ర భాగాన వసుంధరను నిలిపిన ప్రభూ, నృకేసరీ, దేవశత్రు వక్షఃస్థల విదారణా ప్రస్తుతం కపటవామన రూపం దాల్చిన విశ్వాత్మకా కేశవా నీకు జయం. స్వీయ

మాయాపరిచ్ఛిన్నా! జగద్ధారకా, జనార్ధనా, అనేక స్వరూపాలలో వెలిగే ఏకైక తత్త్వమా, బహువిధ ప్రకృతి వికృతుల పెంపొందించువాడా నీకు జయం. నీవు వర్ధిల్లుము. జగదీశుడవగు నీవు ధర్మానికి మూలాధారుడవు. ఇలాంటి నిన్ను నేను గాని ఈశుడు కాని ఇంద్రాది దేవతలు గాని సనకాది మునులు యోగులు కాని తెలియజాలరు. నీవు స్వీయమాయ అనే తెరమరుగున ఉంటావు. అలాంటి మాయావతిని నిన్నెరుగ గలవారెవ్వరు? నీ అనుగ్రహం కలిగినవాడు, నిన్నారాధించి నీ కృపకు పాత్రుడైనవాడే నిన్ను గుర్తించును. ఓ ఈశాన, ఈశ్వరేశ్వర భూతభావనా వర్ధిల్లు. ఓ విశాలనేత్రా! విశ్వాత్మా! విశ్వకల్యాణార్ధం నీవు వర్ధిల్లు. ఓ విశాలనేత్రా! విశ్వకల్యాణార్ధం నీవు వర్ధిల్లు. నీకు జయమగుగాక!

బ్రహ్మచేసిన స్తోత్రం విని వామన రూపంలో ఉన్న శ్రీహరి సంతోషించి "విరించీ! పూర్వం ఇంద్రాది దేవతలతో నీవు స్తుతించినప్పుడు దేవతలందరికీ మేలు చేస్తానని అలాగే అదితి - కశ్యపులు చేసిన స్తోత్రాలు విని వారికి పుత్రుడుగా జన్మించి ఇంద్రుడికి త్రిలోకాధిపత్యాన్ని ప్రసాదిస్తానని మాటిచ్చాను. ఇప్పుడామాట నిలబెట్టుకుంటా. ఇది తథ్యం" అని అన్నాడు.

బాలవటువుగా (వామనుడిగా) అవతరించిన శ్రీహరికి బ్రహ్మదేవుడు కృష్ణాజినం(జింకచర్మం) ప్రసాదించగా, బృహస్పతి యజ్ఞోపవీతాన్ని, మరీచి మహర్షి ఆషాఢ దండాన్ని, వశిష్ఠ మహర్షి కమండలాన్ని, అంగిరసుడు పట్టుపుట్టల్ని, పులహుడు ఆసనాన్ని, పులస్త్యుడు పీతాంబరాన్ని సమర్పించారు.

ఆ విధంగా బాల బ్రహ్మచారి రూపంలో కొలువైన వామనుణ్ణి, ఓంకార స్వరంతో ముస్తాబైన వేదాలు, శాస్త్రాలు సాంఖ్యయోగ విద్యలు ఆశ్రయించాయి. సకల విద్యాసంపన్నుడైన వామనుణ్ణి దర్శించి దేవతలంతా ఆనంద పరవశులయ్యారు.

బలిచక్రవర్తి తన కులగురువైన శుక్రాచార్యుడి ఆధ్వర్యంలో తేజస్సు కోల్పోయిన దైత్యుల కోసం ఒక మహాయజ్ఞాన్ని ప్రారంభించాడు. ఎంతో శ్రద్ధతో బలియాగాన్ని దీక్షగా నిర్వహిస్తున్నాడు.

వామనుడు దండకమండలాలు, ఛత్రం ధరించి నెమ్మదిగా నడుచుకుంటూ బలిచేస్తున్న యజ్ఞవాటికకి బయల్దేరాడు. ఆయన ఒక్కో అడుగు వేస్తుంటే ఆయన పాదాల బరువుకి నేలక్రుంగటం ప్రారంభించింది. పర్వతాలు కదిలాయి. బృహస్పతి దారి చూపిస్తుండగా వామనుడు ముందుకి నడుస్తున్నాడు. అదే సమయంలో పాతాళంలో ఉన్న శేషుడు బైటికి వచ్చి వామనుడికి నమస్కరించాడు.

అక్కడ బలిచేస్తున్న యజ్ఞవాటిక కూడా ఒక్కసారి కంపించింది. దాని ప్రక్కనే ఉన్న మహాపర్వతాలు క్రుంగిపోయాయి. ఈ ఉత్పాతాన్ని గమనించిన బలి "శుక్రాచార్యులతో" గురుదేవా! ఏమిటి? ఈ భూమి ఇలా ఎందుకు కంపిస్తోంది? అని ప్రశ్నించాడు. శుక్రాచార్యుడు ధ్యానంలో చూసి బలీ! జగన్నాథుడైన శ్రీహరి అదితి గర్భాన వామనుడుగా జన్మించాడు. ప్రపంచాన్నే భరించే ఆ వామనుడి పాదాల బరువుని భూమి మోయలేకపోతుంది. అందుకే ఈ ప్రకంపనలు. ప్రస్తుతం అసురులంతా యజ్ఞార్హతని కోల్పోయారు. అందుకే నీవు చేస్తున్న ఈ యాగంలో అగ్ని హవిస్సుల్ని స్వీకరించటం లేదు. ప్రస్తుతం బాలవటువుగా ఉన్న ఆ వామనుడు నీ యజ్ఞవాటికకే వస్తున్నాడు" అని చెప్పాడు.

శుక్రాచార్యుడి మాటలు విని బలి ఆనందంతో పొంగిపోయాడు. సాక్షాత్తు యజ్ఞేశ్వరుడే తన యజ్ఞవాటికకి వస్తున్నాడని తెలిసి సంబర పడిపోయాడు. ఏ పరమాత్మని దర్శించాలని యోగి జనమంతా నిరంతరం పరితపిస్తుంటారో అలాంటి పరమాత్మ తనకోసం రావటం బలికి ఎంతో ఉద్వేగాన్ని కలిగించింది. వెంటనే శుక్రాచార్యులతో "గురుదేవా! ఇప్పుడు నేనేం చేయాలో చెప్పండి" అని అడిగాడు బలి.

**శుక్రాచార్యుడి హెచ్చరిక :** దైత్యరాజా! వేదాల్ని అనుసరించే సత్త్వ గుణ సంపన్నులైన దేవతలు మాత్రమే యజ్ఞభాగాల్ని స్వీకరించటానికి అర్హులు. కానీ నీ శక్తి సామర్థ్యాలతో అసురులందరిలో సాత్త్విక గుణాన్ని పెంపొందించి వారికి కూడా యజ్ఞబాగం దక్కేలా చేసావు. సత్య స్వరూపుడైన ఆ శ్రీహరి ఒకవైపు సృష్టిచేస్తూనే మరోవైపు తాను చేసిన సృష్టిని తానే లయం చేస్తుంటాడు.

స్థితికారకుడైన శ్రీహరి నిన్ను ఏదోలా ఓడిస్తాడు. నిన్ను బంధిస్తాడు. అది గ్రహించి నీకెలా అనిపిస్తే అలా చేయి. ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ఆ వామనుడు మాయావి. ఏదో ఒకటి చేసి నిన్ను వంచిస్తాడు. అతడు ఏ చిన్న వస్తువు అడిగినా ఇస్తానని మాటివ్వకు. కేవలం ధనం మాత్రం ఎంతకావాలన్నా ఇస్తానని చెప్పు జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

గురువు మాటలు విన్న బలి ఆయనతో ఇలా అన్నాడు "గురుదేవా! దేహి అని యాచించిన వాడికి లేదని ఎలా చెప్పగలను. సకల లోకాల్నీ పాలించే ఆ శ్రీహరే వచ్చి నన్ను యాచిస్తే ఆయనకి ఇది ఇవ్వను, ఇదే ఇస్తాను అని ఎలా అనగలను. ఎన్నో వ్రతాలు, తపస్సులు చేస్తే గానీ లభించని గోవిందుడు స్వయంగా నా దగ్గరకి రావటం ఎంత భాగ్యం. అలాంటి శ్రీహరికి లేదని చెప్పటం కన్నా ప్రాణత్యాగం చేయటం మంచిది. గురుదేవా! నా దానం స్వీకరించి దేవతలకు ఆయన మేలు చేయదలుచుకుంటే చేయనివ్వండి. నాకేం బాధలేదు. నా భక్తిని ఆయన గ్రహించి నన్నను గ్రహిస్తాడన్న విశ్వాసం నాకుంది. దయచేసి నేను చేసే దానానికి అడ్డు చెప్పకండి" అని అన్నాడు.

బలి–శుక్రాచార్యుల సంవాదం ఇలా జరుగుతుండగానే కపటవేషధారి అయిన వామనుడు బలి యజ్ఞవాటికలోకి అడుగుపెట్టాడు. మహాతేజస్సుతో ప్రకాశిస్తున్న బలిని చూడగానే యాగశాలలో ఉన్న దైత్యులంతా తమ తేజస్సుల్ని కోల్పోయారు. బలిచక్రవర్తి దూరం నుంచే వామనుడి రాకని చూసి తన జన్మ ధన్యమైందని ఆనందించాడు. అక్కడున్న సకల మునులు, ఋషులు ఆ బాలవటువుని, అతడి దివ్యతేజస్సుని చూసి ఆశ్చర్యపోయారు. ముకుళిత హస్తాలతో ఆయనకి నమస్కరించారు. అంతలో బలిచక్రవర్తి ముందుకి వచ్చి వామనుడికి పాద్య, అర్ఘ్యాల్ని సమర్పించి యథోచితంగా అతిథి సత్కారాలు చేసాడు. ఒక ఉన్నతాసనం మీద ఆయన్ని కూర్చోబెట్టి ఎంతో వినయంగా ఇలా అడిగాడు.

వటోత్తమా! తమరు నా యజ్ఞవాటికకి అతిథిగా రావటం నా పూర్వజన్మ సుకృతం. ఈ రోజు నా జీవితం ధన్యమైంది. తమరికి ఏం కావాలో కోరుకోండి.

గజాలు, అశ్వాలు, ఆభరణాలు, బంగారం, భూమి ఏదైనా సరే తమకి దానం చేస్తాను" అన్నాడు. బలి మాటలు విన్న వడుగు చిరునవ్వుతో "మహారాజా! నీవు చెప్పినవేవీ నాకవసరం లేదు. పవిత్రాగ్నుల్ని ఉంచుకోవటానికి నాకు 'మూడడుగుల' నేలని మాత్రం ఇవ్వు. అదిచాలు. మిగిలినవన్నీ అవసరమైన వారికి దానంచెయ్యి అన్నాడు". ఆ కోరిక విని ఆశ్చర్యపోయిన బలి స్వామీ! మూడుడుగుల నేల కోరటమేమిటి? అదేం సరిపోతుంది. వందవేల అడుగులు ఇమ్మంటారా అన్నాడు. రాజా! నాకు మూడడుగులు చాలు. ఇంకా ఎందరో యాచకులున్నారు. వారికి నీవివ్వాలనుకున్నవన్నీ ఇవ్వు. నాకిదిచాలు" అనగానే బలి తన సంసిద్ధత వ్యక్తం చేసి జలం తీసుకుని ధారాపూర్వకంగా వామనుడికి మూడడుగుల నేలని దానం చేసాడు.

## వామనుడి విశ్వరూపం

బలిచక్రవర్తి చేతినుంచి దానజలం ఎప్పుడైతే వామనుడి చేతిలో పడిందో అంతే! అప్పటిదాకా చిన్న వడుగుగా ఉన్న ఆ వామనుడు ఇంతింతై వటుడింతై అన్నట్టు అక్కడున్న వారందరికీ తన విరాట్ స్వరూపాన్ని చూపించాడు.

పాణౌతు పతితేతోయే వామనో ఒభూదవామనః ।
సర్వదేవమయం రూపం దర్శయామాన తత్క్షణాత్ ॥ 1

చంద్రసూర్యౌ తు నయనే ద్యౌః శిరశ్చరణౌ క్షితి ।
పాదాంగుల్యః పిశాచాస్తు హస్తాంగుల్యశ్చ గుహ్యకాః ॥ 2

విశ్వేదేవాశ్చ జానుస్థాజంఘే సాధ్యాః సురోత్తమాః ।
యక్షానఖేషు సంభూతా రేఖాస్వప్సరస స్తథా ॥ 3

దృష్టిర్ఋక్షాణ్యశేషాని కేశాః సూర్యాంశవః ప్రభోః ।
తారకా రోమకూపాణి రోమేషు చ మహర్షయః ॥ 4

బాహవో విదిశస్తస్య దిశః శ్రోత్రే మహాత్మనః ।
అశ్వినౌశ్రవణే తస్య నాసా వాయుర్మహాత్మనః ॥ 5

ప్రసాదే చంద్రమాదేవో మనోధర్మః సమాశ్రితః ।
సత్యమస్యాభవద్వాణీ జిహ్వా దేవీ సరస్వతీ ॥ 6

గ్రీవాఽదితిర్దేవమాతా విద్యాస్తద్వలయ స్తథా ।
స్వర్గద్వారమభూన్ మైత్రం త్వష్టాపూషా చ వై భ్రువౌ ॥ 7

తనౌ కుక్షిషు వేదాశ్చ జానునీ చ మహామఖాః ।
ఇష్టయః పశవశ్చాన్య ద్విజానాం చేష్టితాని చ ॥ 8

తస్య దేవమయం రూపం దృష్ట్వా విష్ణోర్మహాత్మనః ।
ఉపసర్పంతితే దైత్యాః పతంగా ఇవ పావకమ్ ॥ 9

చిక్షురస్తు మహాదైత్యః పాదాంగుష్టం గృహీతవాన్ ।
దంతాభ్యాం తస్యవై గ్రీవా మంగుష్ఠే నాహనద్దరిః ॥ 10

ప్రమథ్య సర్వానసురాన్ పాదహస్తతలై ర్విభుః ।
కృత్వారూపం మహాకాయం సంజహారాశు మేదినీమ్ ॥ 11

తస్య విక్రమతో భూమిం చంద్రాదిత్యౌ స్తనాంతరే ।
నభోవిక్రమమాణస్య సక్థిదేశే స్థితావుభౌ ॥ 12

పరం విక్రమమాణస్య జానుమూలే ప్రభాకరౌ ।
విష్ణో రాస్తాంస్థితస్యైతౌ దేవపాలనకర్మణి ॥ 13

జిత్వాలోక త్రయంతాంశ్చ హత్వాచాసుర పుంగవాన్ ।
పురందరాయ త్రైలోక్యం దదౌ విష్ణురురుక్రమః ॥ 14

*(శ్లో॥49-65,అధ్యా-10)*

సకల దేవతామయుడైన వామనుడికి సూర్యచంద్రులు నేత్రాలు. ద్యులోకం - ఆయన శిరస్సు, భూమి - పాదాలు, పాదాల వేళ్ళు - పిశాచాలు, చేతులవేళ్ళు-యక్షులు, విశ్వేదేవులు-మోకాళ్ళు, జంఘులు-సాధ్యులు, చేతిరేఖలు - అప్సరగణాలు, చూపులు-నక్షత్రాలు, సూర్యకిరణాలు-కేశాలు, తారలు-రోమాలు, ఆ రోమాల్లోనే ఎంతోమంది మహర్షులున్నారు. బాహువులు-విదిశలు, చెవులు-దిశలు, అశ్వినీ దేవతలు - బావ్యాశ్రవణాలు, వాయువు-నాసిక, చంద్రుడు - మనస్సు, ధర్మదేవత - సత్యమైనవాక్కు, సరస్వతి - నాలుక

ఆయన కంఠం – దేవమాత అదితి, త్రయీవిద్యలు – కంఠం మీదవున్న మూడు ముడతలు, అనూరాధ– స్వర్గద్వారం, త్వష్ట, పూషలు– కనుబొమలు, ఆయన నోరు – వైశ్వానరాగ్ని, వృషణాలు – ప్రజాపతులు, హృదయం – పరబ్రహ్మ, పురుషాంగం – కశ్యపుడు, వీపు– మనువులు, మరుత్తులు – సంధిస్థానాలు, వక్షోభాగం – రుద్రుడు, ధృతి – సప్తసముద్రాలు, గంధర్వులు – ఉదరం, మేథస్సు – లక్ష్మీదేవి, సకల విద్యలూ – కటి ప్రదేశం, ఆయన దివ్యతేజస్సు – సకల గ్రహనక్షత్ర జ్యోతిర్గణాలు.

వేదాలన్నీ ఆ వామనుడి కడుపులోనే ఉన్నాయి. మహాయజ్ఞాలు, యిష్టులు, పశువులు, బ్రాహ్మణులు చేసే కర్మలు ఆయన మోకాళ్ళలో నిలిచాయి. పరంధాముడైన ఆ వామనుడి విశ్వరూపాన్ని చూసి ఆయన మీదకి దాడిచేసిన అసురులు అగ్నిలో దూకే శలభాల్లాగా మాడిపోయారు. అలా రాక్షసుల్ని అణగద్రొక్కి త్రివిక్రమరూపంలో విజృంభించాడు వామనుడు. ఒక్కడుగుతో భూమిని ఆక్రమించినప్పుడు వామనుడి స్తనాల భాగంలో సూర్య –చంద్రులు నిలిచారు. ఆయన రెండో పాదంతో ఆకాశాన్ని ఆక్రమించగా ఆ సూర్యచంద్రులు ఆయన పిరుదుల దగ్గరకొచ్చారు. ఇంకా పైకి ఆయన ఆక్రమించగా వారిద్దరూ వామనుడి మోకాళ్ళ దగ్గరకొచ్చారు.

ఈ విధంగా దేవతల కార్యాన్ని సాధించటం కోసం శ్రీహరి విరాట్ రూపాన్ని ధరించి రాక్షస సంహారం చేసి ఇచ్చినమాట ప్రకారం త్రిలోకాధిపత్యాన్ని ఇంద్రుడికి అప్పగించాడు. అలాగే తనకి వరాన్ని ఇచ్చిన బలిచక్రవర్తిని భూమిక్రింద ఉన్న పాతాళలోకానికి ప్రభువుని చేసాడు. పరమభక్తితో తనకి మూడడుగుల నేలని దానం చేసిన ధర్మాత్ముడు బలిచక్రవర్తితో

'దైత్యరాజా! నీవిచ్చిన దాన జలాన్ని నేను గ్రహించాను. ఆ పుణ్యఫలంగా నీకు కల్పాంతం వరకూ ఆయుర్దాయం ఉంటుంది. ప్రస్తుతం జరుగుతున్న వైవస్వత మన్వంతరం గడిచిన తరువాత రాబోయే సావర్ణి మన్వంతరంలో తిరిగి నీవు ఇంద్రపదవి పొందుతారు.

అప్పటి దాకా నీవు పాతాళానికి వెళ్ళి సుఖంగా, చిరాయువుతో నీ రాజ్యాన్ని పాలించుకో. అక్కడ నీకు సకలభోగాలూ సమకూరుతాయి. అందరూ నిన్ను భక్తితో సేవిస్తారు. దేవ బ్రాహ్మణులకి అపకారం చేయనంతవరకూ నీవు అన్ని భోగాలూ అనుభవించగలవు. అది మరచి నీవు వారిని హింసించాలని చూస్తే వరుణ పాశాలు నిన్ను బంధిస్తాయి" అని హెచ్చరించాడు.

వామనుడి బోధ విన్న బలిచక్రవర్తి ఆనందంగా శిరసువంచి ఆయనకి నమస్కరించి ప్రభూ! మీరు చెప్పినట్టే నేను పాతాళానికి వెళతాను". నాకక్కడ భోగ పదార్థాలు ఎలా లభిస్తాయి?" అని అడిగాడు. అప్పుడు వామనుడు "బలీ! విధి పూర్వకంగా కాకుండా చేసిన దానాలు, అవైదికంగా చేసిన శ్రాద్ధ కర్మలు, శ్రద్ధలేకుండా చేసిన యాగాలు, దక్షిణ ఇవ్వకుండా జరిపిన యజ్ఞాలు, విధి విహితం కాని క్రియలు, బ్రహ్మచర్య దీక్షలేకుండా చేసిన వేదాధ్యయనాలు, ఉదకం లేకుండా చేసిన పూజలు, దర్భలు లేకుండా చేసిన శ్రాద్ధాలు, నేయి ఉపయోగించని హోమాలు ఇవన్నీ నీకు కావలసినన్ని భోగాల్ని ప్రసాదిస్తాయి. నీవిక నిశ్చింతగా వెళ్ళి నీ రాజ్యాన్ని పాలించుకో " అని చెప్పి పంపాడు.

ఆ విధంగా వామనావతారాన్ని ధరించిన శ్రీహరి దేవేంద్రుడికి త్రిలోకాధిపత్యం, దానవేంద్రుడికి పాతాళాధిపత్యం ప్రసాదించి అంతర్ధానమయ్యాడు.

## వామన కథా శ్రవణ ఫలం

ఇత్యేతత్కథితం తస్యవిష్ణోర్మాహాత్మ్య ముత్తమమ్ ।
వామనస్య శృణ్వన్ యస్తు  సర్వపాపైః ప్రముచ్యతే ॥

*(శ్లో॥87,అధ్యా-9)*

వామనరూపాన్ని ధరించిన శ్రీహరి మహాత్మ్యాన్ని విన్నవారికి పాపాలూ తొలగిపోతాయి. బలి ప్రహ్లాదుల సంవాదం బలి శుక్రాచార్యుల సంవాదం, బలి వామనుల సంవాదం లాంటివి చదివిన వారికి, విన్నవారికి ఎలాంటి వ్యాధులు, మనోవ్యాధులు కలుగవు. ఈ కథా శ్రవణం వల్ల ఇష్టజనులతో సమాగమం కలుగుతుంది. బ్రాహ్మణులకి వేద విద్య, క్షత్రియులకి భూవిజయం,

వైశ్యులకి వ్యాపారాభివృద్ధి, శూద్రులకి సుఖప్రాప్తి ఈ చరిత్ర వినటం వల్ల కలుగుతుంది. వామనావతార ఘట్టాన్ని చదివిన వారికి సకల పాపాలూ నశిస్తాయి.

## సరస్వతీనది ఆవిర్భావం - స్తుతి

స్మరించిన వెంటనే సకల పాపాల్నీ పోగొట్టేది సరస్వతీనది. అతి ప్రాచీనమైన ఈ దివ్యనది ప్లక్ష అనగా మేడి చెట్టునుంచి ఆవిర్భవించింది. అలా పుట్టిన సరస్వతి వేలాది పర్వతాల్ని దాటుకుంటూ భూలోకంలో పరమపవిత్రమైన ద్వైతవనానికి చేరుకుంది. ప్లక్షవనంలో వున్నప్పుడు మహాతేజస్విని సరస్వతీ నదిని దర్శించిన మార్కండేయ మహర్షి ఎంతో వైభవంగా ఆమెని కీర్తించాడు.

త్వందేవిః సర్వలోకానాం మాతా దేవారణి శుభా ।
సదసద్దేవిః యత్కించి న్మోక్షదాయ్యర్థవత్ పదమ్ ॥ 1

తత్సర్వం త్వయి సంయోగి యోగివద్ దేవి సంస్థితమ్ ।
అక్షరం పరమం దేవి యత్ర సర్వం ప్రతిష్ఠితమ్ ।
అక్షరం పరమం బ్రహ్మ విశ్వంచైతత్ క్షరాత్మకమ్ ॥ 2

దారుణ్యవస్థితో వహ్ని ర్భూమౌ గంధో యథా ధ్రువమ్ ।
తథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేద మశేషతః ॥ 3

ఓంకారాక్షర సంస్థానం యత్ తద్దేవి స్థిరాస్థిరమ్ ।
తత్ర మాత్రాత్రయం సర్వమస్తి యద్దేవి నాస్తి చ ॥ 4

త్రయోలోకాస్త్రయో వేదా స్త్రైవిద్యం పావక త్రయమ్ ।
త్రీణీజ్యోతీంషి వర్గాశ్చ త్రయో ధర్మాదయ స్తథా ॥ 5

త్రయోగుణాస్త్రయో వర్ణాస్త్రయో దేవా స్తథా క్రమాత్ ।
త్రైధాతవ స్తథాఽవస్థాః పితరశ్చైవ మాదయః ॥ 6

ఏతన్మాత్రా త్రయం దేవి। తవరూపం సరస్వతి ।
విభిన్నదర్శనామాద్యాం బ్రహ్మణో హి సనాతనీమ్ ॥ 7

సోమసంస్థా హవిఃసంస్థా పాకసంస్థా సనాతనీ ।
తాస్త్వదుచ్చారణాద్దేవి క్రియంతే బ్రహ్మవాదిభిః ॥ 8

అనిర్దేశ్యపదంత్వేత దర్దమాత్రాశ్రితం పరమ్ ।
అవికార్య క్షయందివ్యం పరిణామ వివర్జితమ్ ॥ 9

తవైతత్పరమం రూపం యన్నశక్యం మయోదితుమ్ ।
నచాస్యేననవా జిహ్వే తాల్వోష్ఠాదిభి రుచ్యతే ॥ 10

సవిష్ణుః సవృషో బ్రహ్మో చంద్రార్క జ్యోతిరేవ చ ।
విశ్వవాసం విశ్వరూపం విశ్వాత్మన మనీశ్వరమ్ ॥ 11

సాంఖ్య సిద్ధాంత వేదోక్తం బహుశాఖా స్థిరీకృతమ్ ।
అనాదిమధ్య నిధనం సదసచ్చ సదేవతు ॥ 12

ఏకం త్వనేకధాప్యేకభావవదే సమాశ్రితమ్ ।
అనాఖ్యం షడ్గుణాఖ్యం చ బహ్వాఖ్యం త్రిగుణాశ్రయమ్ ॥ 13

నానాశక్తి విభావజ్ఞం నానాశక్తి విభావకమ్ ।
సుఖాత్సుఖం మహత్సౌఖ్యం  రూపం తత్త్వగుణాత్మకమ్ ॥ 14

ఏవం దేవిః త్వయావ్యాప్తం సకలం నిష్కలం చ యత్ ।
అద్వైతావస్థితం బ్రహ్మ యచ్చద్వైతే వ్యవస్థితమ్ ॥ 15

యేఽర్థా నిత్యా యే వినశ్యంతి చాన్యే ।
యేఽర్థాః స్థూలా యే తథా సంతి సూక్ష్మాః ॥ 16

యే వా భూమౌ యేఽంతరిక్షేఽన్యతో ।
వా తేషాం దేవి త్వత్త ఏవోపలబ్ధిః ॥ 17

యద్వా మూర్తం యదమూర్తం సమస్తం ।
యద్వా భూతేష్వేకమేకం చ కించిత్ ॥ 18

యచ్చద్వైతే వ్యస్తభూతం చ లక్ష్యం ।
తత్సంబద్ధం తత్స్వరై ర్వ్యంజనైశ్చ ॥ 19

*(శ్లో॥6-22,అధ్యా-11)*

"అమ్మా! సరస్వతీ నీవు సర్వలోకాలకీ తల్లివి. మంగళమూర్తివైన దేవమాతవి. అనేకంగా, ఒకటిగా కనిపించే, వ్యస్తంగా, సమస్తంగా కనిపించే ఈ సకల జగత్తూ నీవే తల్లీ!" అని స్తుతించగానే సరస్వతీనది ఎంతో సంతోషించి, ఏ వరం కావాలో కోరుకోమని అడిగింది. మార్కండేయుడు ఆమెతో "తల్లీ! నేను వెళ్ళే ప్రదేశాలన్నిటనీ నీవు పావనం చేయి అదే నేను కోరే వరం అన్నాడు. సరే విప్రోత్తమా ముందు నువ్వు బయల్దేరు. నీ వెనకాలే నేను ప్రవహిస్తూ వస్తానంది సరస్వతీనది.

ఆ విధంగా మార్కండేయుడి వెంట ప్రవహిస్తూ వచ్చిన సరస్వతీ నది మొదట బ్రహ్మసరోవరంలో ప్రవేశించి అక్కణ్ణుంచి కురుమహారాజు చేత దున్నబడి కురుక్షేత్రంగా విఖ్యాతి పొందిన ప్రాంతంలో ప్రవహించింది. సరస్వతీనది స్పర్శతో పవిత్రమైన కురుక్షేత్రం పరమపవిత్ర క్షేత్రంగా మారిపోయింది. ఆ ప్రాంతంలో మహర్షులు సేవించిన వెయ్యి తీర్థాలున్నాయి.

## కురుక్షేత్ర మాహాత్మ్యం

అపవిత్రుడైనా పవిత్రుడైనా కురుక్షేత్రాన్ని ఒక్కసారి స్మరిస్తే చాలు. బాహ్యాభ్యంతరశుచి అతడికి కలుగుతుంది. సరస్వతీ – దృషద్వతీ అనే రెండు నదుల మధ్య ఉన్న పవిత్రభూమి కురుక్షేత్రం.

కురుక్షేత్రం గమిష్యామి కురుక్షేత్రే వసామ్యహం ।
ఇత్యేవం వాచముత్సృజ్య సర్వపాపైః ప్రముచ్యతే ।
బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం గోగ్రహే మరణం తథా ।
వాసః పుంసాం కురుక్షేత్రే ముక్తిరుక్తా చతుర్విధా ॥

దూరస్థోఽపి కురుక్షేత్రే గచ్ఛామి చ వసామ్యహమ్ ।
ఏవం యః సతతం బ్రూయా త్సోఽపి పాపైః ప్రముచ్యతే ॥

*(శ్లో॥ 7-8, అధ్యా-12)*

నేను కురుక్షేత్రానికి వెళ్తాను. అక్కడే నివసిస్తాను అని ఒకసారి స్మరిస్తేనే చాలు. పాపాలు క్షయమైపోతాయి. అంతేకాదు బ్రహ్మజ్ఞానం, గయలో శ్రాద్ధం,

గోగ్రహక్షేత్రంలో మరణం, కురుక్షేత్రంలో నివాసం ఈ నాలుగింటివల్లా ముక్తి లభిస్తుందని చెప్పబడింది. ఎంతో దూరంగా ఉన్నప్పటికీ నేను కురుక్షేత్రం వెళ్తానని భావిస్తే చాలు పాపాలు నశిస్తాయి. కురుక్షేత్రానికి వెళ్ళి అక్కడి సరస్వతీ తీరంలో నివసించేవారికి బ్రహ్మజ్ఞానం కలుగుతుంది.

సకల దేవతలు, ఋషులు, సిద్ధులు కురుక్షేత్రాన్ని (కురుజాంగలం) సదా సేవిస్తారు. నిత్యం బ్రహ్మదేవుడి స్థానమైన కురుక్షేత్రాన్ని భజించే మానవులు ఉత్తమలోకాలు పొందుతారు. గ్రహాలకీ, నక్షత్రాలకీ కాలం తీరాక పతనం చెందుతామనే భయం ఉంటుంది. కానీ కురుక్షేత్రంలో మరణించేవారికి అలాంటి భయం ఉండదు. వ్రతనిష్ఠతో కురుక్షేత్ర సరోవరానికి ప్రదక్షిణ చేసి, సరస్వతీ నదిలో స్నానం చేసి అక్కడున్న యక్షుడికి ధూపదీపనైవేద్యాలు సమర్పించి, ఓయక్షేంద్రా!నీ అనుగ్రహంతో నే తలపెట్టిన ఈ కురుక్షేత్ర సందర్శన యాత్ర ఫలవంతమౌగాక! అని ప్రార్థించాలి.అలాచేసిన వారికి యాత్ర నిర్విఘ్నంగా పూర్తవుతుంది.

## నారదుడు చేసిన హరి-హర స్తుతి

కురుక్షేత్ర ప్రాంతంలో ఉన్న బ్రహ్మతీర్థానికి సమీపంలో, సరకక్షేత్రానికి తూర్పుదిశలో ముల్లోకాల్లో ప్రసిద్ధిచెందిన 'అన్యజన్మం' అనే తీర్థం ఉంది. అందులో స్నానం చేస్తే సకల పాపాలూ నశిస్తాయి. పూర్వం నృసింహావతారాన్ని ధరించిన శ్రీహరి హిరణ్యకశిపుణ్ణి వధించిన తరువాత సింహాల మీద మమకారంతో అదే రూపంలో ఇక్కడ ఉండిపోయాడు. అప్పుడు దేవ గంధర్వాదులంతా కలిసి పరమేశ్వరుడి దగ్గరకి వెళ్ళి విష్ణుమూర్తి సింహరూపుడుగానే ఉన్నాడని ఆయన్ని తిరిగి సాధారణ రూపంలోకి తీసుకురమ్మని ప్రార్థించారు. అప్పుడు శివుడు సింహంకన్నా భీకరమైన శరభమనే మృగరూపాన్ని ధరించి నరసింహుడి ముందుకొచ్చాడు. నరసింహుడికి శరభశివుడికి మధ్య వెయ్యి దివ్యవర్షాలు యుద్ధం కొనసాగింది. అలావాళ్ళిద్దరూ పరస్పరం పోరాడి పోరాడి చివరికి అక్కడున్న సరోవరంలో పడిపోయాడు. అదే సమయానికి నారదమహర్షి అక్కడికొచ్చాడు.

సరోవరతీరంలో ఒక చెట్టుకింద కూర్చుని ధ్యానం చేసుకున్నాడు. ఆయనకి శ్రీహరి ఎక్కడున్నాడో కనిపించింది. కళ్ళు తెరిచి చూసేసరికి శ్రీహరి - చతుర్భుజుడుగా, శివుడు లింగాకారుగా కనిపించారు. ఒకేసారి హరిహరులిద్దరూ దర్శనమివ్వటంతో నారదుడి శరీరం పులకించి పోయింది. ఆ ఆనందోద్రేకంలో హరిహరులిద్దర్నీ ఘనంగా ఇలా స్తుతించాడు.

నమఃశివాయ దేవాయ విష్ణవే ప్రభవిష్ణవే ।
హరయే చ ఉమాభర్త్రే స్థితికాలభృతే నమః ॥ 1
హరాయ బహురూపాయ విశ్వరూపాయ విష్ణవే ।
త్ర్యంబకాయ సుసిద్ధాయ కృష్ణాయ జ్ఞానహేతవే ॥ 2
ధన్యోఽహం సుకృతీ నిత్యం యద్దృష్టౌ పురుషోత్తమౌ ।
మమాశ్రమమిదం పుణ్యం యువాభ్యాం విమలీకృతమ్ ।
ఆద్యప్రభృతి త్రైలోక్యే అన్యజన్మేతి విశ్రుతమ్ ॥ 3
యఇహాగత్య స్నాత్వా చ పితౄన్ సంతర్పయిష్యతి ।
తస్య శ్రద్ధాన్వితస్యేహ జ్ఞానమైంద్రం భవిష్యతి ॥ 4
అశ్వత్థస్యతు యన్మూలం సదా తత్ర వసామ్యహమ్ ।
అశ్వత్థవందనం కృత్వా యమంరౌద్రం నపశ్యతి ॥ 5

*(శ్లో॥34-38,అధ్యా-15)*

ఓ శివా! నీకు నమస్కారం. విష్ణుదేవా! నీకు నమస్కారం. హరా! ఉమాపతీ! స్థితిలయభర్తా! నీకు నమస్కారం. ఎన్నో రూపాలు ధరించే హరా! విశ్వరూపుడవైన ఓ విష్ణూ! నీకు నమస్కారం. సిద్ధపురుషుడవైన ఓ త్రినేత్రా! జ్ఞానదాతవైన ఓ శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

ఈనాడు నేనెంతో ధన్యుడనయ్యాను. పరమపురషోత్తములైన మీ ఇద్దర్నీ ఒకే సమయంలో దర్శించగలిగాను. మీ ఇద్దరి వల్లా పవిత్రమైన ఈ ప్రదేశంలో స్నానంచేసి పితృదేవతలకి తర్పణాలు చేసినవాడికి మహేంద్ర జ్ఞానం కలుగుతుంది” అని నారదుడు కీర్తించాడు.

'అన్యజన్మం' అనే ఈ తీర్థాన్ని దర్శించి అక్కడున్న అశ్వత్థ (రావి) వృక్షానికి నమస్కరించినవారు యమలోకానికి వెళ్ళరు. దానికి సమీపంలోనే పౌండరీకం అని మరో తీర్థం ఉంది. దానిలో స్నానం చేసిన వారికి పౌండరీక యాగఫలం లభిస్తుంది.

## వశిష్ఠ విశ్వామిత్రులు - సరస్వతీ నది

విశ్వామిత్రుడు రాజర్షి, వశిష్ఠుడు బ్రహ్మర్షి. వీరిద్దరికీ ఎప్పటి నుంచో వైరం. ముఖ్యంగా వశిష్ఠుడు శాంతంగా ఉన్నా, రజోగుణ ప్రధానుడైన విశ్వామిత్రుడు వీలు దొరికినప్పుడల్లా వశిష్ఠుడితో ఘర్షణ పడుతుండేవాడు. వశిష్ఠుడి ఆశ్రమం సరస్వతీ నదీ తీరంలో ఉంది. అది స్థాణేశ్వరుడు పూర్వం యజ్ఞం చేసిన ప్రాంతం. అక్కడ వశిష్ఠుడు సరస్వతీదేవిని ఒక లింగాకారంగా మలిచి ప్రతిష్ఠించాడు. ఆ సమీపంలోనే ఆయన కఠోరమైన తపస్సు చేయటం ప్రారంభించాడు. ఈ విషయం విశ్వామిత్రుడికి తెలిసింది. ఇదే తగిన సమయం. వశిష్ఠుణ్ణి ఎలాగైనా తుదముట్టించాలనుకున్నాడు. వెంటనే సరస్వతీనదిని పిలిచి వెంటనే వశిష్ఠుణ్ణి నా దగ్గరకి తీసుకురా! అని ఆజ్ఞాపించాడు.

ఉత్తమురాలైన సరస్వతీ నది విశ్వామిత్రుడి ఆజ్ఞ విని ఎంతో బాధపడింది. "మహాతపస్వి అయిన వశిష్ఠుణ్ణి తీసుకెళ్తే విశ్వామిత్రుడాయన్ని వధిస్తాడు. ఇప్పుడెలా! నేనేం చేయాలి. ఆ పని చేయటానికి నా మనసొప్పుకోవటం లేదు. ఇదెంతో పాపకార్యం, ఒకవేళ నేను ఆయన్ని తీసుకురానంటే నన్ను శపిస్తాడు". ఇలా పరిపరి విధాలుగా చింతిస్తూ నెమ్మదిగా వశిష్ఠుణ్ణి సమీపించి ఈ విషయాన్ని నివేదించింది.

సరస్వతీనది ధర్మసంకటాన్ని గమనించిన వశిష్ఠుడు ఆమెని బాధపడవద్దని సముదాయించి, తనని తీసుకెళ్ళమన్నాడు. గుండె దిటవు చేసుకున్న సరస్వతీ నది ఆయన్ని తన ప్రవాహంతో విశ్వామిత్రుడి దగ్గరకి తీసుకెళ్ళటానికి ఉద్యుక్తురాలయ్యింది. సరస్వతీ ప్రవాహంతో పాటు కొట్టుకుపోతున్న వశిష్ఠుడు ఆ నదీమతల్లిని ఇలా కీర్తించాడు.

## వశిష్ఠుడు చేసిన సరస్వతీ స్తుతి

నచ కూలాపహారేణ మిత్రావరుణయోః సుతః ।
ఊహ్యమానశ్చ తుష్టావ తదా దేవీం సరస్వతీమ్ ॥ 1

పితామహస్య సరసః ప్రవృత్తాసి సరస్వతీ ।
వ్యాప్తం త్వయాజగత్సర్వ తవైవాంభోభిరుత్తమైః ॥ 2

త్వమేవాకాశగా దేవీ మేఘే సృజసేపయః ।
సరాప్రస్త్వాపస్త్వమేవేతి త్వత్తోవయ మధీమహే ॥ 3

పుష్టిర్ధృతి స్తథాకీర్తిః సిద్ధిః క్షమాతథా ।
స్వధా స్వాహా తథా వాణీ తవాయత్తమిదం జగత్ ॥ 4

త్వమేవ సర్వభూతేషు వాణీరూపేణ సంస్థితా ।
ఏవం సరస్వతీ తేన స్తుతా భగవతీ తదా ॥ 5

*(శ్లో॥12-16,అధ్యా-19)*

బ్రహ్మ సరోవరం నుంచి ఆవిర్భవించిన పావనీ! ఓ సరస్వతీ! నీ పవిత్రజలాలతో ఈ జగత్తునంతా ముంచెత్తావు. నీవే ఆకాశదేశంలో ప్రవహించి మేఘాలకి నీరు ప్రసాదిస్తున్నావు. ఈ సృష్టిలో ఉన్న జలాలన్నీ నీ స్వరూపమే. పుష్టి, కీర్తి, సిద్ధి, కాంతి, క్షమాగుణం, స్వాహా, స్వధా, వాణి వంటివాటితో కూడిన ఈ ప్రపంచానికి నీవే ఆధారం. అన్ని రకాల జీవరాసుల్లో వాక్ రూపంలో నీవే కొలువై ఉన్నావు. అలాంటి పావన రూపిణివైన నీకు నమస్కారం.

వశిష్ఠుడు చేసిన స్తోత్రానికి వింటూ సరస్వతీ దేవి నెమ్మదిగా ఆయన్ని విశ్వామిత్రుడి దగ్గరకి తీసుకువెళ్ళింది. వశిష్ఠుడు తన కళ్ళెదుటికి రాగానే విశ్వామిత్రుడిలో ఆగ్రహం వెల్లువెత్తింది. ఒక్కసారిగా ఆయుధాన్ని తీసుకొచ్చి వశిష్ఠుణ్ణి చంపబోయాడు. అంతే తనలోనే ఉన్న వశిష్ఠ మహర్షిని హఠాత్తుగా తనలో ముంచేసింది. నీళ్ళలో మునిగిన వశిష్ఠుడు విశ్వామిత్రుడికి కనిపించలేదు. దాంతో సరస్వతీ మీద ఆయనకి కోపం వచ్చింది.

తనని మోసం చేసినందుకు ఆమెనిలా శపించాడు" ఓ సరస్వతీ! నన్నీవిధంగా వంచించినందుకు ప్రతిఫలంగా నేటినుంచీ నీవు నీటికి బదులు రక్తంతో ప్రవహిస్తూ రాక్షసుల చేత సేవించబడుతూ ఉందువుగాక!" అని అన్నాడు. విశ్వామిత్రుడి శాపఫలితంగా సరస్వతీ నది ఆనాటి నుంచి ఒక సంవత్సరం పాటు రక్తంతో ప్రవహిస్తూ కాలం గడిపింది.

పరమపవిత్రమైన సరస్వతీనది అలా రక్తంతో నిండి ప్రవహిస్తుంటే దేవతలంతా చూడలేక ఎంతో దుఃఖించారు. రాక్షసులు, పిశాచాలు, భూతాలు ఆ నదిలో ఉన్న రక్తాన్ని తాగుతూ ఆనందంతో చిందులు వేస్తూ, వికటాట్ట హాసాలు చేస్తూ స్వర్గాన్ని జయించినట్టుగా భావించసాగారు.

కొన్నాళ్ళలా గడిచాక కొందరు సిద్ధులు, మహర్షులు, యాత్రార్థం బయలుదేరి హిమాలయాల నుంచి సరస్వతీ నదీ తీరానికి వచ్చారు. రక్తంతో నిండి రాక్షసుల చేత త్రాగబడుతున్న సరస్వతిని చూసి బాధపడ్డారు. ఆ పుణ్యనదిని ఎలాగైనా రక్షించాలని భావించి సరస్వతీ నదిని పిలిచి ఏం జరిగిందని విచారించారు. ఎంతో బాధతో విశ్వామిత్రుడు తనని శపించిన వృత్తాంతాన్ని సరస్వతి వారికి చెప్పింది. అంతా విన్న మునులు ఆమెని ఓదార్చి వెంటనే సకలపాపాలనీ పోగొట్టే అరుణానదీ పవిత్రజలాలలని తీసుకొచ్చి రక్తంతో నిండిన సరస్వతిలో కలిపారు. ఆ నీటి ప్రభావంతో అప్పటిదాకా రక్తంతో నిండిన సరస్వతీ నది ఆశ్చర్యకరంగా ఒక్కసారిగా మంచినీటితో నిండిపోయింది.

రక్తంతో నిండిన సరస్వతి తిరిగి మంచినీటితో నిండి పోవటాన్ని చూసి, అప్పటిదాకా ఆ రక్తంమీద ఆధారపడ్డ రాక్షసులంతా ఎంతో బాధపడ్డారు. అందుకు కారకులైన మునుల దగ్గరకొచ్చి "మహర్షులారా! మునిపుంగవులారా! మేమింత వరకూ ఈ నదిలోని రక్తం మీదే ఆధారపడ్డాము. మేమంతా శాశ్వతంగా ధర్మదూరులమై ఇలా అధర్మమార్గంలో బ్రతుకుతున్నాం. ఇది మేము కావాలని చేస్తుంది కాదు. మహానుభావులైన మీలాంటి వారి అనుగ్రహం లేకపోవటం వల్లే ఇలా తయారయ్యాం.

బ్రాహ్మణుల్ని అకారణంగా ద్వేషించిన వైశ్య, శూద్ర, క్షత్రియులందరూ బ్రహ్మ రాక్షసులై పుడతారు. పాపిష్ఠి స్త్రీలతో సంగమించటం వల్ల మా జాతి రోజురోజుకీ పెరిగి పోతోంది. దయచేసి మాకీ దుస్థితి నుంచి విముక్తి కలిగించండి. తమ లాంటి తపోధనులు ఏదైనా చేయగల సమర్థులు. ఇప్పటిదాకా మేమెన్నో పాపాలు చేసాం. ఇక మాకు విముక్తి కల్పించండి. మీరే మాకుదిక్కు" అని దీనంగా ప్రార్థించారు.

పరివర్తన చెందిన హృదయాలతో రాక్షసులు ఆ విధంగా ప్రార్థించేసరికి మహర్షుల హృదయాలు కరిగి పోయాయి. వారంతా పరస్పరం తమలో తాము ఆలోచించుకుని రాక్షసుల్ని ఎలాగైనా ఉద్ధరించాలనుకున్నారు. వెంటనే అక్కడికి అరుణానదిని రప్పించి సరస్వతీ నదితో సంగమించేలా చేసారు. దానితో ఆ ప్రాంతంలో పరమపవిత్రమైన అరుణా- సరస్వతీ సంగమతీర్థం ఏర్పడింది.

"జగత్ప్రసిద్ధమైన ఆ దివ్యతీర్థంలో స్నానంచేసి ఉపవాస దీక్షతో అక్కడే మూడు రాత్రులు గడిపిన వారికి సకల పాపాలూ నశిస్తాయి. ఘోరమైన కలియుగంలో పాపాలబారిన పడ్డ మానవులు ఈ సంగమతీర్థంలో స్నానం చేస్తే ముక్తిని పొందవచ్చు" అని ఈ దివ్య తీర్థ మహాత్మ్యాన్ని గురించి లోకానికి తెలియచేసారు ఆ మహర్షులు. మహర్షుల వాక్యాలు విని ఎంతో ఆనందంతో ఆ అరుణ-సరస్వతీ సంగమంలో పవిత్రస్నానాలు ఆచరించిన రాక్షసులు తమ పాపాలు పోగొట్టుకుని దివ్య శరీరాలతో ఉత్తమలోకాల్ని చేరుకున్నారు.

## వేనుడి చరిత్ర

పూర్వం మహాప్రళయం సంభవించినప్పుడు ఈ స్థావర జంగమాత్మకమైన ప్రపంచమంతా నశించిపోయింది. అప్పుడు అనంత సముద్రం మీద శయనించిన శ్రీహరి ఒక్కడే మిగిలాడు. ఆదిపురుషుడైన ఆయన నాభినుంచి ఒక అందమైన కమలం ఆవిర్భవించింది. ఆ కమలం నుంచి సకలలోక పితామహుడైన చతుర్ముఖ బ్రహ్మ జన్మించాడు. ఆ బ్రహ్మ నుంచి మరీచ్యాది మహర్షులు మానసపుత్రులుగా జన్మించగా, మరీచి నుంచి కశ్యపుడు, ఆ కశ్యపుడికి సూర్యుడు పుత్రులుగా

జన్మించారు. ఆ సూర్యుడికి మనువు పుట్టాడు. ఒకనాడా మనువు తుమ్మగా ఆయన ముఖం నుంచి ఒక్క ఉత్తము పురుషుడు ఆవిర్భవించాడు. ఆ పుత్రుడు ఈ భూమండలానికి మహారాజై పరిపాలించాడు. మృత్యు దేవత ముఖం నుంచి కాలుడి కుమార్తెగా జన్మించిన 'భయా' అనే స్త్రీని మనువు కుమారుడు వివాహం చేసుకున్నాడు. కొన్నాళ్ళకి వారిద్దరికీ పరమదుష్టుడు, వేదదూషకుడు అయిన వేనుడు జన్మించాడు. వికృతుడైన వేనుణ్ణి చూడగానే వైరాగ్యం కలిగిన మనువు కుమారుడు, భార్యా పుత్రుల్ని విడిచి అరణ్యానికి వెళ్ళిపోయాడు.

పుట్టటంతోనే దుర్గుణాలతో నిండిపోయిన వేనుడు అధికారంలోకి రాగానే తన రాజ్యంలో "ఎవరూ దానాలు, ధర్మాలు, యజ్ఞయాగాలు చేయరాదు, అగ్ని హోత్రం అస్సలు వెలిగించకూడదు, లోకంలో నెనొక్కడినే పూజించతగిన వాణ్ణి, నన్ను మాత్రమే మీరంతా పూజించాలి. నాకన్నా మించిన దేవుడు మరెవడూ ఈ లోకంలోలేడు" అని చాటింపు వేయించాడు.

వేనుడి ఆజ్ఞ విని అతడి రాజ్యంలో ఉన్న ప్రజలు, మునులు, ఋషులు ఎంతో చింతించారు. వారంతా సామూహికంగా ధైర్యం తెచ్చుకుని వేనుడి దగ్గరకి వెళ్ళి "మహారాజా! వేదాలు ధర్మానికి మూలాలు. అలాంటి వేదాలు యజ్ఞ కర్మల్ని విధిగా చేయమని ఆజ్ఞాపించాయి. అవి చేయకపోతే దేవతలు అనుగ్రహించరు. వారి అనుగ్రహమే లేకపోతే వానలు కురవవు. అవి కురవకపోతే పంటలు పండవు. లోకమంతా ఆహారంలేక అలమటిస్తుంది. కరువుకాటకాలు మనల్ని పట్టిపీడిస్తాయి. కనుక ఈ విషయం తమరు ఆలోచించి తగిన నిర్ణయాన్ని తీసుకోండి" అని వినయంగా చెప్పారు.

ఋషుల మాటలు వినగానే వేనుడికి ఒక్కసారిగా కోపం ముంచుకొచ్చింది. నా మాటే వేదం. నేనేం చెబితే అది మీరు చేయాలి. అంతేకానీ నాకే సలహాలు చెబుతారా! ఎంతధైర్యం? అని గర్జించాడు. దానితో సహజంగా శాంత స్వభావులైన ఆ మునులందరికీ తీవ్రమైన ఆగ్రహం కలిగింది. వెంటనే మరో ఆలోచన లేకుండా అందరూ కలిసి వజ్రాలతో సమానమైన దర్భలతో అతన్ని

పొడిచి చంపారు. వేనుడి మరణంతో అతడి బంధువులంతా విలపించి రాజులేని రాజ్యం అల్లకల్లోలమవుతుంది కదా ఏదో ఒకటి చేసి ఈ సంక్షోభాన్ని గట్టెక్కించండని మునుల్ని కోరారు.

వారి మాట ప్రకారం ఋషులు, మునులు కలిసి వేనుడి ఎడమ చేతిని మర్ధించగా దాన్నుంచి ఒక మరుగుజ్జువాడు పుట్టాడు. ఋషులు అతన్ని ఆ పక్కనే కూర్చోమన్నారు. కొద్దిసేపటికి ఆ మరుగుజ్జు నుంచి వేనుడి పాపఫలంగా నిషాదులనే వారు పుట్టుకొచ్చారు. ఋషులు తిరిగి వేనుడి కుడిచేతిని మర్ధించారు. దాన్నుంచి పెద్ద తాటిచెట్టు పొడవుతో దివ్యలక్షణాలున్న ఒక మహాపురుషుడు ఆవిర్భవించాడు. ఆ మహాపురుషుడి చేతిలో ధనుర్బాణ శంఖచక్రాది రేఖలున్నాయి. అతడి శుభలక్షణాల్ని చూసి ఇంద్రాది దేవతలంతా అతన్ని పాలకుడుగా అభిషేకించారు.

ధర్మాత్ముడైన ఆ మహాపురుషుడు తన పాలనతో అందర్నీ ఆనందపరిచి 'మహారాజు' అనే పదానికి గౌరవం చేకూర్చాడు. ఒకనాడు ఆ మహాపురుషుడు ఇలా ఆలోచించాడు "నాతండ్రి ఎన్నో అధర్మకార్యాలు చేసాడు. వేదాల్ని నిందించాడు, యజ్ఞాన్ని నిరసించాడు. ఎన్ని చేసినా ఆయన నా తండ్రి. అలాంటి తండ్రికి ఉత్తమ గతులు ఎలా కలుగుతాయి? ఏం చేస్తే కలుగుతాయి? ప్రస్తుతం ఆయన ఎక్కడ జన్మించాడు? అని చింతించాడు. అదే సమయంలో త్రిలోక సంచారి నారదుడు అక్కడికి విచ్చేసాడు. రాజు ఆయనకి తగిన స్వాగత సత్కారాలు జరిపి ఉన్నతాసనం మీద కూర్చోబెట్టి "మహర్షీ! తమరు త్రికాలజ్ఞులు. నా తండ్రి వేనుడు దుర్మార్గుడు, అధర్మవర్తనుడు. ఎలాంటి వేదవిహిత కర్మలుచేయకుండానే దుర్మరణం చెందాడు. ప్రస్తుతం ఆయన ఏ జన్మ ఎత్తాడు? ఎక్కడున్నాడు? దయచేసి నాకు చెప్పండి" అని ప్రార్థించాడు.

త్రికాలజ్ఞుడైన నారదమహర్షి! ఒక్క క్షణం కళ్ళు మూసుకుని అంతా గ్రహించి! మహారాజా! నీ తండ్రి తానుచేసిన పాపాల ఫలితంగా క్షయ, కుష్ఠురోగ పీడితుడై మ్లేచ్ఛులలో జన్మించాడు" అని చెప్పాడు. ఆ మాటలు వినగానే మహారాజుకి దుఃఖం వచ్చింది. తన తండ్రిని ఎలాగైనా తరింప చేయాలనుకున్నాడు.

వెంటనే నారదుడి పాదాల మీదపడి "మునీశ్వరా! తమరే కరుణించాలి. నా తండ్రికి ఉత్తమగతులు కలగాలంటే నేనేం చేయాలి? దయచేసి తగిన మార్గాన్ని చూపించండి" అని వేడుకున్నాడు. అప్పుడు నారదుడు "మహారాజా! నీ తండ్రిని తీసుకొచ్చి పవిత్ర తీర్థాల జలాలతో స్నానం చేయించు. ముఖ్యంగా 'సన్నిహిత సరోవరం' దగ్గర్లో పరమపవిత్రమైన స్థాణుతీర్థం ఉంది. దానిలో స్నానం తప్పకుండా చేయించు. నీ కోరిక నెరవేరుతుంది" అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

నారదమహర్షి మాటలు వినగానే మహారాజుకి ఆనందం కలిగింది. తన రాజ్యాన్ని మంత్రులకి అప్పగించి సరాసరి ఉత్తరకురుభూముల్లో మ్లేచ్ఛుడిగా జన్మించి కుష్ఠ క్షయ వ్యాధులతో బాధపడుతున్న తన తండ్రి దగ్గరకెళ్ళాడు. ఆయన్నిలాంటి స్థితిలో చూసేసరికి మహారాజుకి దుఃఖం ముంచుకొచ్చింది. అక్కడున్న మ్లేచ్ఛులతో "అయ్యా! ఈయన పూర్వజన్మలో నా తండ్రి. మీరనుమతిస్తే ఈయన్ని నాతో పాటుతీసుకువెళ్ళి రోగవిముక్తుణ్ణి చేసుకుంటానని చెప్పి ఒక పల్లకీ ఎక్కించి దగ్గర్లో ఉన్న కురుక్షేత్రంలోని స్థాణు తీర్థానికి తీసుకెళ్ళాడు.

అప్పటికి సరిగ్గా మధ్యాహ్న సమయమైంది. మహారాజు వేనుణ్ణి ఆ స్థాణు తీర్థంలో స్నానం చేయించబోయాడు. అదే సమయంలో ఆకాశం నుంచి వాయుదేవుడు అక్కడికొచ్చి, వత్సా! తొందరపడవద్దు. ఈ తీర్థం పవిత్రమైంది. దీన్ని అపవిత్రం చేయకు. ఇతన్ని ఘోరమైన పాతకాలు చుట్టుకున్నాయి. అసలు వేదనింద అనే పాపానికి ప్రాయశ్చిత్తమే లేదు. అలాంటి పాపం చేసిన దుష్టుడు నీ తండ్రి. మరి ఇలాంటి మహాపాపి ఈ పుణ్యతీర్థంలో స్నానం చేస్తే ఈ తీర్థం పవిత్రత నశించిపోదూ! ఆలోచించు. దీనివల్ల మానవులందరికీ ఎంతనష్టం!" అని పలికాడు.

వాయువు వచనాలు వినగానే మహారాజుకి తిరిగి దుఃఖం ముంచుకొచ్చింది. కొద్దిసేపటికి తమాయించుకుని "వాయుదేవుడితో స్వామీ! మరి నా తండ్రి తరించాలంటే ఏం చేయాలి తమరే చెప్పండి. ఆయన్ని తరింపచేయటం నా బాధ్యత" అని వినయంగా అడిగాడు. అప్పుడు వాయువు మహారాజా!

ముందుగా నీ తండ్రిని ఇక్కడున్న ఒక్కొక్క దివ్యతీర్థంలో వరుసగా స్నానం చేయించాలి. ముందుగా ఓజస తీర్థం నుంచి సరస్వతీ నదికి అవతలున్న చులుకతీర్థం దాకా అన్ని తీర్థాల్లో స్నానం చేయించు. అయితే నీ తండ్రిని సరాసరి తీర్థంలోకి తీసుకెళ్ళకు. అలా దిగితే ఇతడు పవిత్రుడు కాలేడు. అతడి బదులు నీవే ఆ తీర్థాలన్నిటిలో మునిగి నీ తండ్రి ఆరోగ్యాన్ని సంకల్పించి ఆ తీర్థజలాల్ని అతడి మీద చల్లితే పవిత్రుడవుతాడు. ఈ విషయం గుర్తుంచుకో" అని చెప్పి వెళ్ళిపోయాడు వాయువు.

వాయుదేవుడు చెప్పిన మాటప్రకారం, రాజు తన తండ్రి (వేనుడికి)కి ఒక కుటీరాన్ని నిర్మించి, అందులో ఆయన్ని ఉంచాడు. తాను స్వయంగా ప్రతిరోజూ అక్కడున్న తీర్థాలలో తండ్రిముక్తిని కోరుతూ స్నానంచేసి, ఆ జలాల్ని తీసుకువచ్చి తండ్రి మీద ప్రోక్షించటం ప్రారంభించాడు. ఇదిలా జరుగుతుండగా ఒకనాడు అక్కడికొక కుక్క వచ్చింది. ఆ శునకం పూర్వజన్మలో స్థాణు తీర్థంలో నిర్మించిన ఆలయానికి ధర్మాధికారిగా ఉండేవాడు. మొదట్లో ఆలయానికి స్వామి వారి సేవలకి సంబంధించిన పనుల్లో ధర్మబద్ధంగానే ఉన్నప్పటికీ, కాలక్రమంలో లోభించి దైవద్రవ్యాన్ని అపహరించటం మొదలుపెట్టాడు. కాలంతీరి ఆ ధర్మాధికారి యమలోకానికి వెళ్ళగా, దైవద్రోహం చేసిన కారణంగా అతన్ని కుక్కగా జన్మించమని భూలోకానికి పంపేశాడు.

అలా భూలోకంలో జన్మించిన కుక్క సౌగంధిక వనంలో సహచరకుక్కలతో కలిసి సంచరించేది. కొన్నాళ్ళకి అక్కడొక ఆడకుక్క ద్వారా అవమానించబడి ఆ వనాన్ని విడిచి పెట్టి సన్నిహిత సరోవర ప్రాంతానికి వచ్చింది. దానికి బాగా దాహం వేయగా సమీపంలో ఉన్న స్థాణేశ్వర తీర్థంలోకి మునిగి దాహాన్ని శరీరతాపాన్ని తీర్చుకుంది. సకల పాపహరమైన ఆ స్థాణు తీర్థంలో స్నానం చేసేసరికి ఆ కుక్క చేసిన పాపాలన్నీ నశించాయి. స్నానంచేసి బేటికి వచ్చిన కుక్కకి ఆకలివేసింది. ఎదురుగా వేనుడు నివసిస్తున్న కుటీరం దానికి కనిపించింది. అందులో ఏదైనా ఆహారం దొరుకుతుందేమో అని లోపలికి ప్రవేశించింది.

వ్యాధిపీడితుడై మంచంమీదున్న వేనుడు కుక్కని చూసి బయపడ్డాడు. సమయానికి తన పుత్రుడు అక్కడలేడు. స్నానం కోసం తీర్థానికి వెళ్ళాడు. కుక్కని అదిలిద్దామంటే ఒంట్లో శక్తిలేదు. ఇప్పుడేం చేయాలి. ఆ కుక్క తనని గాయపరుస్తుందేమో! అని ఆలోచిస్తున్నాడు. అంతలో ఆ కుక్క స్నానం చేసిన తన వంటిని ఒక్కసారి గట్టిగా విదిల్చింది. దాని శరీరం మీదనుంచి ఎగిరిన నీళ్ళు మంచం మీదున్న వేనుడి మీద పడ్డాయి. ఏం జరుగుతుందోనని వేనుడు ఒక్కసారిగా భయపడ్డాడు. నెమ్మదిగా శక్తినంతా కూడదీసుకుని పైకిలేచాడు. కుక్క బారినుంచి ఎలాగైనా తప్పించుకోవాలని బైటికి పరుగెత్తి దగ్గర్లో ఉన్న స్థాణు తీర్థంలోకి కాలిజారి పడిపోయాడు. అంతే కొద్దిక్షణాల్లో పరమపవిత్రం, సకల పాపనాశకరమైన స్థాణు తీర్థ జలాలు అతన్ని తాకాయి. వెంటనే అతడికున్న కుష్ఠ, క్షయ వ్యాధులు సమూలంగా మాయమయ్యాయి. వెంటనే అతడికి దివ్యశరీరం ప్రాప్తించింది. వేనుడు ఆనందోద్రేకంతో తనకి పాపవిముక్తి ప్రసాదించిన స్థాణేశ్వరుణ్ణి మధురమైన వాక్యాలతో మహాదివ్యంగా ఇలా కీర్తించాడు.

## వేనుడు చేసిన స్థాణేశ్వర స్తుతి

ప్రపద్యే దేవమీశానం త్వామజం చంద్రభూషణమ్ ।
మహాదేవం మహాత్మానం విశ్వస్యజగతఃపతిమ్ ॥ 1

నమస్తేదేవదేవేశ సర్వశత్రునిషూదన ।
దేవేశ బలవిష్టంభ దేవదైత్యేశ పూజిత ॥ 2

విరూపాక్షసహస్రాక్ష త్ర్యక్షయక్షేశ్వర ప్రియః ।
సర్వతః పాణిపాదాంత సర్వతోఽ క్షిశిరోముఖ ॥ 3

సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠసి ।
శంకుకర్ణ మహాకర్ణ కుంభకర్ణార్ణవాలయ ॥ 4

గజేంద్రకర్ణ గోకర్ణ పాణికర్ణ నమోఽస్తుతే ।
శతజిహ్వ శతావర్త శతోదర శతానన ॥ 5

గాయంతి త్వాం గాయత్రిణో హ్యర్చయంత్యర్కమర్చిణః ।
బ్రహ్మాణం త్వాం శతక్రతో ఉద్వంశమివ మేనిరే ॥ 6

మూర్త్యాహితే మహామూర్తే సుద్రాంబుధరా స్తథా ।
దేవతాః సర్వఏవాత్ర గోష్ఠేగావ ఇవాసతే ॥ 7

శరీరే తవపశ్యామి సోమమగ్నిం జలేశ్వరమ్ ।
నారాయణం తథా సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిమ్ ॥ 8

భగవాన్ కారణంకార్యం క్రియాకారణమేవతత్ ।
ప్రభవః ప్రలయశ్చైవ సదసచ్చాపిదైవతమ్ ॥ 9

నమోభవాయ శర్వాయ వరదాయోగ్రరూపిణే ।
అంధకాసుర హంత్రే చ పశూనాంపతయే నమః ॥ 10

త్రిజటాయ త్రిశీర్షాయ త్రిశూలాసక్తపాణయే ।
త్ర్యంబకాయ త్రినేత్రాయ త్రిపురఘ్నమోఽ స్తుతే ॥ 11

నమో ముండాయ చండాయ అండాయోత్పత్తిహేతవే ।
డిండిమాసక్త హస్తాయ డిండిముండాయతే నమః ॥ 12

నమోర్ధ్వకేశదంష్ట్రాయ శుష్కాయ వికృతాయ చ ।
ధూమ్రలోహిత కృష్ణాయ నీలగ్రీవాయతే నమః ॥ 13

నమోఽ స్త్వప్రతిరూపాయ విరూపాయ శివాయ చ ।
సూర్యమాలాయ సూర్యాయ స్వరూపధ్వజమాలినే ॥ 14

నమో మానాతిమానాయ నమః పటుతరాయతే ।
నమో గజేంద్రనాథాయ వృషస్కంధాయధన్వినే ॥ 15

సంక్రందనాయ చండాయ పర్ణధారపుటాయచ ।
నమో హిరణ్యపర్ణాయ నమః కనకవర్చసే ॥ 16

నమః స్తుతాయస్తుత్యాయ స్తుతిస్థాయనమోఽ స్తుతే ।
సర్వాయసర్వభక్షాయ సర్వభూతశరీరిణే ॥ 17

నమో హోత్రే చ హంత్రే చ సితోదగ్రపతాకినే ।
నమో నమ్యాయ నమ్రాయ నమః కటకటాయ చ ॥ 18

నమోఽస్తు కృశనాశాయ శయితాయోత్థితాయ చ ।
స్థితా యధావమానాయ ముండాయకుటిలాయ చ ॥ 19

నమో నర్తనశీలాయ లయవాదిత్రశాలినేః ।
నాట్యోపహార లుబ్ధాయముఖవాదిత్రశాలినేః ॥ 20

నమో జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ బలాతిబలఘాతినే ।
కాలనాశాయ కాలాయ సంసారక్షయరూపిణే ॥ 21

హిమవద్దుహితఃకాంత భైరవాయనమోఽస్తుతే ।
ఉగ్రాయ చ నమోనిత్యం నమోఽస్తు దశబాహవే ॥ 22

చితిభస్మప్రియాయైవ కపాలాసక్త పాణయే ।
విభీషణాయ భీష్మాయ భీమవ్రతధరాయ చ ॥ 23

నమోవికృతవక్త్రాయ నమః పూతోగ్రదృష్టయే ।
పక్వామమాంసలుబ్ధాయ తుంబివీణాప్రియాయ చ ॥ 24

నమోవృషాంకవృక్షాయ, గోవృషాభిరుతే నమః ।
కటంకటాయ భీమాయ నమః పరపరాయ చ ॥ 25

నమః సర్వవరిష్ఠాయ వరాయవరదాయినే ।
నమోవిరక్తరక్తాయ భావనాయాక్షమాలినే ॥ 26

విభేదభేదభిన్నాయ ఛాయాయైతాపనాయ చ ।
అఘోర ఘోరరూపాయ ఘోర ఘోరతరాయ చ ॥ 27

నమఃశివాయ శాంతాయ సమశ్శాంతతమాయచ ।
బహునేత్ర కపాలాయ ఏకమూర్తే నమోఽస్తుతే ॥ 28

నమఃక్షుద్రాయ లుబ్ధాయ యజ్ఞభోగప్రియాయ చ ।
పంచాలాయసితాంగాయ నమో యమనియామినే ॥ 29

నమశ్చిత్రోరుఘంటాయ మంటాఘంట నిఘంటినే ।
సహస్రశతఘంటాయ ఘంటామాలావిభూషిణే ॥ 30

ప్రాణసంఘట్ట గర్వాయ సమః కిలికిలి ప్రియే ।
హుం హుంకారాయ పారాయ హుంహుంకార ప్రియాయ చ॥ 31

నమః నమసమేనిత్యం గృహవృక్షనికేతినే ।
గర్జమాంస సృగాలాయ తారకాయ తరాయ చ ॥ 32

తమోయజ్ఞాయయజినే హృతాయ ప్రహృతాయ చ ।
యజ్ఞవాహాయ హవ్యాయ తప్యాయ తపనాయ చ ॥ 33

నమోస్తు పయసే తుభ్యం తుండానాంపతయే నమః ।
అన్నదాయాన్నపతయే నమోనానాన్నభోజినే ॥ 34

నమఃసహస్రశీర్షాయ సహస్రచరణాయ చ ।
సహస్రోద్యతశూలాయ సహస్రాభరణాయ చ ॥ 35

గంగాలులితకేశాయ ముంజకేశాయవై నమః ।
నమః షట్కర్మతుష్టాయ త్రికర్మనిరతాయ చ ॥ 36

నగ్న ప్రాణాయచండాయ కృశాయస్ఫోటనాయ చ ।
ధర్మార్థకామమోక్షాణాం కథ్యాయకథనాయచ ॥ 37

సాంఖ్యాయ సాంఖ్యముఖ్యాయ సాంఖ్యయోగముఖాయ చ ।
నమో విరథరథ్యాయ చతుష్పథరథాయ చ ॥ 38

కృష్ణాజినోత్తరీయాయ వ్యాళయజ్ఞోపవీతినే ।
వక్త్రసంధానకేశాయ హరికేశ నమోஉస్తుతే ।
త్ర్యంబికాంబికనాథాయ వ్యక్తావ్యక్తాయవేధసే ॥ 39

కామకామద కామఘ్న తృప్తాతృప్త విచారిణే ।
నమః సర్వదపాపఘ్న కల్పసంఖ్యావిచారిణే ॥ 40

మహాసత్వ మహాబాహో మహాబలనమోஉస్తుతే ।
మహామేఘ మహాప్రఖ్య మహాకాళ మహాద్యుతే ॥ 41

మేఘావర్తయుగావర్త చంద్రార్కపతయే నమః ।
త్వమన్నమన్న భోక్తా చ పక్వభుక్ పావనోత్తమ ॥ 42

జరాయుజాండజాశ్చైవ స్వేదజోద్భిదజాశ్చతే ।
త్వమేవ దేవదేవేశ భూతగ్రామశ్చతుర్విధః ॥ 43

స్రష్టా చరాచరస్యాస్య పాతాహంతా తథైవ చ ।
త్వామాహుర్బ్రహ్మవిద్వాంసో బ్రహ్మ బ్రహ్మవిదాంగతిమ్ ॥ 44

మనసః పరమజ్యోతి స్త్వంవాయుర్జ్యోతిషామపి ।
హంసవృక్షేమధుకర మాహుస్త్వాం బ్రహ్మవాదినః ॥ 45

యజుర్మయో ఋజ్మయస్త్వా మాహుః సామమయస్తథా ।
పఠ్యసే స్తుతిభిర్నిత్యం వేదోపనిషదాంగణైః ॥ 46

బ్రాహ్మణాః క్షత్రియావైశ్యాః శూద్రావర్ణా వరాశ్చయే ।
త్వమేవ మేఘసంఘాశ్చ విద్యుతోఽశనిగర్జితమ్ ॥ 47

సంవత్సర స్త్వమృతవో మాసోమాసార్ధమేవ చ ।
యుగానిమేషాః కాష్ఠాశ్చ నక్షత్రాణి గ్రహాఃకళాః ॥ 48

వృక్షాణాం కకుభోఽసిత్వం గిరీణాంహిమవాన్గిరిః ।
వ్యాఘ్రో మృగాణాంవతతాం తార్క్ష్యోఽనంతశ్చభోగినామ్ ॥ 49

క్షీరోదోఽ స్యుదధీనాం చ వ్రతానాంసత్యమేవ చ ।
వజ్రం ప్రహరణానాం చ వ్రతానాంసత్యమేవ చ ॥ 50

త్వమేవద్వేషఇచ్ఛా చ రాగోమోహః క్షమాక్షమే ।
వ్యవసాయోధృతిర్లోభః కామక్రోధౌ జయాజయౌ ॥ 51

త్వం శరీత్వం గదీచాపి ఖట్వాంగీ చశరాననీ ।
ఛేత్తాభేత్తా ప్రహర్తాఽ సి మంతా నేతా సనాతనః ॥ 52

దశలక్షణసంయుక్తో ధర్మోఽ ర్థః కామఏవ చ ।
సముద్రాఃసరితోగంగా పర్వతాశ్చసరాంసి చ ॥ 53

లతావల్ల్యస్తృణౌషధ్యః పశవోమృగపక్షిణః ।
ద్రవ్యకర్మగుణారంభః కాలపుష్పఫలప్రదః ॥ 54

ఆదిశ్చాంతశ్చ వేదానాం గాయత్రీప్రణవ స్తథా ।
లోహితో హరితోనీలః కృష్ణఃపీతః సిత స్తథా ॥ 55

కద్రుశ్చ కపిలశ్చైవ కపోతోమేచక స్తథా ।
సవర్ణశ్చాప్యవర్ణశ్చ కర్తాహర్తాత్వమేవ చ ॥ 56

త్వమింద్రశ్చయమశ్చైవ వరుణోధనదోఽ నిలః ।
ఉపప్లవశ్చిత్రభానుః(తథా) స్వర్భానురేవ చ ॥ 57

శిక్షాహౌత్రం త్రిసౌపర్ణం యజుషాం శతరుద్రియం ।
పవిత్రం చ పవిత్రాణాం మంగళానాం చ మంగళమ్ ॥ 58

తిందుకో గిరిజో వృక్షో ముద్గంచాఖిలజీవనమ్ ।
ప్రాణఃసత్త్వంరజశ్చైవ తమశ్చప్రతిపత్పతిః ॥ 59

ప్రాణోఽ పానః సమానశ్చ ఉదానోవ్యానఏవ చ ।
ఉన్మేషశ్చ నిమేషశ్చ క్షుతంజృంభితమేవ చ ॥ 60

లోహితాంతర్గతో దృష్టిః మహావక్త్రో మహోదరః ।
శుచిరోమాహరిశ్మశ్రు రూర్ధ్వకేశశ్చలాచలః ॥ 61

గీతవాద్యనృత్యజ్ఞో గీతవాదిత్రకప్రియః ।
మత్స్యోజాలో జలౌకాశ్చ కాలఃకేళి కళాకలిః ॥ 62

ఆకాలశ్చనికాలశ్చ దుష్కాలః కాలఏవ చ ।
మృత్యుశ్చమృత్యుకర్తా చ యక్షోయక్ష భయంకరః ॥ 63

సంవర్తకోంఽ తకశ్చైవ సంవర్తకవలాహకః ।
ఘంటోఘంటీ మహాఘంటీ చిరీమాలీ చ మాతలిః ॥ 64

బ్రహ్మకాలయమాగ్నీనాం దండీముండీ త్రిముండ ధృక్ ।
చతుర్యుగశ్చతుర్వేద శ్చాతుర్హోత్ర ప్రవర్తకః ॥ 65

చతురాశ్రమ్యనేతా చ చాతుర్వర్ణ్యకర స్తథా ।
నిత్యమక్షప్రియో ధూర్తో గణాధ్యక్షో గణాధిపః ॥ 66

రక్తమాల్యాంబరధరో గిరికో గిరికప్రియః ।
శిల్పం చ శిల్పినాం శ్రేష్ఠః సర్వశిల్పప్రవర్తకః ॥ 67
భగనేత్రాంకుశ శ్చండః పూష్ణో దంతవినాశనః ।
స్వాహా స్వధా వషట్కారో నమస్కారో నమోనమః ॥ 68
గూఢవ్రతోగుహ్యతపా స్తారక స్తారకామయః ।
ధాతా విధాతా సంధాతా పృథివ్యాధరణోఽపరః ॥ 69
భూర్భువఃస్వర్భుతం చైవ ధ్రువో దాంతో మహేశ్వరః ।
దీక్షితోఽదీక్షితఃకాంతో దుర్దాంతో దాంతసంభవః ॥ 70
చంద్రావర్తో యుగావర్తః సంవర్తకప్రవర్తకః ।
బిందుః కామో హ్యణుః స్థూలః కర్ణికార స్రజప్రియః ॥ 71
నందీముఖోభీమముఖః సుముఖో దుర్ముఖ స్తథా ।
హిరణ్యగర్భః శకుని ర్మహోరగపతిర్విరాట్ ॥ 72
అధర్మ హామహాదేవో దండధారో గణోత్కటః ।
గోనర్దో గోప్రతారశ్చ గోవృషేశ్వరవాహనః ॥ 73
త్రైలోక్య గోప్తాగోవిందో గోమార్గోమార్గ ఏవ చ ।
స్థిరః శేష్ఠశ్చస్థాణుశ్చ విక్రోశః క్రోశ ఏవ చ ॥ 74
దుర్వారణో దుర్విషహో దుస్సహో దురతిక్రమః ।
దుర్ధరో దుష్ప్రకాశశ్చ దుర్దర్శో దుర్జయోజయః ॥ 75
శశాంకానలశీతోష్ణః క్షుత్తృష్ణాచచిరామయః ।
అధయోవ్యాధయశ్చైవ వ్యాధిహావ్యాధినాశనః ॥ 76
సమూహశ్చసమూహస్య హంతాదేవఃసనాతనః ।
శిఖండీ పుండరీకాక్షః పుండరీకవనాలయః ॥ 77
త్ర్యంబకోదండధారశ్చ ఉగ్రదంష్ట్రః కులాంతకః ।
విషావహః సురశ్రేష్ఠః సోమపాస్త్వంమరుత్పతే ।
అమృతాశీ జగన్నాథో దేవదేవ గణేశ్వరః ॥ 78

మధుశ్చ్యుతానాం మధుపో(బ్రహ్మ వాక్త్వంఘృతచ్యుతః ।
సర్వలోకస్య భోక్తాత్వం సర్వలోకపితామహః ॥ 79

హిరణ్యరేతాః పురుషస్త్వమేకః త్వంస్త్రీ పుమాంస్త్వం హి నపుంసకం చ ।
బాలోయువా స్థవిరో దేవదంష్ట్రా త్వన్మో గిరిర్విశ్వకృద్ విశ్వహర్తా ॥ 80

త్వంవైధాతావిశ్వకృతాంవరేణ్య స్త్వాంపూజయంతి ప్రణతాఃసదైవ ।
చంద్రాదిత్యౌచక్షుషీ తే భవాన్హి త్వమేవచాగ్నిః ప్రపితామహశ్చ ।
ఆరాధ్యత్వాం సరస్వతీం వాగ్గభంతే అహోరాత్రే నిమిషోన్మేషకర్తా ॥ 81

న బ్రహ్మా న చ గోవిందః పౌరాణాఋషయోనతే ।
మహాత్మ్యం వేదితుం శక్తా యథా తతత్త్వేన శంకర ॥ 82

పుంసాం శతసహస్రాణి యత్ప్రమావృత్యతి ష్ఠతి ।
మహతస్తమసః పారే గోప్తా మంతా భవాన్ సదా ॥ 83

యం వినిద్రాజితశ్వాసాః సత్యస్థాఃసంయతేంద్రియాః ।
జ్యోతిః పశ్యంతియుంజానా స్తస్మైయోగాత్మనే నమః ॥ 84

యామూర్తయశ్చ సూక్ష్మాస్తే నశక్యాయాని దర్శితుమ్ ।
తాభిర్మాం సతతం రక్షపితా పుత్ర మివౌరసమ్ ॥ 85

రక్షమాం రక్షణీయోఽహం తవానఘన మోఽస్తుతే ।
భక్తానుకం పీభగవన్ భక్తశ్చాహం సదాత్వయి ॥ 86

జటినేదండినే నిత్యం లంబోదర శరీరిణే ।
కమండలు నిషంగాయ తస్మై తోయాత్మనే నమః ॥ 87

యస్యకేశేషు జీమూతా నద్యః సర్వాంగ సంధిషు ।
కుక్షౌసముద్రా శ్చత్వార స్తస్మైతోయాత్మనే నమః ॥ 88

సంభక్ష్య సర్వభూతాని యుగాంతే పర్యుపస్థితే ।
యఃశేతే జలమధ్యస్థస్తం ప్రపద్యేఽంబుశాయినమ్ ॥ 89

ప్రవిశ్య వదనం రాహో ర్యః సోమంపిబతే నిశి ।
గ్రసత్యర్కం చస్వ ర్భానూ రక్షిత స్తవతేజసా ॥ 90

యేచాత్రపతితాగర్భా రుద్రగంధస్య రక్షణే ।
నమస్తేఽస్తు స్వధా స్వాహా ప్రాప్నువంతి తదద్భుతే ॥ 91
యేఽంగుష్ఠమాత్రాఃపురుషా దేహస్థాః సర్వదేహినామ్ ।
రక్షంతు తేహిమాం నిత్యం తే మామాప్యాయంతువై ॥ 92
యే నదీషు సముద్రేషు పర్వతేషు గుహాసు చ ।
వృక్షమూలేషు గోష్ఠేషు కాంతార గహనేషు చ ॥ 93
చతుష్పథేషు రథ్యాసు చత్వరేషు సభాసు చ ।
హస్త్యశ్వ రథశాలాసు జీర్ణోద్యానాలయేషు చ ॥ 94
యే చ పంచసుభూతేషు దిశాసు విదిశాసు చ ।
చంద్రార్కయోర్మధ్యగతా యే చ చంద్రార్కర శ్మిషు ॥ 95
రసాతలగతాయే చ యే చ తస్మాత్పరంగతాః ।
నమస్తేభ్యో నమస్తేభ్యో నమస్తేభ్యశ్చ నిత్యశః ॥ 96
యేషాం నవిద్యతేసంఖ్యా ప్రమాణం రూపమేవ చ ।
అసంఖ్యేయ గణారుద్రా నమస్తేభ్యోఽస్తునిత్యశః ॥ 97
ప్రసీద మమభద్రంతే తవభావగతస్య చ ।
త్వయిమే హృదయం దేవ త్వటబుద్ధిర్మతిస్త్వయి ॥ 98
స్తుత్వైవం సమహాదేవం విరరామ ద్విజోత్తమః । 99

*(శ్లో॥63-162,అధ్యా-27)*

ఈ విధంగా మహాభక్తితో, ఆర్తితో, మహాదేవుణ్ణి స్తుతించగానే స్థాణుమూర్తి ప్రత్యక్షమై “వేనుమహారాజా! నేటితో నీ పాపాలన్నీ నశించిపోయాయి. నీవు చేసిన ఈ దివ్యస్తోత్రం లోకంలో స్థాణేశ్వరస్తుతిగా ప్రఖ్యాతి చెందుతుంది. ఈ దివ్యస్తోత్రాన్ని రచించిన ఫలితంగా నీవెప్పుడూ నా సమీపంలోనే ఉంటావు. రాబోయే జన్మలో శివగణాలలో ఒకడిగా మారి ‘భృంగిరీటి’ అనే పేరుతో నాకు ప్రధాన అనుచరుడిగా ఉంటావు” అని ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు.

**ఫలశ్రుతి :** వేనుడు చేసిన ఈ స్థాణేశ్వర స్తుతిని చదివినవారు, విన్నవారు ఎలాంటి అశుభాలు లేకుండా దీర్ఘాయుష్మంతులవుతారు.

వేనప్రోక్తం స్తవమివం కీర్తయేద్యః శృణోతి చ ।
నాశుభం ప్రాప్నుయాత్కించిత్ దీర్ఘమాయురవాప్నుయాత్ ॥
తథా స్తవోపరిష్టోఽయం స్తవానాం వేన నిర్మితః ।
యశోరాజ్యసుఖైశ్వర్య ధనమానాయ కీర్తితః ॥

*(శ్లో॥8-9,అధ్యా-27)*

సకల స్తోత్రాలలో ఈ దివ్య స్తోత్రం వేదపాఠంతో సమానమైనదిగా ఉంటుంది. ఈ స్తోత్ర పఠనం వల్ల కీర్తి, రాజ్యం, ఐశ్వర్యం, గౌరవం అన్నీ లభిస్తాయి. వ్యాధిపీడితులు, శోకబాధితులు ఈ స్తోత్రాన్ని పఠిస్తే ఆయాబాధల నుంచి వేనుడి లాగా విముక్తి పొందుతారు.

వేనుడు శివదర్శనంతో ధర్మాత్ముడిగా మారిపోయాడు. తనకి ముక్తి కలగటానికి కారణమైన కుక్కని కూడా అనుగ్రహించమని శివుణ్ణి కోరాడు. వేనుడి ప్రార్థన విని శంకరుడు ఆ కుక్కకి కూడా ముక్తిని ప్రసాదించాడు.

తీర్థస్నానానికి వెళ్ళిన వేనుడి పుత్రుడు తిరిగి కుటీరానికి వచ్చాడు. అక్కడ తండ్రి కనిపించలేదు.ఎంతో ఆందోళన చెందాడు. అంతలో దివ్యశరీరం ధరించిన వేనుడు అతడికి కనిపించి జరిగిన వృత్తాంతమంతా చెప్పాడు. మహారాజు అది విని తన తండ్రికి ఉత్తమగతులు కలిగినందుకు ఎంతో ఆనందించాడు.

## కేదార తీర్థం

పూర్వం మహేశ్వరుడు ఒకానొక సమయంలో వెయ్యి సంవత్సరాల పాటు తీవ్రమైన మోహంలో ఉండిపోయాడు. ఆ కారణంగా శివుడి వీర్యం క్షీణించి క్రమంగా ఆయన తేజస్సు తగ్గిపోవటం ప్రారంభించింది. అది గ్రహించిన శివుడు తిరిగ తన పూర్వరూపాన్ని తేజస్సుని పొందాలని భావించి తపస్సు చేయాలని నిశ్చయించుకున్నాడు. పార్వతీదేవికి తాను తపోదీక్ష వహిస్తున్న విషయం చెప్పి, ఆమెకి నందిని కాపలాగా ఉంచాడు.

కైలాసం నుంచి శివుడు సరాసరి భూలోకంలోకి వచ్చాడు. మహా ముద్రాకృతిగా తన మెడని స్థిరంగా నిలిపి, మహాసర్పాల కుండలాలని, కంకణాలని, నడుముకి మానవుల ఎముకల వడ్డాణాన్ని ధరించి, కుడిచేత్తో కపాలాన్ని, ఎడమచేత్తో కమండలాన్ని పట్టుకుని ఏ ప్రాంతంలో ఒక్కరోజు కూడా స్థిరంగా ఉండకుండా, చెట్టు, పుట్టలు, కొండలు, కోనలు, అరణ్యాలు సంచరించసాగాడు. ఆ విధంగా కేవలం కందమూలాలు మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ ముల్లోకాల్లో తొమ్మిది వందల సంవత్సరాలు పర్యటించారు.

ఆ విధంగా అన్ని లోకాలూ పర్యటించాక స్థిరంగా కూర్చుని నోట్లో తాంబూలాన్ని ఉంచుకుని ప్రాణ వాయువుని నిరోధించి, పవిత్రమైన ఆ హిమాలయ పర్వతం మీద స్థాణువులా ఉండిపోయాడు శివుడు. ఆ విధంగా పరమేశ్వరుడు యతిగా మారి తీవ్రమైన తపోదీక్షలో మునిగిపోగా, ఒకనాడు ఆయన చేతిలోంచి కపాలం జారి క్రిందకి దొర్లుకుంటూ వచ్చిపడింది. కపాలం ధాటికి ఆ హిమవత్పర్వతం మీదున్న ఒక శిఖరం బ్రద్దలై అక్కడొక సమతలమైన ప్రదేశం ఏర్పడింది. ఆ ప్రదేశంలోనే పవిత్రమైన కేదారతీర్థం ఆవిర్భవించింది.

పరమేశ్వరుడా తీర్థానికి సకలపాపాలు పోగొట్టి పుణ్యఫలాలు ప్రసాదించేలా వరాన్ని అనుగ్రహించాడు. "పవిత్రమైన కేదారతీర్థంలో ఆరునెలలు ఏ మానవుడైతే బ్రహ్మచర్య దీక్షతో కేదారతీర్థంలోని నీళ్ళని త్రాగుతూ దీక్షగా ఉంటాడో వాడి హృదయంలో లింగరూపంలో తాను కొలువుంటా"నని శివుడు స్వయంగా చెప్పాడు. ఈ పవిత్ర తీర్థంలో పితృదేవతలకి శ్రాద్ధం, తర్పణాలు చేస్తే వారికి సంపూర్ణ ఫలం లభిస్తుంది. అలాగే ఈ తీర్థం దగ్గర స్నాన, హోమ, పూజ, జప, తపాలు ఆచరించిన వారికి అక్షయ ఫలాలు లభిస్తాయి. ఈ స్థలంలో మరణించినవారికి పునర్జన్మ ఉండదు.

ఈవిధంగా పరమేశ్వరుడి ద్వారా ఎన్నో వరాల్ని పొందిన ఆ కేదారతీర్థం నాటి నుంచీ నేటి వరకూ ఎందరో మానవుల్ని పవిత్రం చేస్తోంది.

# పున్నామ నరకం

'పుత్' అనే నరకం నుంచి రక్షించేవాడిని పుత్రుడు అంటారు. అసలు పుత్ నరకం అంటే? ఇది పదహారు రకాల నరకాల సముదాయం. పదహారు రకాల నరకాలన్నిటనీ కలిపి అది పున్నామ నరకంగా చెప్పబడుతోంది. ఈ నరకాలన్నీ చాలా విభిన్నంగా వివిధ రకాల పాపాలతో కూడుకుని ఉంటాయి.

**1వ నరకం :** ఇతరుల భార్యల్ని కోరటం, పాపాత్ముల్ని సేవించటం, ఇతర ప్రాణుల్ని హింసించటం.

**2వ నరకం :** పండ్లు దొంగతనం చేయటం, పనీపాటా లేకుండా సోమరిపోతులా తిరగటం, వృక్షాల్ని నరకటం.

**3వ నరకం :** నిషేధించిన వస్తువుల్ని గ్రహించటం,అన్యాయంగా ఇతరుల్ని వధించటం, బంధించటం, ధనంకోసం కలహించటం.

**4వ నరకం :** సకల జీవులకీ భయాన్ని కలిగించటం, అన్ని వస్తువుల్నీ నాశనం చేయటం, తను చేయాల్సిన విధుల్ని నిర్వర్తించకపోవటం

**5వ నరకం :** ఇతర జీవుల్ని చంపటం, మిత్రుల పట్ల కఠినంగా, కుటిలంగా ప్రవర్తించటం, తప్పుడు ప్రమాణాలు చేయటం, ఒంటరిగా భుజించటం

**6వ నరకం :** కుట్రలు చేయటం, ఇతరుల మార్గాల్ని అడ్డుకోవటం, నమ్మకంగా ఉండేవారిని వంచించటం, బండ్లు వాహనాలు అపహరించటం

**7వ నరకం :** రాజుకి చెందాల్సిన భూమిని అపహరించటం, రాజు భార్యతో అక్రమ సంబంధాలు పెట్టుకోవటం, రాజద్రోహం చేయటం

**8వ నరకం :** లోభత్వంతో ప్రవర్తించటం, అత్యాశ ఇతరుల ధనాన్ని నాశనం చేయటం, నోట్లోంచి చొంగకారుతూ వుండగా మాట్లాడటం

**9వ నరకం :** బ్రాహ్మణుల్ని వారి స్వగృహాల నుంచి వెళ్ళగొట్టటం, బ్రహ్మణ ద్రవ్యాన్ని అపహరించటం, విప్రుల్ని నిందించటం, తన బంధువులతోనే విరోధం పెట్టుకోవటం.

**10వ నరకం :** శిష్టాచారాల్ని విడిచిపెట్టటం, శిష్యుల్ని ద్వేషించటం, శిశువుల్ని హత్య చేయటం, శాస్త్ర గ్రంథాల్ని దొంగలించటం, ధర్మాన్ని నశింపచేయటం

**11వ నరకం :** ఆరు ప్రధానాంగాల్ని ఖండించి హత్యచేయటం, రాజు తనకు విహితమైన ఆరు గుణాలు ప్రదర్శించకుండా నిరోధించటం

**12వ నరకం :** సజ్జనులతో శత్రుత్వం పెంచుకోవటం,అనాచారం పాటించటం, చెడ్డపనులు చేయటం, చేయాల్సిన సంస్కారాలు చేయకపోవటం

**13వ నరకం :** పురుషార్ధ (ధర్మార్ధ కామమోక్షాలు) సంపాదనకి అడ్డుపడటం, మంచివాళ్ళలో అభిప్రాయ భేదాలు కల్పించటం

**14వ నరకం :** కృపణత్వాన్ని, ధర్మరాహిత్యాన్ని కలిగి ఉండటం, అలాగే నిషిద్ధంగా చెప్పబడ్డ దహన కాండల్ని నిర్వహించడం

**15వ నరకం :** అజ్ఞానం, అసూయ, అపరిశుభ్రత లాంటి అశుభమైన గుణాలు కలిగి ఉండటం, అసత్యాలు చెప్పటం

**16వ నరకం :** సోమరితనంతో ఉండటం, అతిగా ఇతరుల మీద ఆధారపడి బ్రతకటం, అఘాయిత్యాలు, అత్యాచారాలు చేయటం, పరదారల్ని వాంఛించటం, సత్యం చెప్పటం మీద శ్రద్ధ లేకపోవటం – ఇలాంటివన్నీ నరక కారణాలు.

ఈ పదహారు రకాల నరకాల్లో భాగంగా చెప్పిన వివిధ రకాల పాపాల సమూహాన్నే 'పుత్' అంటారు. ఈ పాపాల నుంచి వాటి ద్వారా లభించే నరకాల నుంచి బైటపడేయటం కోసమే పుత్రుణ్ణి కనాలి.

సజ్జనుడైన పుత్రుడు తండ్రి గతించాక అతడు చేసిన పాపాలన్నిటినీ తొలగించటానికి, శాస్త్రంలో చెప్పిన విధంగా శ్రాద్ధాది కర్మలు, తర్పణాదిక్రియలు, దాన ధర్మాలు వంటివి శ్రద్ధగా నిర్వర్తిస్తాడు. ఇవన్నీ పుత్రుడే చేయాలి కనుక పున్నామ నరకం నుంచి తప్పించేవాడు పుత్రుడని లోకంలో రూఢి ఏర్పడిపోయింది.

# శివుడు బోధించిన హరిహరాద్వైతం

పూర్వం శివుడి పరివారమైన ప్రమథ గణాలు, ఇంకా ఇతర గణాలు, భూలోకంలో ఉన్న పరమ శివభక్తులు కొందరు దేవతలు శివుడే దైవం. శివుడు తప్ప మరొకర్ని దైవంగా ఒప్పుకోము. విష్ణువు దైవమే కాదు, ఆయనకన్న శివుడే గొప్ప. శివుడితో విష్ణువు సాటిరాడు–ఇలా ఇద్దర్లో భేదభావాన్ని చూస్తూ అనంతమైన పాపాల్ని మూటకట్టుకుంటున్నారు. ఈ విషయాన్ని గమనించిన శివుడు ఒకనాడు వారందర్నీ సమావేశ పరిచి హరిహరాద్వైతం గురించి వారికిలా బోధించాడు.

భూతగణాల్లారా! ప్రమథగణాల్లారా! శివభక్తులారా! మీరంతా అచంచలమైన భక్తి భావంతో హరుడనైన నన్ను పూజించి, అహంకారంతో, అజ్ఞానంతో జగన్నాథుడైన శ్రీహరిని నిందిస్తారు. ఇది మీలో ఉన్న అజ్ఞానం వల్ల ఏర్పడ్డ దుర్గుణం. నేనే విష్ణువు. విష్ణువే నేను. అవ్యయుడైన నా స్వరూపమే శ్రీహరి. మా ఇద్దరికీ ఎలాంటి బేధం లేదు. మా ఇద్దరి తత్త్వం ఒక్కటే. రూపాలు మాత్రమే రెండు. ఈ దివ్య రహస్యాన్ని మీరెవరూ తెలుసుకోలేకపోతున్నారు.

శివభక్తులుగా ప్రసిద్ధిచెందిన మీ ప్రవర్తన వల్ల, మీ మూర్ఖత్వం వల్ల నాకు లోకంలో చెడ్డపేరు వస్తోంది. అందుకే మీరంటే నాకు కోపం అని కఠినంగా పలికాడు. అప్పుడు ప్రమథ గణాలు శివభక్తులు పైకి లేచి ప్రభూ! మీరు, జగన్నాథుడైన ఆ శ్రీహరి ఒక్కరే ఎలా అవుతారు? తమరేమో శుద్ధ, శాంత, నిర్మల నిరంజన స్వరూపులైతే ఆ శ్రీహరి కాలాంజన (నల్లని) స్వరూపుడు. ఆయనతో మీరు, మీతో ఆయన కలవటం ఎలా సంభవం? అని అవివేకంగా ప్రశ్నించారు. వారి ప్రశ్నలు విని ఒక్కసారి నవ్వుకుని తిరిగి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

మూర్ఖులారా! మీరు ఉన్నతమైన జ్ఞానాన్ని పొందటానికి అర్హులు కారు. అయినా లోకాపవాదానికి వెరచి మీకు నిజమైన తత్త్వాన్ని చెబుతున్నా. మీ మనసుల్ని ఏకాగ్రం చేసుకుని వినండి.

మీరంతా నాకు చేసే పాలాభిషేకాలు, భక్తితో చేసే చందనలేపనాది అర్చనలు నాకు ఏమాత్రం ఆనందాన్ని కలిగించవు. మీరొక రంపాన్ని తీసుకుని నా శరీరాన్ని రెండుగా చీల్చండి. ఎందుకంటే శివభక్తులందరూ నరకానికి వెళతారు అన్న అపనింద ఈ లోకం నాకు అంటగడుతోంది. తపస్సంపన్నులైన శివభక్తులు కూడా నరకానికి పోతారనే అపవాదు లోకంలో ప్రబలిపోయింది. మీరంతా ఘోరమైన నరకంలో పడకూడదనే మీకీ విషయాలు బోధిస్తున్నా.

శివస్వరూపుడు కమల దళాక్షుడు అయిన ఏ శ్రీహరినైతే మీరు నిందిస్తున్నారో ఆయన మరెవరో కాదు నేనే. మీరు పూజిస్తున్న నేను మరెవరో కాదు ఆ శ్రీహరే. శ్రీహరి లాంటి ప్రభువు చరాచర జగత్తులో మరొకడు లేడు. ఆయన్ని మించిన ధర్మం మరొకటి లేదు. నిజం చెప్పాలంటే నేను కూడా మీరనుకున్న నేను కాదు. నిర్గుణ-సగుణ పరబ్రహ్మ అయిన ఆ సదాశివుడే సాత్త్వి, రాజసిక, తామసిక, గుణాలతో త్రిమూర్తులుగా అనగా బ్రహ్మ-విష్ణు మహేశ్వరుడనైన నేనుగా అవతరించాడు. ఆ మాటలు విని ఆశ్చర్యపోయిన గణాలన్నీ శంకరా! సదాశివుడెవరు ఆయన స్వరూపం ఎలాంటిది? అని ప్రశ్నించారు.

ప్రమథనాథుడైన శివుడు వారందరికీ సదానిరంజనమైన తన నిజ సదాశివ స్వరూపాన్ని చూపించాడు. ఆ దివ్యరూపాన్ని చూసిన ప్రమథగణాలకి మనసు పులకరించింది. వారికి శివుడు సహస్రముఖాలతో దండపాణిగా కనిపించాడు. మరుక్షణంలో ఏకముఖంతో శరీరమంతా వైష్ణవ చిహ్నాలతో దర్శనమిచ్చాడు. అలా కనిపించిన శంకరుడి శరీరంలో సగభాగం శివుడు సగభాగం విష్ణువుగా ఉన్నారు.

శంకరుడు గరుడ ధ్వజం ధరించి వృషభం మీద ఒకసారి, వృషభధ్వజం పట్టుకుని గరుడ వాహనం మీద కూర్చుని మరోసారి కనిపించాడు. త్రినేత్రుడైన శంకరుడు ఆ విధంగా ఎన్నో రూపాల్లో దర్శనమిచ్చి వారందరిలో హరిహర భేద భావం తొలగిపోయేలా చేశాడు.

ప్రమథ గణాలంతా శివుడి పాదాలమీద పడి "ప్రభూ! మమ్మల్ని క్షమించండి. మీ బోధతో మా కళ్ళు తెరుచుకున్నాయి. శివకేశవులిద్దరూ ఒకటేనన్న నిజాన్ని గ్రహించాం. నేటినుంచీ మేము విష్ణువుని, విష్ణు భక్తుల్ని ద్వేషించం" అని విన్నవించారు. వారిలో వచ్చిన పరివర్తన చూసి శంకరుడెంతో ఆనందించాడు.

## సప్త భైరవుల ఆవిర్భావం

పూర్వం అంథకాసురుడికి దేవతలకీ మధ్య దారుణమైన సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో బ్రహ్మవిష్ణు మహేశ్వరులతో పాటు అష్టదిక్పాలకులు, శివుడి సమస్త గణాలు పాల్గొన్నారు. అంథకుడు మహాబల వంతుడు, వర గర్వి. ఆ సంగ్రామంలో ఒకరోజు అంథకుడు శివుడితో తలపడ్డాడు. వారిద్దరి మధ్యా పోరు దారుణంగా కొనసాగింది.

అంథకుడు ఒక పెద్ద గదను తీసుకుని శంకరుడి మీదకి రాగా, శంకరుడు వృషభాన్ని దిగి త్రిశూలాన్ని ధరించి సిద్ధంగా నిలబడ్డాడు. అంథకుడు దాపుకి రాగానే ఒక్కసారిగా భయంకరమైన భైరవ రూపాన్ని ధరించి తన శూలంతో వాడి గుండెల్లోకి బలంగా పొడిచాడు. అయితే అంథకుడు మహాబలవంతుడు కాబట్టి తన గుండెల్లో శూలం దిగినా ఏమాత్రం భయపడకుండా శూలంతో సహా భైరవ రూపంలో ఉన్న శివుణ్ణి ఎత్తుకుని క్రోసెడు దూరం పారిపోయాడు.

శివుడు తమాయించుకుని అంథకుడి పట్టునుంచి తప్పించుకున్నాడు. వెంటనే శూలాన్నెత్తి తిరిగి వాడిని గదతో సహా శూలానికి గుచ్చి లాగాడు. ఆ దెబ్బకి గింగిరాలు తిరిగిన అంథకుడు, వాటం చూసి సరిగ్గా శివుడి తలమీద తన గదతో ఒక్కసారి గట్టిగా మోదాడు. అంతే ఆ దెబ్బకి శంకరుడి తల పగిలింది. పగిలిన ఆ గాయం నుంచి నాలుగు ధారలుగా రక్తం నేలమీదకి కారింది.

శంకరుడి తల నుంచి కారిన రక్తధారల్లో తూర్పుదిశగా కారిన ధారనుంచి పద్మమాలని ధరించి అగ్నితో సమానమైన కాంతులు వెదజల్లుతూ 'విద్యారాజ' అనే భైరవుడావిర్భవించాడు. అలాగే దక్షిణం వైపు నించి కారిన

ధారనుండి నల్లనికాటుక కాంతితో ప్రకాశిస్తూ ప్రేతాల్ని అలంకరించుకున్న 'కాలరాజు' అనే భైరవుడు ఆవిర్భవించాడు. ఇక పశ్చిమదిశ నుంచి ప్రవహించిన రక్త ధారనుండి దిరిసెన పువ్వు కాంతితో ప్రకాశిస్తూ ఆకుల్ని అలరించుకుని 'కామరాజు' అనే భైరవుడు ఆవిర్భవించగా ఇక ఉత్తరదిశ నుంచి కారిన రక్త ధారలోంచి, శూలం, చక్రం మాలను ధరించి 'సోమరాజు' అనే మరో భైరవుడు ఆవిర్భవించాడు.

అలాగే శంకరుడి రక్తసిక్తమైన గాయాలనుంచి ఇంద్రధనుస్సు ప్రకాశిస్తూ శూలాన్ని ధరించి 'స్వచ్ఛంద రాజు' అనే భైరవుడు పుట్టగా తరువాత శంకరుడి గాయాల నుంచి భూమిమీద పడిన రక్తపు చుక్కల ద్వారా సౌధాంజన కాంతితో ప్రకాశించే 'లలితరాజు' అనే భైరవుడు ఆవిర్భవించాడు.

ఈ విధంగా శివుడు మొదట ధరించిన భైరవమూర్తితో కలుపుకుని మొత్తం ఏడుగురు భైరవులు ఆవిర్భవించారు. వీరితోపాటు ఎనిమిదో భైరవుడుగా విఘ్నరాజుని పరిగణిస్తారు. వీరందర్నీ భైరవాష్టకంగా వర్ణిస్తారు.

## అంధకాసుర సంహారం

ఇలా అష్టభైరవులు పరివేష్టించగా శంకరుడు తన శూలంతో అంధకుడి శరీరాన్ని గుచ్చి పైకి లేపి దాన్నొక గొడుగులాగా ధరించాడు. ఆ దెబ్బకి అంధకుడి శరీరం నుంచి రక్తం ధారలుగా కారటం మొదలుపెట్టింది. ఆ ప్రవాహం ఎంతటిదంటే! అంధకారసురుడి రక్తంలో శంకరుడు, సప్త భైరవులు కంఠంలోతు మునిగిపోయారు. ఆ సమయంలో రక్తం వేడికి శంకరుడికి ఒక్కసారిగా అలసట కలిగింది. దానితో ఆయన నుదిటి మీద చమట బిందువులేర్పడ్డాయి. అవినేల మీదకి జారగానే రక్తసిక్తమైన శరీరంతో ఒక బాలిక ఆవిర్భవించింది. అదే సమయంలో ఆయన ముఖం నుంచి కారిన చెమట బిందువుల ద్వారా ఎర్రటి నిప్పుకణాల్లా ప్రకాశిస్తున్న ఒక బాలుడు కూడా ఉద్భవించాడు. పుట్టగానే ఆ బాలుడు నేలమీద ప్రవహిస్తున్న అంధకాసురుడి రక్తాన్ని మొత్తం త్రాగేశాడు. అతడే కుజుడు

**చర్చికా :** శంకరుడి చెమట బిందువునుంచి ఆవిర్భవించిన ఆ బాలిక కూడా బాలుడితో పాటు మిగిలిన రక్తాన్ని మొత్తం అమాంతం నాకేసింది. వారిద్దరూ అలా గొప్పకార్యం చేసినందుకు సంతోషించిన శంకరుడు బాల సూర్యకాంతితో వెలుగొందుతున్న ఆ కన్యని చూసి "కల్యాణీ! ఇకపై నిన్ను దేవ, పితృ, ఋషి, ఉరగ, యక్ష, విద్యాధర, మనుష్యులంతా పూజిస్తారు. ఎప్పుడూ నీకు బలులు, పుష్పాంజలులు సమర్పించి స్తోత్రాలు పఠిస్తారు. రక్తలేపనం కలిగిన శరీరంతో ప్రకాశించే నిన్ను 'చర్చికా' అని అంటారు.

ఈ విధంగా శంకరుడి చేత సంభావించబడ్డ చర్చిక సింహచర్మాన్ని ధరించి, భూతాలకి చెల్లెలై భూమండలమంతా సంచరించి, గొప్పదైన హింగుళా పర్వతం మీద స్థిరనివాసం ఏర్పరుచుకుంది.

**కుజుడు :** అంధకుడి రక్తాన్ని అమాంతం తాగిన వీరుడు శివుడి చెమట ద్వారా భూమినుంచి పుట్టిన కుజుణ్ణి పిలిచి, అతడితో "బాలకా! కుజా! నేటి నుంచి నీకు సకల శుభంకరమైన గ్రహ పదవిని ఇస్తున్నా. నీకు దీనివల్ల జగత్తుమీద ఆధిపత్యం కలుగుతుంది అని ఆశీర్వదించి పంపాడు.

అలా వారిద్దర్నీ వరాలిచ్చిపంపాక భైరవరూపంలో ఉన్న శంకరుడు వేయి సంవత్సరాల పాటు అంధకాసుడి శరీరాన్ని తన మూడో నేత్రంతో శుష్కింప చేసాడు. త్రినేత్రజ్వాలలకి అంధకుడి శరీరంలో ఉన్న మాంసమంతా కలిగిపోయి కేవలం ఎముకలు మాత్రమే మిగిలాయి. ఆ విధంగా పరమేశ్వర నేత్రాగ్ని జ్వాలల్లో తడిసి తన శరీరాన్ని పవిత్రం చేసుకున్నాడు అంధకుడు. ఆ త్రిలోచనాగ్నిలో అతడి పాపాలన్నీ భస్మమైపోయాయి.

జ్ఞానోదయమైన అంధకుడు శివుడితో వైరాన్ని వదిలి, మహాదేవుడి నిజతత్త్వాన్ని, ఆ త్రిశూలి గుణగణాల్ని ఎంతో వైభవంగా ఇలా కీర్తించాడు.

## అంధకుడు చేసిన శివస్తుతి

నమోஉస్తుతే భైరవభీమమూర్తే త్రిలోకగోప్త్రే శితశూలధారిణే ।
వింశార్ధబాహో భుజగేశహారః త్రినేత్ర మాంపాహి విపన్న బుద్ధిమ్ ॥1

జయస్వ సర్వేశ్వర విశ్వమూర్తేః సురాసురై ర్వందిత పాదపీఠ ।
త్రైలోక్య మాతుర్గురవే వృషాంక భీతః శరణ్యం శరణాగతోஉస్మి ॥ 2

త్వాంనాథః దేవాః శివమీరయంతి సిద్ధాహరం స్థాణుం మహర్షయశ్చ ।
భీమం చ యక్షామనుజా మహేశ్వరం భూతాశ్చ భూతాధిప మామనంతి ॥ 3

నిశాచరా ఉగ్రముపార్చయంతి భవేతి పుణ్యాః పితరోనమంతి ।
దాసోஉస్మి తుభ్యం హరః పాహిమహ్యం పాపక్షయం మే కురు లోకనాథః॥ 4

భవాంస్త్రి దేవస్త్రి యుగస్త్రి ధర్మా త్రిపుష్కరశ్చాసి విభోః త్రినేత్ర ।
త్రయ్యారుణిస్త్రి శ్రుతిరవ్యయాత్మన్ పునీహి మాం త్వాం శరణం గతోஉస్మి ॥ 5

త్రిణాచికేత స్త్రిపదప్రతిష్ఠః షడంగ విత్త్వం విషయేష్వలుబ్ధః ।
త్రైలోక్యనాథోஉసి పునీహి శంభోః దాసోஉస్మి భీతః శరణాగతస్తే ॥ 6

కృతం మహత్ శంకరతేஉపరాధం మయా మహాభూతపతే గిరీశః ।
కామారిణా నిర్జితమానసేన ప్రసాదయే త్వాం శిరసా నతోஉస్మి ॥ 7

పాపోஉహం పాపకర్మాஉహం పాపాత్మా పాపసంభవః ।
త్రాహిమాం దేవః ఈశానః సర్వపాపహరోభవః ॥ 8

మామేక్రుధ్యస్వ దేవేశః త్వయాచైతాదృశోஉస్మ్యహమ్ ।
సృష్టః పాపసమాచారో మే ప్రసన్నోభవేశ్వర ॥ 9

త్వం కర్తాచైవ ధాతా చ త్వం జయస్త్వం మహాజయః ।
త్వం మంగళ్యస్త్వమోంకార స్త్వమీశానో ధ్రువోஉవ్యయః ॥ 10

త్వం బ్రహ్మసృష్టి కృన్నాథః త్వం విష్ణుస్త్వం మహేశ్వరః ।
త్వం మింద్ర స్త్వం వషట్కారో ధర్మస్త్వం చ సురోత్తమ ॥ 11

సూక్ష్మస్త్వం వ్యక్తరూపస్త్వం త్వమవ్యక్తస్త్వమీశ్వరః ।
త్వయా సర్వమిదం వ్యాప్తం జగత్ స్థావర జంగమమ్ ॥ 12

త్వమాదిరంతోమధ్యశ్చ త్వమనాదిః సహస్రపాత్ ।
విజయస్త్వం సహస్రాక్షో విరూపాక్షో మహాభుజః ॥ 13

అనంతః సర్వగో వ్యాపీ హంసః ప్రాణాఽధిపోఽచ్యుత ।
గీర్వాణ పతిరవ్యగ్రో రుద్రః పశుపతిః శివః ॥ 14

త్రైవిద్యస్త్వం జితక్రోధో జితారి ర్విజితేంద్రియః ।
జయశ్చ శూలపాణిస్త్వం త్రాహిమాం శరణాగతమ్ ॥ 15

*(శ్లో॥52-66,అధ్యా-44)*

ఎంతో భక్తితో ఆర్తితో తనని రక్షించమని అంధకుడు చేసిన స్తుతికి సంతోషించిన శంకరుడు "అంధకా! నీ భక్తి ప్రపత్తులు నన్నెంతో ఆనందపరిచాయి. నా భార్య అంబికని తప్ప మరేదైనా కోరుకో ప్రసాదిస్తానన్నాడు. ఆ మాట వినగానే పరివర్తన చెందిన అంధకుడు వెంటనే రెండు చెవులూ మూసుకుని తండ్రీ! శంకరా! నా అవివేకాన్ని, అజ్ఞానాన్ని మన్నించు. మోహాంధకారంలో పడి జగన్మాతని కోరుకున్నాను. నాలాంటి పాపి మరొకడుండడు. నన్ను క్షమించు. నేటినుంచి అంబిక నాకు తల్లి. నీవేతండ్రి. ఆ తల్లి దివ్యచరణాల విందాలకి నమస్కరిస్తున్నాను. ప్రభూ! శంకరా! నాలో ఉన్న దుష్టాలోచనలన్నీ నశించి పోయేలా అనుగ్రహించు" అని వేడుకున్నాడు.

ఆ విధంగా సంపూర్ణంగా పరివర్తన చెందిన అంధకుణ్ణి నేలపైకి దించాడు శివుడు. "అంధకా! నేటితో నీవు బుద్ధిమంతుడవయ్యావు. నీలో ఉన్న రాక్షస బుద్ధి నశించింది. నిన్ను నా గణాలకి అధిపతిగా నియమిస్తున్నాను. నీ పేరు భృంగి అని చెప్పి అంధకుడి గాయాలన్నిటినీ మాయంచేసాడు శివుడు.

శివుడి ద్వారా అమోఘమైన వరాన్ని పొంది శాశ్వతంగా ఆయన గణాలకే అధిపతిగా నియమించబడటంతో అంధకుడిలో ఆనందం వెల్లివిరిసింది. వెంటనే జగన్మాత గౌరీదేవి దగ్గరకెళ్ళి భక్తి ప్రపత్తులతో ఆమెకి నమస్కరించి

## అంధకుడు చేసిన అంబికాస్తుతి

ఓం నమస్యే భవానీం భూతభవ్య ప్రియాం లోక ధాత్రీం
స్కందమాతరం మహాదేవ ప్రియాం ధారిణీం

స్యందీనీం చేతనాం త్రైలోక్య మాతరం ధరిత్రీం దేవ
మాతరమథేజ్యాం శ్రుతింస్మృతిం ద దయాంలజ్జాంకాంతి
మగ్ర్యా మసూయాం మతిం సదాపావనీం దైత్య సైన్యక్షయకరీమ్
మహామాయం వైజయంతీం, సుశుభాం, కాలరాత్రిం,
గోవింద భగినీం, శైల రాజ పుత్రీం
సర్వ దేవార్చితాం, సర్వభూతార్చితాం, విద్యాం, సరస్వతీం,
త్రినయన మహీషీం, నమస్యామి మృడానీం, శరణ్యాం,
శరణ ముపగతోఽహం నమో నమస్తే!!

*(శ్లో॥91-94,అధ్యా-44)*

"ఓ భవానీ మాతా! నీకు శతసహస్రప్రణామాలు. స్కందమాతా! మహాదేవ ప్రియపత్నీ! నమస్కారం. అమ్మా! నిన్ను శరణు వేడుకుంటున్నాను. నన్ను రక్షించు. నీకు నమస్కారం. ఈ విధంగా అంథకుడు పాదాలపై పడి స్తుతించగానే అంబిక కరుణించి అతన్ని పైకి లేపింది. నాయనా! నిన్ను క్షమించాను. ఇంకా ఏం కావాలో కోరుకో అంది" అమ్మా! నాకు వేరే ఏ వరం వద్దు. నా పాపాలన్నీ సమూలంగా నశింపచేయి. నిత్యం నీ చరణాబ్జాల మీద భక్తి స్థిరంగా ఉండేలా అనుగ్రహించు"అని కోరాడు. దేవి తథాస్తు అని దీవించింది. అంథకుడు ఆనందంగా భృంగిగా మారి శివగణాలకి నాయకుడయ్యాడు.

## సుధర్ముడి కథ

పూర్వం త్రేతాయుగం ఆరంభంలో ఈ కథ జరిగింది. ఆ కాలంలో 'మద్ర' దేశంలో 'శాకల' అనే ప్రసిద్ధ నగరం ఉండేది. ఆ నగరంలో ధనవంతుడు, గుణవంతుడు, మహాభోగి, బహుశాస్త్రకోవిదుడు అయిన 'సుధర్ముడు' అనే వర్తకుడుండేవాడు, ఒకనాడా సుధర్ముడు వ్యాపారం నిమిత్తం ఎంతో విలువైన సరుకుల్ని తీసుకుని తన నగరం వదిలి 'సురాష్ట్రం' అనే దేశానికి ప్రయాణమయ్యాడు. సుధర్ముడు అలా ప్రయాణిస్తుండగా దారిలో దొంగలు అడ్డగించి అతడి దగ్గరున్న వస్తువులన్నీ అపహరించారు. అన్నాళ్ళు కష్టపడి సంపాదించిందంతా కోల్పోయి నందుకు సుధర్ముడు ఎంతో దుఃఖించాడు.

అసహాయుడైన ఆ ఎడారి ప్రాంతంలో పిచ్చి వాడిలా తిరగసాగాడు. అలా తిరుగుతూ తిరిగుతూ ఒక అడవికి చేరి అక్కడున్న జమ్మిచెట్టు దగ్గర కూలబడ్డాడు. ఆ ప్రాంత మంతా నిర్మానుష్యంగా ఉంది. చుట్టు పక్కల పక్షులు, మృగాలు సైతం ఏవీ కనపడటం లేదు.

నీరసంతో కూలబడ్డ సుధర్ముడు ఆ చెట్టు క్రిందే గాఢంగా నిద్రపోయాడు. అలా మధ్యాహ్నం దాకా పడుకున్నాక బడలిక తీరి నెమ్మదిగా నిద్ర లేచాడు. ఎదురుగా వందలాది ప్రేతాలతో కలిసిన ఒక ప్రేతం కనిపించింది. సుధర్ముడికి ఆశ్చర్యం, భయం రెండూ కలిగాయి. అంతలో పిండాల్ని ఆరగించే ప్రేతాలు మరికొన్ని ఎండిన శరీరంతో అసంఖ్యాకంగా వచ్చి ఆ ప్రేత నాయకుడి చుట్టూ చేరాయి. ఆ ప్రేతాల నాయకుడు తననే ఆశ్చర్యంగా, భయంగా చూస్తున్న సుధర్ముడికి స్వాగత పూర్వకంగా నమస్కరించాడు. కొద్ది సేపట్లోనే భయాన్ని పోగొట్టుకున్న సుధర్ముడు ప్రేతనాయకుడితో స్నేహం చేసాడు.

ప్రేత నాయకుడు ప్రీతిపూర్వకంగా సుధర్ముడితో "సౌమ్యుడా! నీవెవరు? ఈ అరణ్యానికి ఒంటరిగా ఎలా వచ్చావు? నీకేదైనా కష్టం కలిగిందా చెప్పు? అని ప్రశ్నించాడు. అప్పుడు సుధర్ముడు తాను తన నగరం నుంచి బయలుదేరటం దారిలో ఎడారి ప్రాంతానికి రాగానే దొంగలు తన సర్వసంపదనీ దోచుకోవటం, తానిలా దిక్కుతోచక జమ్మిచెట్టు నీడలోకి చేరటం వివరంగా చెప్పాడు. అంతా విన్న ప్రేతాధిపతి సుధర్ముణ్ణి బాధపడవద్దని ఓదార్చాడు.

"మిత్రమా! కాలం కలిసిరాకపోతే ఇలాగే జరుగుతుంది. కాలం కలిసివస్తే తిరిగి నీ ధనం నీకు లభిస్తుంది. అందుకోసం విచారించకు. నీ శరీరాన్ని ఇలా శుష్కింపచేసుకోకు. ముందు నీవు దిగులుపడటం మానేయ్" అని ధైర్యం చెప్పి తన సేవకులందరితో "సహచర ప్రేతాల్లారా! ఇతడు నా మిత్రుడు. సుధర్ముడు ఇక పై మీ అందరికీ మిత్రుడు" అని పరిచయం చేసాడు. అంతలో ఎక్కడి నుంచో ఒక మట్టికుండ పెరుగన్నంతో నిండి అక్కడికి వచ్చింది. మరో గట్టికుండ నీళ్ళతో నిండి అక్కడ ప్రత్యక్షమైంది. వాటిలోని భోజనాన్ని, నీళ్ళని చూసి ప్రేతాధిపతి సుధర్ముడితో "మిత్రమా! లే లేచి ఆహ్నికాలు

తీర్చుకో, ముందు ఆహారం స్వీకరించు అన్నాడు. సుధర్ముడు లేచి స్నానాదికాలు ముగించాక స్వయంగా అతడికి పెరుగన్నం తినిపించి, మంచినీళ్ళు ఇచ్చాడు. ఆ తరువాత మిగిలిన ప్రేతాలందరూ పెరుగన్నాన్ని, మంచినీళ్ళని ఆనందంగా స్వీకరించారు.

అలా వారంతా భుజించటం పూర్తికాగానే ఆశ్చర్యంగా అక్కడున్న మట్టికుండలు రెండూ అదృశ్యమైపోయాయి. అది చూసి ఆశ్చర్యపోయిన సుధర్ముడు ప్రేతనాయకుడితో "మిత్రమా! ఈ నిర్జనారణ్యంలో అమృతం లాంటి అన్నాన్ని, చల్లటి మంచినీళ్ళని ఎవరు పంపించారు? ఉన్నట్టుండి ఇక్కడెలా ప్రత్యక్షమయ్యాయి. అసలు నీ భృత్యులంతా ఎవరు? నీకన్నా బక్కచిక్కి ఇలా శిధిలంగా ఉన్నారేంటి? నీవేమో తేజస్సుతో మంచి పుష్టిగా కనపడుతున్నావు. తెల్లటి వస్త్రాలు ధరించి ఈ ప్రేత గణాలన్నిటినీ పోషిస్తున్న అసలు నీవెవరు? ఈ శమీ (జమ్మి)వృక్షం ఒక్కటే ఇక్కడెందుకుంది? దయచేసి నాకు చెప్పు" అని కుతూహలంగా ప్రశ్నించాడు. సుధర్ముడి మాటలు విన్న ప్రేతనాయకుడు తన పూర్వగాథనంతా ఇలా వివరంగా చెప్పటం ప్రారంభించాడు.

మిత్రమా! సుధర్మా! పూర్వం శాకల నగరంలో నేను 'సోమశర్మ' అనే పేరుతో సుప్రసిద్ధుడనైన విప్రుడిగా జన్మించాను. నా తల్లిపేరు బహుళాదేవి. మా ఇంటి పక్కనే మహాధనవంతుడైన 'సోమశ్రవుడు' అనే వైశ్య ప్రముఖుడుండేవాడు. అతడు పరమ భాగవతోత్తముడు. శ్రీహరి భక్తుడు. నేను పరమమూర్ఖుడిగా ఉండేవాణ్ణి. నా దగ్గర కావలిసినంత ధనం ఉన్నప్పటికీ ఎవరైనా బీద బ్రాహ్మణులు వచ్చి యాచిస్తే వారికి ఒక్కపైసా కూడా విదిల్చేవాడిని కాను. లోభంతో కనీసం కడుపునిండా భోజనం కూడా చేసేవాడిని కాను. ఆ విధంగా పిసినారిగా, నికృష్టమైన జీవితాన్ని గడుపుతూ ఉండేవాడిని. ఆహారంగా తరవాణి, నువ్వుల చెక్క, పేలపిండి, ఆకుకూరలు, పాడైన పోయిన అన్నం–వీటినే వారం రోజుల పాటు దాచుకుతినేవాణ్ణి. ఈ విధంగా చాలాకాలం గడిచిపోయింది.

కాలక్రమంలో బాధ్రపదమాసంలో ద్వాదశీ పర్వదినం రాగా, మా నగరంలో ఉన్న బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు పర్వస్నానం చేసేందుకు దగ్గర్లోనే ఉన్న 'ఐరావతి – నడ్వా నదుల సంగమ ప్రాంతానికి వెళ్ళారు. నేను కూడా మా ఇంటి పక్కనున్న వైశ్యమిత్రుడితో కలిసి సంగమ స్నానానికి వెళ్ళాను. చక్కగా సంగమంలో స్నానం చేసి పవిత్రంగా ఆ రోజు ఉపవాసం చేసాను. ఆ సందర్భంగా అక్కడ స్నానానికి వచ్చిన ఒక విప్రోత్తముణ్ణి పిలిచి కొత్త నీళ్ళకుండని, ఒక గొడుగుని, పాదరక్షల్ని దానం చేసాను. అలాగే మరోకుండలో తియ్యటి పెరుగన్నాన్ని నింపి దాన్ని కూడా ఆ విప్రుడికే అందించాను. నా జీవిత కాలంలో నేను చేసిన దానం అదొక్కటే. అప్పటికి నా వయసు 70 సంవత్సరాలు.

ఆయువు ముగిసి నేను మరణించి ప్రేతాన్నైనాను. ఇప్పుడు ఆనాడు దానం చేసిన అన్నాన్నే తింటున్నాను. నేనానాడు విప్రుడికి దానమిచ్చిన జలకుంభం, పెరుగన్నం కుంభం ప్రతిరోజూ మధ్యాహ్నంవేళ ఇక్కడ ప్రత్యక్షమవుతాయి. మేమంతా భోజనం చేసేవరకూ అవి అక్షయంగా ఉంటాయి. భోజనం కాగానే తిరిగి అదృశ్యమవుతాయి. నేను పూర్వం విప్రుడికి దానం చేసిన గొడుగే ఈ జమ్మిచెట్టుగా మారి ఈ నాడు మా అందిరకీ నీడినిస్తోంది.

ధర్మాజ్ఞా! నాలో ఉన్న లోభగుణాన్ని ద్వాదశీ వ్రత దాన ఫలాన్ని నీకు చెప్పాను. ఈ వృత్తాంతం ఎంతో పుణ్యప్రదమైంది" అని చెప్పాడు. అంతా ఆనందంగా విన్న సుధర్ముడు ప్రేతరాజుతో "మిత్రమా! నీ చరిత్ర ఎంతో గొప్పగా ఉంది. దయచేసి ఇప్పుడు నేనేం చేయాలి?నా భవిష్యత్తు ఏమిటి?చెప్పు"అని కోరాడు.

ప్రేతరాజు సుధర్ముడితో "మిత్రమా! నీకూ నాకూ శుభప్రదమైన విషయాన్ని చెబుతున్నా విను. నీవు వెంటనే ఎన్నో తీర్థాలతో నిండిన పవిత్ర గయా తీర్థానికి వెళ్ళు. అక్కడ శుచిగా స్నానం చేసి నా పేరు చెప్పి పిండ ప్రదానం చేయి. నీవలా చేస్తే నాకు ప్రేత శరీరం నుంచి విముక్తి కలుగుతుంది. నా లాగానే నా చుట్టూ ఉన్న ప్రేతాలకి కూడా పిండప్రదానం చేసి వారికీ విముక్తి కలిగించు. తరువాత నేను ఆచరించిన విధంగానే భాద్రపద శ్రవణా నక్షత్రయుక్త ద్వాదశీ వ్రతాన్ని ఆచరించు. దానివల్ల నీకు సకల సంపదలూ

కలుగుతాయి" అని చెప్పి సుధర్ముణ్ణి తన భుజాల మీద ఎక్కించుకుని అడవిని దాటించి అందమైన శూరసేన రాజ్యానికి చేరాడు.

సుధర్ముడు శూరసేన రాజ్యంలోకి ప్రవేశించి, నెమ్మదిగా చిన్న చిన్న వ్యాపారాలు చేసి క్రమంగా పెద్ద వర్తకుడిగా మారాడు. ప్రేతరాజుకిచ్చిన మాట ప్రకారం గయాక్షేత్రానికి వెళ్ళి అతడు కోరినట్టుగానే ప్రేతరాజుకి, అతడి పరివారానికి శాస్త్రోక్తంగా అక్కడ పిండప్రదానాలు చేసాడు. తరువాత వారితో పాటే తమ పితరులకి, బంధువులకీ కూడా పిండ ప్రదానాలు చేసి నువ్వులు లేకుండా తనకు కూడా పిండ ప్రదానం చేసుకున్నాడు. సుధర్ముడు ఆ విధంగా పిండ ప్రదానాలు చేసిన వెంటనే ప్రేతరాజు అతడి పరివారం తమ ప్రేత శరీరాల్ని వదిలిపెట్టి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయారు.

సుధర్ముడు గయనుంచి తన నగరానికి తిరిగి వచ్చి భాద్రపదమాసంలో శ్రవణా ద్వాదశీవ్రతాన్ని శ్రద్ధగా ఆచరించాడు. కాలగతిలో ఆయువు తీరగా, సుధర్ముడు శరీరం వదిలి గంధర్వలోకాన్ని చేరాడు. అక్కడ హాయిగా సుఖభోగాలను అనుభవించి తిరిగి శాకల నగరంలో ఉత్తమ జన్మని పొందాడు. ఆ రెండో జన్మలో కూడా ధర్మాన్ని సత్యాన్ని అనుష్ఠించి, శ్రవణ ద్వాదశీ వ్రతాన్ని నియమపూర్వకంగా జీవితాంతం ఆచరించి దేహత్యాగం చేసాక యక్షలోకాన్ని చేరాడు. ఆ లోకంలో కూడా ఎన్నోభోగాలనుభవించి తిరిగి భూలోకంలో ఒక మహారాజుకి కుమారుడుగా జన్మించాడు. ఆ విధంగా మరికొన్ని జన్మలు ఎత్తిన తరువాత, ప్రతి జన్మలో శ్రవణ ద్వాదశీ వ్రతాన్ని ఆచరించిన ఫలితంగా ఆ సుధర్ముడు మన్మథరూపంతో సుప్రసిద్ధుడైన పురూరవ మహారాజుగా జన్మించాడు. ఇదీ భాద్రపద శ్రవణ ద్వాదశీ వ్రతాన్ని అనుష్ఠిస్తే వచ్చే ఫలం.

## నక్షత్ర పురుష వ్రతం

నక్షత్ర స్వరూపుడైన శ్రీమన్నారాయణుణ్ణి ఆరాధించే అరుదైన వ్రతం ఈ నక్షత్ర పురుష వ్రతం. పూర్వం ఈ వ్రతాన్ని పురూరవ చక్రవర్తి ఆచరించి శ్రీహరి దివ్యానుగ్రహాన్ని పొందాడు.

జగద్రక్షకుడైన శ్రీహరి శరీరం నక్షత్ర స్వరూపం. ఆ మహాపురుషుడి పాదాలతో మూలానక్షత్రం ఉంటుంది. అలాగే ఆయన జంఘలలో రోహిణీ నక్షత్రం ఉంటుంది. అలాగే శ్రీహరి మోకాళ్ళలో అశ్వినీ నక్షత్రం, తొడలలో ఉత్తర పూర్వాషాఢా నక్షత్రాలు, గుహ్యాంగాలలో పూర్వఉత్తర ఫల్గుణీ నక్షత్రాలు, నడుము భాగంలో కృత్తికలు, వాసుదేవుడి ఇరుపార్శ్వాలలో పూర్వాభాద్రా ఉత్తరాభాద్రా నక్షత్రాలు, ఆయన ఉదరంలో రేవతీ నక్షత్ర నివసిస్తుంటాయి.

శ్రీహరి వక్షఃస్థలంలో అనూరాధా, వీపుభాగంలో ధనిష్ఠా, ఆయన భుజాలలో విశాఖా, రెండు చేతుల్లో హస్తానక్షత్రం, వేళ్ళలో పునర్వసు, గోళ్ళలో ఆశ్లేషా కొలువుంటాయి. అదేవిధంగా స్వామి మెడలో జ్యేష్ఠా నక్షత్రం రెండు చెవుల్లో శ్రవణా నక్షత్రం నోటిలో పుష్యమి, పలువరుసలో స్వాతీ, దవడల్లో శతభిషా, మఖానక్షత్రాలు నాసిక మీద, కళ్ళలో మృగశిరా, లలాటం మీద చిత్రా, తలమీద భరణీ నక్షత్రం ఆశ్రయించి ఉంటాయి. తలపైన కేశాల రూపంలో ఆర్ద్రా నక్షత్రం కొలువై వుంటుంది. ఇదే శ్రీమన్నారాయణుడి నక్షత్ర పురుష రూపం.

**నక్షత్ర పురుష వ్రత విధానం :** నక్షత్ర రూపంలో నిలిచిన శ్రీమన్నారాయణ మూర్తిని నియమబద్ధంగా ఆరాధిస్తే కోరిన కోర్కెలన్నీ తీరుతాయి.

♠ చైత్రశుద్ధ అష్టమినాడు చంద్రుడు మూలా నక్షత్రంతో కలిసి ఉన్నప్పుడు శ్రీహరి పాదారవిందాలని విధివిధానంగా షోడశాపచారాలతో అర్చించాలి. ఆ రోజు రాత్రి నక్షత్ర దర్శనం కాగానే విప్రులకి భోజనం పెట్టి, దక్షిణ తాంబూలాలు సమర్పించాలి.

♠ అశ్వినీ నక్షత్రంలో చంద్రుడున్నప్పుడు భక్తితో శ్రీహరి రెండు మోకాళ్ళనీ పూజించి హవిష్యాన్నాన్ని నైవేద్యంగా సమర్పించి, విప్రుడికి యథావిధిగా భోజన తాంబూల దక్షిణల్ని ఇవ్వాలి.

♠ పూర్వ-ఉత్తరాషాఢ నక్షత్రాలలో చంద్రుడున్నప్పుడు శ్రీహరి రెండు తొడలనీ భక్తితో పూజించి చల్లని జలాన్ని స్వామికి నైవేద్యంగా సమర్పించాలి. తరువాత యథావిధిగా విప్రుడికి భోజన దక్షిణ తాంబూలాలని అందించాలి.

- ఉత్తర-పూర్వఫల్గుణీ నక్షత్రాల నాడు శ్రీహరి గుహ్యాంగాన్ని అర్చించి ఆవుపాలని నైవేద్యంగా సమర్పించాలి. తరువాత యథావిధిగా బ్రాహ్మణ భోజనం తాంబూలం దక్షిణలు ఆచరించాలి.
- చంద్రుడు కృత్తికా నక్షత్రయోగంలో ఉన్నప్పుడు ఉపవాసం ఉండి స్వామివారి కటిభాగాన్ని పూజించి బెల్లం ఉండలు నైవేద్యంగా సమర్పించాలి.
- రేవతీ చంద్రయోగంలో ఉదరాన్ని పూజించి పెసల లడ్డూల్ని నైవేద్యంగా సమర్పించాలి.
- అనూరాధా నక్షత్ర -చంద్రయోగం ఉన్నరోజు స్వామి జఠరాన్ని పూజించి బియ్యంతో చేసిన పేలాల్ని నైవేద్యం పెట్టాలి.
- ధనిష్ఠా నక్షత్రం నాడు శ్రీహరి వీపుభాగాన్ని అర్చించి శాలిబియ్యంతో వండిన అన్నాన్ని నైవేద్యం పెట్టాలి.
- విశాఖా నక్షత్రం చంద్రయోగం ఉన్నరోజు పరమాన్నం నైవేద్యంగా సమర్పించి శ్రీహరి రెండు భుజాల్నీ పూజించాలి.
- హస్తా నక్షత్ర యోగంలో స్వామివారి రెండు చేతులూ పూజించి యవలతో చేసిన అన్నాన్ని నివేదించాలి.
- పునర్వసు యోగం ఉన్ననాడు శ్రీహరి వేళ్ళని అర్చించి దోసపండ్లని నైవేద్యంగా పెట్టాలి.
- ఆశ్లేషా చంద్రయోగం రోజు స్వామివారి గోళ్ళని పూజించాలి. నైవేద్యంగా తిత్తిరి మాంసాన్ని సమర్పించాలి.
- జ్యేష్ఠా చంద్రయోగంలో నువ్వుల లడ్డూని నైవేద్యంగా సమర్పించి, స్వామి వారి మెడని భక్తితో అర్చించాలి.
- శ్రవణా- చంద్రయోగంలో శ్రీహరి చెవుల్ని పూజించి పెరుగన్నాన్ని నైవేద్యం పెట్టాలి.
- పుష్యమీ నక్షత్రయోగంలో స్వామి ముఖారవిందాన్ని శ్రద్ధగా పూజించి నేతితో చేసిన పాయసాన్ని నైవేద్యం పెట్టాలి.

♠ స్వాతీ నక్షత్ర యుక్త చంద్రయోగంలో శ్రీహరి దంతాల వరసని పూజించి, నువ్వులతో చేసిన వడల్ని నివేదించాలి.

♠ శతభిషా నక్షత్రయోగంలో లక్ష్మీవల్లభుడి దవడల్ని అర్చించి, ఎర్రటి బియ్యంతో చేసిన గుడాన్నాన్ని నైవేద్యం పెట్టాలి.

♠ మృగశీర్షా నక్షత్ర యోగంలో మధుసూదనుడి నేత్రాల్ని పూజించి, లేడి మాంసాన్ని నైవేద్యం పెట్టాలి.

♠ చిత్తానక్షత్రయుక్త చంద్రయోగంలో మురారి లలాటాన్ని శ్రద్ధగా అర్చించి మృష్టాన్న భోజనాన్ని నివేదించాలి.

♠ భరణీ చంద్రయోగంలో శ్రీమన్నారాయణుడి శిరస్సుని పూజించి రుచికరమైన శుద్ధాన్నాన్ని నివేదనగా సమర్పించాలి.

♠ ఆర్ద్రా చంద్రయోగంలో శ్రీనివాసుడి కేశాల్ని అర్చించి, అల్లం బెల్లంతో చేసిన కుడుముల్ని నైవేద్యంగా సమర్పించాలి.

ఈ విధంగా 27 నక్షత్రాల యోగంలో నక్షత్ర స్వరూపుడైన శ్రీహరి శరీరాంగాల్ని అర్చించి ఆయా పదార్థాలని నివేదించి అనంతరం నారాయణ స్వరూపుడిగా ఒక విప్రుడికి భోజన, వస్త్ర దక్షిణ తాంబూలాల్ని యథాశక్తి సమర్పించాలి. దీనితోపాటు ఛత్రం, పాదరక్షలు, సప్తవిధ ధాన్యాలు, బంగారం, వెండి, నేయి నింపిన పాత్ర, వ్రత ఉద్యాపన సమయంలో దానం చేయాలి. ఈ నక్షత్ర వ్రతంలో జనార్ధనుడి పూజ ఎంత ముఖ్యమో విప్రపూజ కూడా అంతే ముఖ్యం.

**వ్రతఫలం :** అన్ని రకాల వ్రతాలకన్నా ఈ నక్షత్రపురుష వ్రతం ఎంతో గొప్పది, విశేషమైనది. పూర్వం ఈ దివ్య వ్రతాన్ని పురూరవుడే కాక భృగుమహర్షి కూడా ఆచరించాడు. జనార్ధనుడి శరీరాంగాలని ఇలా నక్షత్ర భావంతో అర్చించేవాడు ఏడు జన్మల్లో చేసిన పాపాలన్నిటి నుంచీ విముక్తిని పొందుతాడు. సకల శుభాలు, ఆయురారోగ్యాలు, సంపదలు, కీర్తి ప్రతిష్ఠలు ఈ వ్రతాన్ని ఆచరించిన వారికి సమృద్ధిగా లభిస్తాయి.

మహాపతివ్రత అరుంధతీ దేవి ఉపవాస దీక్షతో ఈ నక్షత్ర పురుష వ్రతాన్ని ఆచరించి లోకాలన్నిటి చేత పూజించబడే యోగ్యతని పొందింది. నక్షత్ర వ్రతాన్ని ఆచరించిన సూర్యుడు సాక్షాత్తు ఆ శ్రీహరి అంశతో రేవంతుడనే కుమారుణ్ణి పొందాడు. ఈ దివ్య వ్రతాన్ని ఆచరించటం వల్లనే రంభ రూప సౌందర్యాన్ని, మేనక అందమైన వాక్కుని, చంద్రుడు చల్లని వెలుగుని, పురూరవుడు గొప్ప రాజ్యాన్ని పొందారు. (మహిమాన్వితమైన ఈ రెండు వ్రతాలనీ పులస్త్యుడు నారదుడికి బోధించాడు) (ఈ వ్రతంలో శ్రీహరికి నైవేద్యంగా రెండు చోట్ల మాంసాహారాలు పెట్టాలని చెప్పబడ్డాయి. ఇవి ఆనాటి ఆచారాలు. ప్రస్తుత కాలాన్ని అనుసరించి వాటి స్థానంలో మినుములతో చేసిన గారెలు, వడలు లాంటివి నివేదించవచ్చు)

## జలోద్భవుడి వృత్తాంతం

ఒకప్పుడు జలోద్భవుడనే రాక్షసుడుండేవాడు. ఎంతో కాలం కఠోరమైన తపస్సుచేసి బ్రహ్మదేవుణ్ణి ఉపాసించాడు. అందుకాయన సంతోషించి, దేవతల చేత దానవుల చేతా చంపబడకుండా వుండేలా, స్వంత ఆయుధాలచేతా ఇతరుల ఆయుధాలచేతా, వధించబడకుండా వుండేలా, బ్రహ్మర్షుల శాపాలు తగలకుండా ఇలా అసాధ్యమైన వరాల్ని జలోద్భవుడికి ప్రసాదించాడు. బ్రహ్మద్వారా వరాల్ని పొందిన జలోద్భవుడు ఆనాటి నుంచి వర గర్వంతో సకలలోకాల్నీ పీడించటం ప్రారంభించాడు. భూలోకానికి వచ్చి యజ్ఞ యాగాలు చేసుకుంటున్న మహర్షుల్ని, రాజుల్ని, విప్రుల్ని ఎన్నో బాధలకి గురిచేసాడు. యజ్ఞయాగాది ధర్మకార్యాల్ని ధ్వంసం చేసాడు. వాడి బాధలు పడలేక అందరూ శ్రీహరి దగ్గరకెళ్ళి ఆయనతో మొరపెట్టుకున్నారు.

శ్రీహరి అది తన పనికాదని చెప్పి వారందర్నీ వెంట బెట్టుకుని సరాసరి కైలాసానికి వెళ్ళాడు. అక్కడికి చేరాక హరి హరులిద్దరూ ఏకాంతంగా చర్చలు జరిపి ఎలాగైనా దేవతలకి మేలు చేయాలని భావించి, అందుకు మార్గం జలోద్భవుణ్ణి సంహరించటమే అని ఒక నిశ్చయానికి వచ్చారు. ఆ సందర్భంగా వాళ్ళిద్దరూ తమ తమ ఆయుధాల్ని మార్చుకున్నారు. శ్రీహరి సుదర్శనాన్ని

శంకరుడు ధరిస్తే, శంకరుడి త్రిశూలాన్ని శ్రీహరి ధరించాడు. ఎందుకంటే జలోద్భవుడికి పూర్వం బ్రహ్మదేవుడు ఎవరి స్వంత ఆయుధాల వల్ల మరణం సంభవించదు" అనే వరాన్నిచ్చాడు. కనుక అలా వారిద్దరూ ఆయుధాలు మార్చుకుని జలోద్భవుడి కోసం వెతకసాగారు.

హరిహరులిద్దరూ భయంకర రూపాలు ధరించి, తనని చంపటం కోసం వస్తున్నారన్న విషయం జలోద్భవుడికి తెలిసింది. వారిద్దర్నీ జయించటం సాధ్యంకాదని గ్రహించిన జలోద్భవుడు విశాల నదీజలాల్లోకి వెళ్ళి కూర్చున్నాడు. హరిహరులిద్దరికీ ఆ విషయం తెలిసింది. కొంతసేపటికి నీళ్ళలోంచి బైటికి వచ్చిన జలోద్భవుడు అటూ ఇటూ బిత్తర చూపులు చూస్తూ నెమ్మదిగా బైటికి వచ్చి సమీపంలో ఉన్న ఒక పర్వతం మీదకి ఎక్కాడు. అలా ఆ అసురుడు కొండ శిఖరం మీదకి చేరగానే హరిహరులిద్దరూ అక్కడ ప్రత్యక్షమై ఆయుధాలతో వాడి శరీరాన్ని దారుణంగా ఖండించారు. శంకరుడి చేతిలో ఉన్న చక్రాయుధం, శ్రీహరి చేతిలో ఉన్న శూలాయుధం దెబ్బలకి జలోద్భవుడి శరీరం ఛిన్నాభిన్నమై నేలకొరిగి పోయింది.

ఆ విధంగా జలోద్భవుడి సంహారం కోసం హరిహరులిద్దరూ తమ తమ ఆయుధాలు మార్చుకోవాల్సి వచ్చింది. ఈ మహత్తర ఘట్టం వితస్తానదీ పరిసరాల్లో జరిగింది.

## బ్రహ్మచారి - బ్రహ్మరాక్షసుడు

ఒకప్పుడు భూలోకంలో బ్రాహ్మణుల్ని హింసిస్తూ, అందర్నీ పీడిస్తూ నీచుడిగా ప్రజలందరి చేతా ఛీత్కారాలకి గురైన ఒక క్షత్రియుడుండేవాడు. ఆ రాజు తను జీవించినంతకాలం అధర్మ కార్యాలే ఆచరించాడు. కాలం తీరి శరీరం పతనమయ్యాక పూర్వజన్మలో చేసిన కర్మదోషం వల్ల రాక్షసుడిగా జన్మించాడు. ఈ జన్మలో కూడా ఆ రాజుకి జ్ఞానోదయం కలగలేదు. అరణ్యాల్లో తిరుగుతూ దొరికిన జీవిని దొరికినట్టు ఏమాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా చంపి తినేవాడు.

ఆ విధంగా నరమాంస భక్షకుడుగా సంచరిస్తున్న ఆ పాపాత్ముడు, ఒకనాడు నదీతీరంలో తపస్సు చేసుకుంటున్న మునీశ్వరుడి దగ్గరకి వచ్చాడు.

ఆకలితో ఉన్నాడేమో! ఆ మునిని భక్షించాలని ప్రయత్నించాడు. అయితే ఆ యోగి సామాన్యుడు కాదు. మహామహిమాన్వితమైన విష్ణు పంజర స్తోత్రాన్ని త్రికరణ శుద్ధిగా నిత్యం ధ్యానం చేసేవాడు. ఆ దివ్యస్తోత్ర ప్రభావంతో రాక్షసుడు ఆయన్ని ఏమీ చేయలేకపోయాడు. ఎలాగైనా ఆ మునిని భక్షించాలన్న అతడి ప్రయత్నం ఫలించలేదు. నాలుగు నెలలు అలాగే వేచి చూసాడు. అప్పటికే వృద్ధుడైన అతడి శరీరం క్షీణించింది. శక్తిలేక అక్కడే కూలబడిపోయాడు.

ధ్యానం నుంచి లేచిన మునీశ్వరుడు ఎదురుగా వున్న అసురుణ్ణి చూసాడు. ఆయనకి జాలేసింది. అసురుడు ఓపిక తెచ్చుకుని దీనంగా "మహాత్మా! నేనెన్నో పాపాలు చేసాను. ఎంతోమందిని చంపి తిన్నాను. నా పాపాలు తొలగిపోయే మార్గాన్ని చెప్పండి" అని దీనంగా ప్రార్థించాడు. ఓయీ రాక్షసా! నేను నరమాంసభక్షకులకి ఉపదేశం చేయను. ఎవరైనా విప్రుల్ని అడిగి ఆ మార్గం తెలుసుకో! ముందు నువ్వు నరుల్ని భక్షించటం మానేయి" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆనాటి నుంచీ నరుల్ని చంపితినటం మానేసి కేవలం వన్యమృగాల్ని మాత్రమే భక్షిస్తూ, తన పాపం ఎలా తొలగిపోతుందా అని చింతిస్తూ, కాలం గడపసాగాడు రాక్షసుడు. ఒకనాడు ఆకలితో నకనకలాడుతూ అడవిలో తిరుగుతున్న రాక్షసుడికి పళ్ళు కోసుకోవటానికొచ్చిన ఓ బ్రహ్మచారి కనిపించాడు. తన పూర్వనియమాన్ని వదిలి బ్రహ్మచారిని తినాలని పట్టుకున్నాడు.

తనని చంపాలని ప్రయత్నించిన రాక్షసుడి చేతిలో ఎలాగైనా చావు తప్పదని గ్రహించిన బ్రహ్మచారి అతడితో "రాక్షసా! నన్నెందుకు పట్టుకున్నావో చెప్పు. నన్ను వదలాలంటే నేనేం చేయాలో చెప్పు" అని అడిగాడు. అందుకా అసురుడు బ్రహ్మచారీ! నేను నీచుణ్ణి నరమాంస భక్షకుణ్ణి. గత వారం రోజులుగా నాకు ఆహారం దొరకలేదు. దొరక్క దొరక్క నువ్వు దొరికావు. నిన్ను వదిలిపెడితే నా ఆకలి ఎలా తీరుతుంది? నేను జాలి దయ ఏమాత్రం లేని కిరాతకుణ్ణి. నిన్ను చంపక తప్పదు" అన్నాడు.

అప్పుడు బ్రహ్మచారి రాక్షసా! నేను మా గురువు గారి కోసం ఫలాలు తేవటానికి వచ్చాను. నీకు ఆహారమవటానికి నాకేం అభ్యంతరం లేదు, కొద్దిసేపు గడువిస్తే ఈ ఫలాల్ని మా గురువుగారికిచ్చి తిరిగివస్తానన్నాడు బ్రహ్మచారి.

"నేను నిన్ను వదిలితే నీవు తిరిగి రాకపోతే నా గతేంకాను. నిన్ను వదలను. అయితే ఒక పనిచేస్తే నిన్ను పూర్తిగా విడిచిపెడతా నేనింతవరకూ ఎన్నో ఘోరాలూ పాపాలూ చేసాను. వాటినుంచి విముక్తి పొందే మార్గాన్ని చెప్పు అప్పుడు నిన్ను తినకుండా వదిలేస్తా. నాకు ఎంత ఆకలిగా ఉన్నా ఓర్చుకుంటా" అని అన్నాడు రాక్షసుడు.

బ్రహ్మచారికి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. ఎంతో ఆలోచించాడు. ఏమీ స్ఫురించలేదు. ఇక చేసేదేంలేక తను నిత్యం ఉపాసించే అగ్నిదేవుణ్ణి ప్రార్థించాడు. సకల నిష్ఠాగరిష్ఠుడైన బ్రహ్మచారి తనని స్మరించగానే అగ్నిదేవుడు స్పందించాడు. సరస్వతీ దేవిని సాయం చేయమని అర్థించాడు. అగ్ని కోరిక మేరకు సరస్వతీ దేవి బ్రహ్మచారికి మాత్రమే కనిపించి బాలకా! భయపడకు నేను నీ నాలుక మీద నిలిచి ఒక దివ్య స్తోత్రాన్ని నీతో పలికిస్తాను. దాన్ని నీవు ఆ రాక్షసుడికి వినిపించు. అది విని నిన్నతడు విడిచి పెడతాడు" అని చెప్పింది.

బ్రహ్మచారికి ఎంతో ఆనందం కలిగింది. చెప్పినట్టే సరస్వతీ దేవి అతడి నాలుక మీద నిలిచింది. వెంటనే బ్రహ్మచారి "అసురా! ఇదిగో చెబుతున్నా విను. నీ లాంటి అధములు, పాపాత్ములు, నరమాంస భక్షకులు తాము చేసిన పాపాల నుంచి విముక్తి పొందాలంటే నేను చెప్పే ఈ దివ్య స్తోత్రాన్ని త్రికాలాల్లో పఠించాలి. అలాచేస్తే శాంతి, తుష్టి, పుష్టి చేకూరుతాయి అని ఇలా విష్ణు సారస్వత స్తోత్రాన్ని అతడికి చెప్పాడు.

## విష్ణు సారస్వత స్తోత్రం

ఓం హరిం కృష్ణం హృషీకేశం వాసుదేవం జనార్దనమ్ ।
ప్రణతోకస్మి జగన్నాథం స మే పాపం వ్యపోహతు ॥ 1

చరా చర గురుం నాథం గోవిందం శేషశాయినమ్ ।
ప్రణతోస్మి పరం దేవం సమే పాపం వ్యపోహతు ॥ 2

శంఖినం చక్రిణం శార్జ్గధారిణం స్రగ్ధరం పరమ్ ।
ప్రణతోస్మి పతిం లక్ష్మ్యాః సమే పాపం వ్యపోహతు ॥ 3

దామోదరం ముదారాక్షం పుండరీకాక్ష మచల్యతమే ।
ప్రణతోఽస్మి స్తుతం స్తుత్యైః స మే పాపం వ్యపోహతు ॥ 4
నారాయణం నరం శౌరిం మాధవం మధుసూదనమ్ ।
ప్రణతోస్మి ధరాధారం సమే పాపం వ్యపోహతు ॥ 5
కేశవం చంద్రసూర్యాక్షం కంసకేశి నిషూదనమ్ ।
ప్రణతోస్మి మహాబాహుం సమే పాపం వ్యపోహతు ॥ 6
శ్రీ వత్స వక్షసం శ్రీశం శ్రీధరం శ్రీనికేతనమ్ ।
ప్రణతోస్మి శ్రియః కాంతం సమే పాపం వ్యపోహతు ॥ 7
యమీశం సర్వభూతానాం ధ్యాయంతి యతమోక్షరమ్ ।
వాసుదేవ మనిర్దేశ్యం తమస్మి శరణం గతః ॥ 8
సమస్తాలంబనేభ్యోయం వ్యావృత్య మనసో గతిమ్ ।
ధ్యాయంతి వాసుదేవాఖ్యం తమస్మి శరణం గతః ॥ 9
సర్వగం సర్వభూతం చ సర్వస్యాధార మీశ్వరమ్ ।
వాసుదేవం పరంబ్రహ్మ తమస్మి శరణం గతః ॥ 10
పరమాత్మాన మవ్యక్తం యం ప్రయాంతి సుమేధసః ।
కర్మక్షయే క్షయం దేవం తమస్మి శరణం గతః ॥ 11
పుణ్యపాప వినిర్ముక్తా యం ప్రవిశ్యపునర్భవమ్ ।
న యోగినః ప్రాప్నువంతి తమస్మి శరణం గతః ॥ 12
బ్రహ్మ భూత్వా జగత్సర్వ సదేవాసుర మానుషమ్ ।
యః సృఝత్యచ్యుతో దేవ స్తమస్మి శరణం గతః ॥ 13
బ్రహ్మత్వేయస్య వక్త్రేభ్య శ్చతుర్వేదమయం వపుః ।
ప్రభుః పురాతనోజజ్ఞే తమస్మి శరణం గతః ॥ 14
బ్రహ్మరూప ధరం దేవం జగద్యోనిం జనార్ధనమ్ ।
స్రష్టృత్వే సంస్థితం సృష్టౌ ప్రణతోస్మి సనాతనమ్ ॥ 15
స్రష్టా భూత్వా స్థితో యోగీ స్థితా వసు రసూదనః ।
తమాది పురుషం విష్ణుం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 16

యజ్ఞై ర్యజంతీ యం విప్రా యజ్ఞేశం యజ్ఞ భావనమ్ ।
తం విష్ణు పురుషం విష్ణుం ప్రణతోస్మి సనాతనమ్ ॥ 17
ధృతా మహీ హృతా దైత్యాః పరిత్రాతా స్తథా సురాః ।
యేన తం విష్ణు మాఽద్యే శం ప్రణతోస్మి జనార్ధనమ్ ॥ 18

*(శ్లో॥66-83,అధ్యా-59)*

**ఫలశ్రుతి :** ఈ దివ్యస్తోత్రాన్ని ఒకసారి జపించినవాడికి పది సంవత్సరాల పాటు ప్రతిరోజూ పదహారు కుండలతో నువ్వుల్ని దానం చేసిన ఫలితం లభిస్తుంది. బ్రహ్మచర్య దీక్షతో ఒక సంవత్సరం ఈ స్తోత్రాన్ని జపిస్తే విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది.

ఈ విధంగా బ్రహ్మచారి సరస్వతీ దేవి స్వయంగా పలికించిన దివ్య స్తోత్రాన్ని బోధించగానే రాక్షసుడు ఎంతో సంతోషించి అతన్ని వదిలిపెట్టాడు. బ్రహ్మచారి కూడా ఎంతో ఆనందించి సన్మార్గంలో నడవమని ఆ అసురుడికి ప్రబోధించి తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## సర్వపాప ప్రశమన స్తోత్రం

పూర్వం అగస్త్యమహర్షి ఈ దివ్య స్తోత్రాన్ని పులస్త్యుడికి ప్రబోధించగా తిరిగి దీన్ని పులస్త్యుడు నారదమహర్షికి చెప్పాడు. మానవులు చేసే అన్ని రకాల పాపాల్నీ నశింపచేసేది ఈ దివ్యస్తోత్రం. ఇది శివకేశవ అభేదాత్మకతని ప్రబోధించే దివ్యస్తుతి. దీన్ని శ్రద్ధా భక్తులతో పఠించిన వారికి హరిహరుల అనుగ్రహం లభిస్తుంది.

నమస్యే శశినం సూర్యం ధ్రువం రౌద్రం మహౌజసమ్ ।
పద్మనాభం హిరణ్యాక్షం నమస్యే స్కంద మవ్యయమ్ ॥ 1
నమస్యే భీమ హంసౌ చ నమస్యే హాటకేశ్వరమ్ ।
సదా హంసం నమస్యే చ నమస్యే ప్రాణ తర్పణమ్ ॥ 2
సమస్యే రుక్మ కవచం మహాయోగిన మీశ్వరమ్ ।
సమస్యే శ్రీనివాసం చ నమస్యే పురుషోత్తమ్ ॥ 3

నమస్యే చ చతుర్బాహుం నమస్యే వసుధాధిపమ్ ।
వనస్పతిం పశుపతిం నమస్యే ప్రభు మవ్యయమ్ ॥ 4
శ్రీకంఠం వాసుదేవం చ నీల కంఠం స దండినమ్ ।
నమస్యే సర్వ మనఘం గౌరీశం నకులీశ్వరమ్ ॥ 5
మనోహరం కృష్ణకేశం నమస్యే చక్ర పాణినమ్ ।
యశోధరం మహాబాహుం నమస్యే చ కుశప్రియమ్ ॥ 6
భూధరం ఛాదితగదం సునేత్రం శూలశంఖినమ్ ।
భద్రాక్షం వీరభద్రం చ నమస్యే శంకుకర్ణికమ్ ॥ 7
వృషధ్వజం మహేశం చ విశ్వామిత్రం శశిప్రభమ్ ।
ఉపేంద్రం చైవ గోవిందం నమస్యే పంకజప్రియమ్ ॥ 8
సహస్రశిరసం దేవం నమస్యే కుంద మాలినమ్ ।
కాలాగ్నిం రుద్ర దేవేశం నమస్యే కృత్తివాససమ్ ॥ 9
నమస్యే భాగలేశం చ నమస్యే పంకజాసనమ్ ।
సహస్రాక్షం కోకనదం నమస్యే హరిశంకరమ్ ॥ 10
అగస్త్యం గరుడం విష్ణుం కపిలం బ్రహ్మవాఙ్మయమ్ ।
సనాతనం చ బ్రహ్మాణం నమస్తే బ్రహ్మతత్పరమ్ ॥ 11
అప్రతర్క్యం చతుర్బాహుం సహస్రాంశుం తపోమయమ్ ।
నమస్యే ధర్మరాజానం దేవం గరుడ వాహనమ్ ॥ 12
సర్వభూతగతం శాంతం నిర్మలం సర్వలక్షణమ్ ।
మహాయోగిన మవ్యక్తం నమస్యే పాప నాశనమ్ ॥ 13
నిరంజనం నిరాకారం నిర్గుణం నిర్మలం పదమ్ ।
నమస్యే పాప హంతారం శరణ్యం శరణం వ్రజే ॥ 14
ఏతత్పవిత్రం పరమం పురాణం ప్రోక్తం త్వగస్త్యేన మహర్షిణా చ ।
ధన్యం యశస్యం బహు పాప నాశనం సంకీర్తనా త్స్మరణా త్సంశ్రవాచ్ఛ ॥ 15

*(శ్లో॥15-29,అధ్యా-61)*

బహు పురాతనమైన ఈ దివ్యస్తోత్రాన్ని పఠించినా, విన్నా, బోధించినా అనేక జన్మల పాపాలు నశిస్తాయి.

# భూలోకంలో భగవంతుడి స్థానాలు

వామనుడిగా దేవమాత అదితి గర్భాన జన్మించాడు శ్రీహరి. వటువుగా ఉద్భవించిన ఆయనకి బృహస్పతి గోత్రుడు, మహాతేజస్వి అయిన భరద్వాజమహర్షి జాతకర్మ సంస్కారాలు జరిపాడు. తరువాత శాస్త్రోక్తంగా వామనుడికి ఉపనయన కాండ కూడా పూర్తిచేసి బ్రహ్మచర్య దీక్షనిచ్చాడు. ఆ సందర్భంగా భరద్వాజుడు "స్వామీ! ఇప్పుడు భూలోకంలో నీ తేజో అంశలతో ఏఏ స్థానాల్లో ఏఏ రూపాల్లో కొలువున్నావో దయచేసి నాకు చెప్పు" అని కోరాడు. భరధ్వాజుడి కోరిక విని వామనుడు ఈ విధంగా తాను నెలకొన్న దివ్యప్రదేశాల గురించి చెప్పటం ప్రారంభించాడు.

మహర్షీ! నేను ధరించిన అవతారాల్లో మొదటిది, గొప్పది మత్స్యావతారం. అది ప్రస్తుతం మానససరోవంలో ఉన్నది.

1.మానససరోవరంలో–మత్స్యావతారం (మత్స్యం)

2.కౌశికీనదిలో–కూర్మావతారం (కూర్మం)

3.కృష్ణాంశతీర్థంలో–హయగ్రీవరూపం 4.హస్తినాపురంలో – గోవిందరూపం

5.యమునానదిలో–త్రివిక్రమరూపం 6.లింగభేద క్షేత్రంలో – భవరూపం

7. కేదార క్షేత్రంలో–మాధవశౌరి రూపాలు

8.కుబ్జాశ్రమంలో–హృష్టమూర్ధజ 9.బదరికాశ్రమంలో–నారాయణుడు

10.గరుడానన క్షేత్రంలో–వరాహమూర్తి 11.భద్రకర్ణంలో–జయేశ్వరుడు

12.విపాశానదిలో–బ్రాహ్మణప్రియుడు

13.ఇరావతిలో–రూపధురుడు 14.కురుక్షేత్రంలో–కురుధ్వజుడు

15.కృతశౌచంలో–నృసింహుడు 16.గోకర్ణంలో–విశ్వకర్మ

17.ప్రాచీనంలో–కామపాలుడు 18.మహాంభసంలో–పుండరీకుడు

19.విశాఖయూపంలో–అజితుడు 20.హంసపది క్షేత్రంలో–హంసుడు

21.పయోష్ణిక్షేత్రంలో–అఖండుడు 22. వితస్తానదిలో–అజితుడు

23.మణిపర్వతంలో – శివుడు 24.బ్రహ్మణక్షేత్రంలో – ప్రజాపతి

| | |
|---|---|
| 25. మధునదిలో - చక్రధరుడు | 26. హిమాలయంలో - శూలపాణి |
| 27. ఓషధిప్రస్థంలో - విష్ణువు | 28. భృగుతండంలో - సువర్ణాక్షుడు |
| 29. నైమిశంలో - పీతాంబరుడు | 30. గయాక్షేత్రంలో - గదాధరుడు |
| 31. గోప్రతారంలో-త్రైలోక్యనాథుడు | 32. మహేంద్రగిరిమీద-అర్ధనారీశ్వరుడు |
| 33. ఉత్తరమహేంద్రంలో-గోపాలుడు | 34. సహ్యగిరిమీద - వైకుంఠుడు |
| 35. పారియాత్రగిరిమీద-అపరాజితుడు | 36. కవేరుదేశంలో-దేవేశ్వరుడు |
| 37. వింధ్యపాదాన - సదాశివుడు | 38. అవంతీ దేశంలో - విష్ణువు |
| 39. నిషధ రాజ్యంలో-అమరేశ్వరుడు | 40. పాంచాల భూమిలో-పాంచాలికదేవుడు |
| 41. మహోదయంలో-హయగ్రీవుడు | 42. ప్రయాగలో-యోగశాయి |
| 43. మధువనం-స్వయంభూదేవుడు | 44. పుష్కరక్షేత్రంలో-కేశవుడు |
| 45. పద్మక్షేత్రంలో-పద్మకిరణుడు | 46. సముద్రంలో-బడబానలుడు |
| 47. కుమారధారలో-కార్తికేయుడు | 48. అజేశ క్షేత్రంలో-శంభుడు |
| 49. కురుజాంగలంలో-స్థాణేశ్వరుడు | 50. కిష్కింధలో-వనమాలి |
| 51. నర్మదలో-వీరుడు | 52. మాహిష్మతిలో-త్రిసమానుడు |
| 53. అర్బుదక్షేత్రంలో-త్రిసౌపర్ణుడు | 54. సూకరాచలంలో-క్ష్మాధరుడు |
| 55. ప్రభాసక్షేత్రంలో-త్రిణాచికేతుడు | 56. ఉభయతీర్థంలో-శశిధరుడు |
| 57. హేమకూటంలో-హిరణ్యాక్షుడు | 58. శరవణంలో-స్కందుడు |
| 59. మహాలయంలో-రుద్రుడు | 60. ఉత్తరకురుదేశంలో-పద్మనాభుడు |
| 61. సప్తగోదావరిలో-హాటకేశ్వరుడు | 62. ప్రయాగలో-వటేశ్వరుడు |
| 63. శోణక్షేత్రంలో-రుక్మకవచుడు | 64. కుండినంలో-ఘ్రాణతత్పరుడు |
| 65. ఖిల్లీవనంలో-మహాయోగి | 66. మద్రదేశంలో-పురుషోత్తముడు |
| 67. ప్లక్షావతరణంలో-విశ్వుడు | 68. శూర్పారకంలో-చతుర్భుజుడు |
| 69. మగధలో-సుధాపతి | 70. గిరివ్రజంలో-పశుపతి |
| 71. యమునాతీరంలో-శ్రీకంఠుడు | 72. దండకారణ్యంలో-వనస్పతి |

73.కాలింజరంలో–నీలకంఠుడు 74.సరయూతీరంలో–శంభుడు

75.మనోకోశిలో–హంస 76.దక్షిణ గోకర్ణంలో–శర్వుడు

77.ప్రజాముఖతీర్థం–వాసుదేవుడు 78.వింధ్యశిఖరంలో–మహాశౌరి

79.కంధంలో–మధుసూదనుడు 80.త్రికూటశిఖంమీద–చక్రపాణి

81.లోహదడంలో–హృషీకేశుడు 82.కోసలదేశంలో–మనోహరుడు

83.సురాష్ట్రంలో–మహాభుజుడు 84.దేవికానదిలో–భూధరుడు

85.మహోదక్షేత్రంలో–కుశప్రియుడు 86.గోమతీనదిలో–ఛాదితగదుడు

87.శంఖోద్ధారంలో–శంఖి 88.సైంధవారణ్యంలో–సునేత్రుడు

89.శూరపురంలో–శూరుడు 90.హిరణ్యదతిలో–రుద్రుడు

91.త్రివిష్టపంలో–వీరభద్రుడు 92.భీమాతీరంలో–శంకుకర్ణుడు

93.శాలవనంలో–భీముడు 94.కైలాసంలో – వృషభధ్వజుడు

95.మహేశగిరిమీద–మహేశుడు 96.సింహళద్వీపంలో – ఉపేంద్రుడు

97.శక్రతీర్థంలో–కుందమూలాధరుడు 98.రసాతలంలో–సహస్రశీర్షుడు

99.సుతలంలో–శ్రీకూర్ముడు 100.వితలంలో–పంకజాసనుడు

101.మహాతలంలో–ఛాగలేశుడు 102.తలాతలంలో–సహస్రచరణుడు

103.పాతాళంలో–యోగీశుడు 104.ధరాతలంలో–కోకనదుడు

105.మేదిని మీద–చక్రపాణి 106.భువర్లోకంలో–గరుత్మంతుడు

107.స్వర్లోకంలో–విష్ణువు 108.మహర్లోకంలో–అగస్త్యుడు

109.జనోలోకంలో–కపిలుడు 110.తపోలోకంలో–సత్యసంయుతుడు

111.సత్యలోకంలో – బ్రహ్మదేవుడు

భరద్వాజా! ఈ తీర్థాలు క్షేత్రాలలోనే కాక నేను శైవ వాతావరణంలో – సనాతనుడిగా, వైష్ణవ సముదాయంలో పరబ్రహ్మగా, నిరాలంబ స్థితిలో

అప్రతర్క్యుడిగా, నిరాకాశంలో తపోమయుడిగా, జంబూ ద్వీపంలో గరుడవాహనుడిగా, క్రౌంచ ద్వీపంలో పద్మనాభుడిగా, శాల్మల ద్వీపంలో వృషభధ్వజుడిగా, శాకద్వీపంలో సహస్రాంశుడిగా, పుష్కర ద్వీపంలో ధర్మరాజుగా, నేనే ఆయారూపాల్లో కొలువై ఉన్నాను.

ఈ విధంగా శాలగ్రామాలలో, జలస్థలాలలో, స్థావర జంగమ జీవులందరిలో నేను నివసిస్తాను. సనాతనమైనవి, పురాతనమైనవి, పవిత్రమైనవి నేనుండే దివ్యస్థలాలు. ఇవన్నీ ధర్మప్రదాలు, తేజో మయాలు. సకలపాప వినాశకాలు, నేను తెలిపిన ఈ క్షేత్రాలు, స్థలాలు, సదా కీర్తించతగినవి. ఈ స్థలాలలో ఉన్న దేవతల్ని దర్శించి లేక స్మరించి, కీర్తించిన వారికి చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి.

సాక్షాత్తు వామనావతారాన్ని ధరించిన శ్రీహరి స్వయంగా తెలిపిన భగవంతుడి స్థానాలు ఇవి. వీటిని గురించి విన్నా, చదివినా అనంతమైన పుణ్యం లభిస్తుంది.

## సుదర్శన చక్ర స్తవం

పూర్వం వామనుడి విజృంభణతో పాతాళానికి పంపబడ్డ బలిచక్రవర్తి, ఆ లోకంలో అందమైన నగరాన్ని నిర్మించుకున్నాడు. వజ్రాల అరుగులతో, ముత్యాలతోరణాలతో విశ్వకర్మ నిర్మించిన విశాలమైన భవనాలలో ఆనందంగా నివసిస్తూ వివిధ రకాల దైవ, మానుష భోగాల్ని అనుభవించసాగాడు. తన వేయిమంది భార్యలలో ప్రధానురాలైన వింధ్యావళితో కలిసి సుఖభోగాల్లో మునిగి తేలుతున్నాడు.

ఒకనాడు ఆ పాతాళ లోకానికి రాక్షసులు తేజస్సుల్ని హరించే శ్రీహరి సుదర్శన చక్రం వచ్చింది. ఆ దివ్య చక్రం పాతాళంలోకి రాగానే సముద్ర తరంగాలు ఉవ్వెత్తున పైకి లేచిన ధ్వని వినిపించింది. ఆ శబ్దం వినగానే బలిచక్రవర్తి తన ఖడ్గాన్ని పైకి తీసి ఏమిటీ ధ్వని? ఎవరు చేసారు? అని ఆగ్రహంగా అరిచాడు. అతడి భార్య వింధ్యావళి బలిని శాంతపరిచి "ప్రభూ!

మీరు విన్న ధ్వని శ్రీహరి సుదర్శన చక్రానిది. మహాత్ముడైన వాసుదేవుడి దివ్యాయుధం అది. దాన్ని పూజించటం మన కర్తవ్యం"అని చెప్పి చేతిలో అర్ఘ్య పాత్రని తీసుకుని భర్తతో సహా ఆ చక్రం దగ్గరకి బయల్దేరింది. అంతలోనే సుదర్శన చక్రం వారి దగ్గరకే వచ్చింది. దివ్యతేజస్సుతో కోటి సూర్యుల కాంతిలో సమానంగా వెలిగి పోతున్న ఆ సుదర్శనాన్ని చూసి, తన్మయత్వంతో పరవశించాడు. బలి ఆ సుదర్శనుణ్ణి పూజించి ఆయన్ని ఇలా ఘనంగా కీర్తించాడు.

నమస్యామి హరేశ్చక్రం దైత్య చక్ర విదారణమ్ ।
సహస్రాంశుం సహస్రాభం సహస్రారం సునిర్మలమ్ ॥ 1

నమస్యామి హరే శ్చక్రం యస్య నాభ్యాం పితామహః ।
తుండే త్రిశూల ధృక్ శర్వ ఆరా మూలే మహాద్రయః ॥ 2

ఆరేషు సంస్థితా దేవాః సేంద్రాః సార్కాః సపావకాః ।
జవే యస్య స్థితో వాయు రాపో ఽగ్నిః పృధివీ నభః ॥ 3

ఆర ప్రాంతేషు జీమూతాః సౌదామి నృక్షతారకాః ।
బాహ్యాతో మునయో యస్య వాలఖిల్యాఽదయ స్తథా ॥ 4

తమాయుధ వరం వందే వాసుదేవస్య భక్తి తః ।
యన్మే పాపం శరీరోత్థం వాగ్జం మానస మేవ చ ॥ 5

తన్మే దహస్వ దీప్తాంశో ! విష్ణో ! శ్చక్ర సుదర్శన! ।
యన్మే కులోద్భవం పాపం పైతృకం మాతృకం తథా ॥ 6

తన్మే హరస్వ తరసా నమస్తే అచ్యుతాయుధ! ।
అధయో మమ నశ్యంతు వ్యాధయో యాంతు సంక్షయమ్ ।
కీర్తనాచ్చక్ర । దురితం యాతు సంక్షయమ్ త్వన్నామ ॥ 7

*(శ్లో॥11-17,అధ్యా-67)*

"దైత్య చక్రాన్ని నాశనం చేయగలిగిన శ్రీహరి దివ్య చక్రాన్ని నమస్కరిస్తున్నాను. వేయి కిరణాల దీప్తితో, వేయి అంచులు కలిగిన పవిత్రమైన

చక్రానికి నమస్కరిస్తున్నాను. ఓ చక్రేశ్వరా! నీ నామ స్మరణతో నా కష్టాలన్నీ క్షయమైపోగాక! నీకు శతకోటి నమస్కారాలు".

ఈ విధంగా దైత్య రాజు బలి చక్రవర్తి స్తుతి విన్న చక్రేశుడు. అతన్ని ఆశీర్వదించి పాతాళంలో ఉన్న ఇతర రాక్షసుల తేజస్సుల్ని అపహరించి పాతాళం వదిలి వెళ్ళి పోయాడు.

## వామనపురాణం - ఫలశ్రుతి

అత్యంత పుణ్యప్రదమైన ఈ వామనపురాణాన్ని శ్రద్ధా భక్తులతో విన్నా, చదివినా, బోధించినా, విష్ణుపదప్రాప్తి కలుగుతుంది. గంగానదీ జలాల్లో మునిగితే పాపం తొలగిపోయినట్టే ఈ పురాణ శ్రవణం వల్ల పాపాలు తొలగిపోతాయి. ఈ వామన పురాణాన్ని చదివించుకుని విన్నవారికి ఎలాంటి వ్యాధులూ కలగవు. విష, మంత్ర, తంత్ర ప్రయోగాలు బాధించవు.

నారీనరశ్చాపి పాదమేకంశృణ్వన్ శుభః పుణ్యతమః పృథివ్యామ్ ।
స్నానేకృతే తీర్థవరే సుపుణ్యే గంగాజలే నైమిష పుష్కరేవా ।
కోకాముఖేయత్ ప్రవదంతి విప్రాః ప్రయాగదం పాద్య చ మాఘమాసే ॥

*(శ్లో॥5-6,అధ్యా-69)*

స్త్రీలుగానీ, పురుషులు గానీ ఈ పురాణంలో ఒక శ్లోకంలో కనీసం ఒక పాదాన్నైనా భక్తితో వింటే వారు పవిత్రులవుతారు. నైమిశారణ్యం పుష్కర క్షేత్రాల్లో పుణ్యస్నానాలు చేస్తే ప్రయాగలో మాఘస్నానం ఆచరిస్తే గంగానదిలో, కోకాముఖ క్షేత్రంలో స్నానం చేస్తే ఎంత పుణ్యఫలం లభిస్తుందో, అనునిత్యం వామనపురాణం వింటే అంతే ఫలం లభిస్తుంది.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



